# సరదాగా....

## కష్టపడేతత్వం

"పిన్నిగారూ.. మీ కొత్త కోడలుపిల్ల ఎలా ఉంది?" అడిగింది పక్కింటి రంజని.

"బ్రహ్మాండంగా ఉంది. చాలా కష్టపడేతత్వం గల పిల్ల. రాత్రీ పగలూ తేడా లేకుండా ఎప్పుడూ పనిలోనే ఉంటుంది. ఇప్పటికే క్యాండీక్రష్ 450 లెవెల్‌కి చేరుకుంది. వాట్సాప్‌లో 25 గ్రూప్స్ నడుపుతోంది. ఫేస్‌బుక్‌లో 5వేల మంది ఫ్రెండ్స్, వెయ్యిమంది ఫాలోవర్లు ఉన్నారు. ఇంకా ఓ 16 గ్రూపులకి అడ్మిన్ కూడా... అందుకే రేపటినుంచి రోజూ బాదం పాలు, డ్రైఫ్రూట్స్ పెడదామని అనుకుంటున్నాను" అంది గుక్కతిప్పు కోకుండా వరలక్ష్మి తన కోడలు గురించి గొప్పగా చెబుతూ.

## ఒక ప్రశ్న?

నిరంజన్ ఇంట్లోనే ఐస్‌క్రీమ్స్ తయారుచేసి, అమ్ముతుంటాడు. ప్రతిరోజూ నిరంజన్ ఐస్‌క్రీం బండి పటేల్ కాలనీకి వెళ్ళాల్సిందే! ఎందుకంటే ప్రతిరోజూ ఆ వీధిలో పిల్లలు నిరంజన్ ఐస్‌క్రీం కోసం ఎదురుచూస్తూ ఉంటారు. అయితే ఆ కాలనీకో విశేషం ఉంది. సరిసంఖ్యలున్న ఇళ్ళు ఒకవైపు, వాటికి ఎదురుగా బేసిసంఖ్య నంబర్లున్న ఇళ్ళు ఉంటాయి. ఆరోజు నిరంజన్ ఐస్‌క్రీం బండి దగ్గరికి ఐదుగురు పిల్లలు వచ్చారు. వాళ్ళందరూ కాలనీలోని మొదటి ఐదు ఇళ్ళల్లోని పిల్లలే. వాళ్ళు వాళ్ళకి ఇష్టమైన టాపింగ్‌తో, ఇష్టమైన ఫ్లేవర్డ్ ఐస్‌క్రీం తీసుకున్నారు. అయితే ఇక్కడ ప్రశ్న ఏంటంటే కింద ఇచ్చిన క్లూల ఆధారంగా ఎవరు ఏ ఇంటి నంబర్‌లో ఉంటారో, ఎవరు ఏ ఐస్‌క్రీం తీసుకున్నారో, వాటి టాపింగ్స్ ఏంటో తెలుసుకోగలరేమో ప్రయత్నించండి.

1. రాస్ప్‌బెర్రీ టాపింగ్‌తో ఉన్న ఐస్‌క్రీం కొన్న పిల్లవాడి ఇంటికి, పైనాపిల్ ఐస్‌క్రీం కొన్న పిల్లవాడి ఇంటికి మధ్య ఉన్న ఇంట్లో సిరి ఉంటుంది.
2. రింకీ వాళ్ళ ఇంటినెంబరు సరిసంఖ్య. అతడు గ్రేప్ టాపింగ్‌తో ఉన్న ఐస్‌క్రీం తీసుకున్నాడు. రింకీ వాళ్ళ పక్కింట్లో ప్రత్యూష్ ఉండడు.
3. ఎవరైతే చాక్లెట్ ఐస్‌క్రీం తీసుకున్నారో, దానికి టాపింగ్ లేదు.
4. ఇంటినెంబరు 2లో ఉన్న పిల్లాడు మిక్స్‌డ్ ఫ్రూట్ ఐస్‌క్రీం తీసుకున్నాడు. ఇంటినెంబరు 3లో ఉండే పిల్లాడు రాస్ప్‌బెర్రీ ఐస్‌క్రీం తీసుకోలేదు.
5. శాన్వి ఆరెంజ్ ఐస్‌క్రీం తీసుకుంది. కానీ ఆమెకు ఆరెంజ్ గ్రేప్ టాపింగ్ అంటే అస్సలు పడదు.
6. వాల్‌నట్ టాపింగ్ ఉన్న ఐస్‌క్రీం తీసుకున్న పిల్లవాడు ఇంటినెంబరు 5లో ఉంటాడు. రిత్విక్ ఇంటి నెంబరు 4లో ఉండడు.

### సమాధానం

సిరి ఇంటినెంబరు 3లో ఉంటుంది. ఆమె చాకొలెట్ ఐస్‌క్రీం, టాపింగ్ లేనిది తీసుకుంది.

రిత్విక్ ఇంటినెంబరు 2. అతడు ఆరెంజ్ గ్రేప్ టాపింగ్ ఉన్న మిక్స్‌డ్ ఫ్రూట్ ఐస్‌క్రీం తీసుకున్నాడు.

ప్రత్యూష్ ఇంటినెంబరు 5. వాల్‌నట్ టాపింగ్‌తో పైనాపిల్ ఐస్‌క్రీం తీసుకున్నాడు.

రింకీ ఇంటినెంబరు 4. గ్రేప్ టాపింగ్‌తో ఉన్న రాస్ప్‌బెర్రీ ఐస్‌క్రీం తీసుకున్నాడు.

శాన్వి ఇంటినెంబరు 1. రాస్ప్‌బెర్రీ టాపింగ్‌తో ఉన్న ఆరెంజ్ ఐస్‌క్రీం తీసుకుంది.



# 8

## సమస్త నేస్తం...పుస్తకం

చినిగిన చొక్కా అయినా తొడుక్కో, కానీ మంచి పుస్తకం కొనుక్కో అన్నారు వీరేశలింగం. ఒంటరితనంలో స్నేహితుడు, అలసిన మనసును సేదదీర్చే అనితరసాధ్యమైన ఆయుధం పుస్తకం. ఏప్రిల్ 23 ప్రపంచ పుస్తక దినోత్సవం సందర్భంగా ప్రత్యేక కథనం..

**40**

### మనసుగతి ఇంతే!

(కొత్త సీరియల్ ప్రారంభం)

తొలిచూపులోనే గాఢంగా ప్రేమించాడామెను. తన రక్తం నిండుగా నింపుకున్నాడు. అది మామూలు ప్రేమ కాదు. కానీ.. ఏం జరిగింది? మనసు గతి ఇంతే!

**72**

### ఇంటర్వ్యూ

రేసుగుర్రం లాంటి బ్లాక్‌బస్టర్ చిత్రాల కథా రచయిత వక్కంతం వంశీ. తాజాగా దర్శకత్వశాఖలో ప్రవేశిస్తున్నారు. ప్రేక్షకుణ్ణి మాయ చెయ్యాలిగానీ, మోసం చెయ్యకూడదంటున్న వంశీ ఇంటర్వ్యూ...

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: లావణ్య త్రిపాఠి
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### మంచి-చెడు

కొత్తగా ప్రాక్టీసుపెట్టిన లాయర్లిద్దరు, సెక్రటరీగా పల్లెటూరి నుంచి ఓ అమ్మాయిని తెచ్చుకున్నారు. అందమైన ఆ అమ్మాయి అమాయకురాలు. ఆమెకు పట్నం గురించీ పట్నం మనుషుల గురించీ తెలియదు. ఆమెను కాపాడడం పెద్ద సమస్యయింది లాయర్లకి.

"అమ్మాయి అందమైంది. యవ్వనంలో ఉంది. ఎప్పుడు ఎవడు ఏం చేస్తాడో తెలియదు. పట్నం కుర్రకారుని నమ్మలేం. అందుకని అమ్మాయికి ఇది మంచి, ఇది చెడు అని చెప్పాలి. ఆ బాధ్యత మనం తీసుకోవాలి. ఏమంటావ్?" అన్నాడో లాయరు.

"అవునవును! ఆ బాధ్యత మనదే! నువ్వు ఆ అమ్మాయికి మంచి చెప్పు, నేను చెడేంటో చెబుతాను." అన్నాడు ఇంకో లాయరు.

### ప్రాబ్లం

**భార్య:** ఏంటండీ ఇది? మీరు ఆఫీసుకి వెళ్ళినప్పుడు కూడా నా ఫొటో మీ పర్సులో ఉండాలా?

**భర్త:** ఉండాలి. ఆఫీసులో ఎలాంటి సమస్య అయినా నీ ఫొటో చూస్తే చాలు! ఇట్టే సాల్వ్ అయిపోతుంది.

**భార్య:** నిన్ను చూస్తే చాలే! ఎలాంటి పనైనా అయిపోతుంది అని మా అమ్మమ్మ అంటుంటే నమ్మేదాన్ని కానుగానీ, మీరిప్పుడు చెబుతోంటే నమ్మాలనిపిస్తోంది.

**భర్త:** నమ్మాలి. ఆ మాట నిజం. ఎంత పెద్దప్రాబ్లం వచ్చినా నీ ఫొటో చూస్తూ ఇంతకన్నా ఇది పెద్ద ప్రాబ్లమా అనుకుంటాను, అంతే! ప్రాబ్లం సాల్వ్.

### ప్లీజ్

సందర్శకుల ముందు నిలబడి గైడ్ చెబుతున్నాడిలా.

"అందమైంది నయాగరా జలపాతం. అలాగే ఇది ప్రపంచంలోనే లార్జెస్ట్ జలపాతం కూడా. చూశారా! ఎంత ఎత్తు మీద నుంచి కింద పడుతోందో? ఈ శబ్దం ముందు ఇరవై సూపర్‌సోనిక్ విమానాలు వెళ్తున్నా మనకి వినిపించదు." అని గుంపుగా మాట్లాడుకుంటున్న అక్కడి మహిళా సందర్శకులను ఉద్దేశించి అరిచాడిలా.

"మేడం! కొంచెం మెల్లిగా మాట్లాడుకోండి! మావాళ్ళు నయాగరాహోరు వింటారు. ప్లీజ్."

### ఒకటే

"పెళ్ళి అన్న ఆలోచన లేకుండా ఎందుకే మగాళ్ళు మనవెంట పడతారు?" అడిగిందో స్నేహితురాలు.

"డ్రైవింగ్ చెయ్యాలన్న కోరికా పాడా, కుక్కలెందుకు కార్ల వెంటపడతాయి. అదీ ఇదీ ఒకటే." అంది ఇంకో స్నేహితురాలు.

### అంటారు

పెళ్ళికి ముందు భార్య చేయి భర్త పట్టుకుంటే దాన్ని 'లవ్' అంటారు. పెళ్ళి తర్వాత కూడా పట్టుకుంటే దాన్ని 'సెల్ఫ్ డిఫెన్స్' అంటారు.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 8
26-4-2017



మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎస్.జగన్నాథశర్మ

# మొదటి పేజి

## అమ్మఒడి

చుక్కపొడవాలి. చంద్రుడు ఉదయించాలి. చల్లగా వెన్నెలో, వానో, మంచో ముసరాలి. ముసరితేనే జానకమ్మ మేల్కొం టుంది. అటు సూర్యుడు అస్తమిస్తూనే ఇటు జానకమ్మ ఉదయిస్తుంది. టీకొట్టు లోపలా బయటా కళ్ళాపి జల్లి, ముగ్గు వేస్తుంది. దీపం పెట్టి, నిప్పు రాజేస్తుంది. ఇడ్లీ, చపాతీ, టీ చేయడంలో మునిగిపోతుంది. సాయంత్రం ఏడుగంటలకి తెరుచుకునే జానకమ్మటీకొట్టు పొద్దున ఏడుగంటల వరకూ మూసుకుపోదు. ఏడు దాటిందంటే మూసుకుపోతుంది. ఎందుకంటే... జానకమ్మ నిద్రపోతుంది.

హైవేమీద జానకమ్మ టీకొట్టుకి చాలా పేరుంది. పెద్దపెద్ద వాహనాలు నడిపే డ్రైవర్లందరికీ జానకమ్మంటే గౌరవం ఉంది. అభి మానం ఉంది. జానకమ్మకు రాని భాషలేదు. ఏ భాషలోనైనా జానకమ్మ అనర్గళంగా మాట్లాడగలదు. ఉత్తరాది దక్షిణాదిభాషల్ని చించి ఆరేస్తుందామె. ఎలా నేర్చుకున్నావు ఇన్ని భాషలంటే? అలాగే అంటుంది జానకమ్మ. అవసరం, ఆనందం దేన్నయినా నేర్పుతాయని నవ్వుతుంది. ఆ నవ్వు ఓ అద్భుతం. జానకమ్మ నవ్విందంటే మల్లెలు విరిసినట్టుగానో, మంచు కురిసినట్టుగానో చల్లగా హాయిగా ఉంటుంది. ఆ నవ్వుకే ఒకప్పుడు రాయుడుగారు పడిపోయారు. అప్పుడు జానకమ్మ జానకిగా ఉండేది. పద్దెనిమిదేళ్ళ ప్రాయంలో ఉండేది. అందంగా, ఆకర్షణీయంగా ఉండేది. పద్దెనిమిదేళ్ళ జానకి, హైవే మీది మామిడితోటలో దొంగతనంగా ఓ మామిడికాయను తెంచి, తోటమాలికి దొరక్కుండా నవ్వుతూ పరుగెడుతోంటే కార్లో వెళ్తూ ఆమెను చూశారు రాయుడుగారు. కారాపి పట్టుకున్నారామెను. దొంగ దొరికిందన్నారు. వదిలేయ్ స్వామీ! కావాలంటే కాకెంగిలి చేసి, నీకూ మామిడిముక్క పెడతానంది జానకి. నా పట్టులో నువ్విలా కలకాలం ఉండిపోతానంటే చెప్పు, మొత్తం ఈ ముప్పయి ఎకరాల మామిడితోటా నీకే రాసిస్తానన్నారు రాయుడుగారు. నిజం అంది జానకి. కాయలతో నిండిన మామిడిచెట్లను చూసి పొంగిపోతూ ఒట్టు అని చేయి జాచింది. ఒట్టు అన్నారు రాయుడు గారు. ఆమె చేతిలో చేయి వేశారు. నవ్వింది జానకి. రాయుడుగారి అర్ధాంగి అయిపోయింది.

మామిడితోటలోనే పెద్దమహల్ కట్టించారు రాయుడుగారు. జానకితో అక్కడే ఉండిపోయి, అప్పుడప్పుడూ పట్నంలోని కచేరీకి వెళ్ళి వస్తూ ఉండేవారు. ఓసారి ఏదో పని మీద వారంపాటు పట్నానికి వేళాపాళా లేకుండా రాయుడుగారు వెళ్ళడం, రావడం జరిగింది. ఈ వారంపాటూ ఆయన కారుడ్రైవర్‌కి నిద్ర కరువైంది. దాంతో ఓ తెల్లారుజామున పట్నం నుంచి తోటలోని మహల్‌కి రాయుడుగారిని తీసుకువస్తూ నిద్రమత్తులో కన్ను మూసి, తెరిచాడు డ్రైవర్. అంతే! జరగరానిది జరిగిపోయింది. ప్రమాదం జరిగి, కారు బోల్తాపడింది. రాయుడుగారు అక్కడికక్కడే చనిపోయారు. డ్రైవర్ రెండు కాళ్ళూ పోయాయి. చనిపోయిన రాయుడుగారినీ, కాళ్ళుపోయిన డ్రైవర్నీ చూసి ఏడాదిపాటు మనిషి కాలేకపోయింది జానకి. ఆలోచిస్తూ ఒంటరిగా కూర్చునేది. హైవే మీద రోజుకో ప్రమాదం. కారణం నిద్రలేమి. కూడు, గుడ్డ, గూడు లాగే నిద్ర కూడా మనిషికి అత్యవసరం. ఆ అవసరాన్ని తీర్చగలగాలి. తీరిస్తే పుణ్యం మాట దేవుడెరుగు! ప్రమాదాల్ని అరికట్టినట్టవుతుంది అనుకున్నది జానకి. అప్పుడే టీకొట్టు తెరిచింది. అలాగే తానుండే మహల్‌ను పడకటిల్లు చేసింది. అయిదు అంతస్తుల మహల్‌లో వందమంచాలు వేసింది. డ్రైవర్ల కళ్ళ బరువు తీర్చేందుకు శ్రీకారం చుట్టింది. అన్నీ నామమాత్రపు ధరకే అందించసాగింది. అప్పటి నుంచే జానకి 'జానకమ్మ' అయింది.



ఇదంతా ఎందుకు తల్లీ? డబ్బంతా ఎందుకు దండగ చేస్తున్నావంటే...రాయుడుగారు నన్నెందుకు కట్టుకున్నారు? ఈ మహల్ ఎందుకు కట్టారు? ఈ తోట ఎందుకు రాసిచ్చారు? మంచి చేస్తాననన్న నమ్మకం నా మీద. వారి నమ్మకాన్ని వమ్ము చెయ్యనన్నది జాన కమ్మ సమాధానమైంది. ఆనందం అయింది. ఆ ఆనందాన్ని సాటివారు మరింత బలోపేతం చేశారు. దాంతో డ్రైవర్లకోసం జానకమ్మ టీకొట్టు పక్కన క్షౌరశాల వెలిసింది. క్లినిక్, మందుల దుకాణం కూడా వెలిశాయి. ఆ ప్రాంతాన్ని ఇప్పుడు అంతా 'అమ్మఒడి'గా వ్యవ హరిస్తున్నారు. అలాగే పిలుస్తున్నారు.

ఎప్పటికథ ఇది? చాలా ఏళ్ళనాటిది. ఇప్పుడు జానకమ్మ లేదు. అయితే ఆ టీకొట్టూ, ఆ మహలూ, ఆ తోటా అలాగే ఉన్నాయి. నడుస్తున్నాయి. అమ్మఒడి వస్తోందంటే చాలు డ్రైవర్‌కి నిద్రవస్తుంది. జానకమ్మ కూడా గుర్తొస్తుంది. ఆమె గుర్తొస్తే చాలు! చేతు లెత్తి దండం పెట్టాలనిపిస్తుంది.

# మెయిల్ బాక్స్ mailbox

### ఉగాది ముఖచిత్రం దేదీప్యమానం

సురేష్ కడలి కుంచెనుంచి ఊపిరి పోసుకున్న రతీమన్మథుల ముఖచిత్రం దేదీప్యమానంగా వెలిగిపోయింది. మొదటిపేజీ హృద్యంగా ఉంది. భానుప్రియ ఇంటర్వ్యూ బాగుంది. ర్యాలిప్రసాద్ 'వెతుకులాట' కవిత భావగర్భితంగా ఉంది. బాచిగారు తీన్మార్ అదరగొట్టేశారు.

**—నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం**

### ముఖచిత్రం రమణీయం

రతీమన్మథుల ముఖచిత్రం రమణీయం, మళ్ళీ మళ్ళీ చూస్తూ అలాగే ఉండిపోయాం. బహుమతి కథ 'ఎథిక్స్' బహు బాగు బాగు. కొంటె కుర్రాడి ప్రశ్నకు జవాబుగా ఎస్వీ సత్యనారాయణ వైస్ ఛాన్సలర్‌గా ఎదిగిన వైనం స్ఫూర్తిదాయకం.

**—చైతన్య, వాకలపూడి**

### అన్నీ ఆకర్షణలే

ఉగాది కవితలతో నవ్య వీక్లీ సుందరంగా ముస్తాబై వెలువడింది. కథల పోటీ ఫలితాలు, కలర్ కార్టూన్లు, హేవళంబి రాశిఫలితాలు..ఇలా అన్నీ ఆకర్షణలే. 'దానకర్ణుడు' మొదటిపేజీ కథ చాలా బాగుంది. భానుప్రియ ఇంటర్వ్యూ చాలా చాలా నచ్చింది. 'ఎథిక్స్' కథ శైలి, శిల్పం బాగుంది.

**—శశిరేఖా లక్ష్మణన్, చెన్నై–60**

### ఎథిక్స్ కథ చాలా బాగుంది

ఉగాది సంచిక వసంత శోభ తెచ్చింది. కథలు, సీరియల్స్ బాగున్నాయి. ముఖ్యంగా ఎథిక్స్ కథ చాలా బాగుంది. మానవతా విలువలకు అద్దం పట్టింది. చక్కటి కథ అందించిన రచయితకు ధన్యవాదాలు. హరివంశం అందిస్తున్న అరణిగారి మొదటి పేజీ పెద్ద సందేశం ఇస్తోంది.

**– కె.పి.కుమారి, కాకినాడ**

### బ్యూటిఫుల్

అనుష్క, తమన్నా కవర్ చిత్రాలు సో బ్యూటిఫుల్. అవమానాలను ఆశీర్వాదాలుగా తీసుకుని లక్ష్యసాధనకు కృషి చేస్తే విజయం ఖాయం అని నిరూపించాడు లంబోర్గిని. ఫిడెల్ క్యాస్ట్రో ప్రేమ కహానీ, కృష్ణకుమారి కథనం, ఆమె జీవిత చరిత్ర ఆసక్తి రేకెత్తించింది.

**—తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం**

### వెండితెర ఉత్తమ నటి ప్రభ

కోటిసూర్య ప్రభ తెనాలిలో అరేళ్ళ వయసులో నాట్యం చేసినప్పటినుండీ నాకు తెలుసు. ఆమె ఉత్తమ వెండితెర నటి. అది నిజం. మరొక విషయం. నేను రంగస్థలంపై దాదాపు నలభైమంది స్త్రీ పురుషులను కూచిపూడి భామలుగా చూశాను. వారిలో ఏ ఒక్కరికీ అందంలో, నాట్యంలో, నటనలో వేటిలోనూ ప్రభ తీసిపోదు.

**—వి.ఎ.కె. రంగారావు, మద్రాసు–06**

### అంటరాని వసంతం సూపర్బ్

'అంటరాని వసంతం' కథ సూపర్బ్. తటవర్తి నాగేశ్వరి అభినందనీయురాలు. మరణించిన మనిషితో మూడుముళ్ళ బంధం గురించి ఎన్నెన్నో విషయాలు తెలుసుకున్నాం. నిజమైన ప్రేమికులు వారే.

సినీవాలి గురించి ఎంత చెప్పినా చాలదు. అదొక సంచలన నవల. హరివంశం ఎంతో విజ్ఞాన భాండాగారం. ప్రతిభారతీయుడు పౌరాణిక సంఘటనలను గుర్తుంచుకోవాలి. సరసి, బాచి, కామేష్, కందికట్ల, విశ్వరత్న, బి.ఎ.ఎస్ గారి కార్టూన్లు కడుపుబ్బ నవ్విస్తున్నాయి. రివ్యూలో రాజశుక వ్యాఖ్యానాలు అక్షర సత్యాలు.

**—పక్కి బాలకృష్ణ, విజయనగరం**

### అనుష్క ముఖచిత్రం హాయిగొలిపింది

స్పష్టమైన ముఖవర్ఛస్సుతో నిటారు పోకడలో నిలిచినట్టున్న అనుష్క ముఖచిత్రం హాయిగా ఉంది. శ్రీరామ కల్యాణవైభోగం సచిత్రంగా ఉంది. స్వచ్ఛంద దేశభక్తుడు, నిజాయితీపరుడైన ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి ఆ రాష్ట్రాన్ని పురోగామిదిశగా తీసుకెళ్ళగలడు. మహానటి కృష్ణకుమారి పెళ్ళికానుక, భార్యాభర్తలు లాంటి చిత్రాల్లో అద్భుతంగా నటించింది.

**—వాస్తు రామచంద్ర, నెల్లూరు**



పుస్తకావిష్కరణ దృశ్యం

## దేవిప్రియ కవిత్వం 'ఇం..కొకప్పుడు' ఆవిష్కరణ

ప్రముఖ కవి దేవిప్రియ కొత్త కవితా సంకలనం 'ఇం..కొకప్పుడు' ఆవిష్కరణ సభ హైదరాబాద్‌లో ఎందరో అభిమానులు, కవులు, రచయితల కరతాళ ధ్వనుల మధ్య ఆహ్లాదకరంగా జరిగింది. దేవిప్రియ తన జ్ఞాపకాలను ఈ కవితల్లో నిక్షిప్తం చేశారనీ, ఇవన్నీ హృదయానికి దగ్గరగా వచ్చే కవితలేననీ పలువురు వక్తలు తమ విశ్లేషణలో శ్లాఘించారు.

ఏప్రిల్ 9వ తేదీ ఆదివారంనాడు బేగంపేట హోటల్ ప్లాజా కాన్ఫరెన్స్ హాలులో విప్లవ కవి వరవరరావు 'ఇం..కొకప్పుడు' కవితా సంకలనాన్ని ఆవిష్కరించారు..

ప్రముఖ పాత్రికేయులు, సంపాదకులు కె.రామచంద్రమూర్తి అధ్యక్షతన జరిగిన ఈ సభకు శాసన మండలి సభ్యులు పల్లె రాజేశ్వరరెడ్డి ముఖ్య అతిథిగా హాజరయ్యారు.

దేవిప్రియతో నాలుగు దశాబ్దాల స్నేహాన్ని గుర్తు చేసుకున్నారు కవి శివారెడ్డి. దేవిప్రియ బాధామయ జీవితానికి అతని కవిత్వం ఊతంలా నిలిచింది అన్నారు.

కవి ఖాదర్ మొహియుద్దీన్ మాట్లాడుతూ నిరాడంబరంగా సూటిగా స్వచ్ఛంగా ఉండే దేవిప్రియ కవిత్వం నిగూఢమైన నైతిక ఏకాంతం నుంచి రెక్కలు విప్పుకుందన్నారు. దేవిప్రియ కవితా రహస్యాన్ని పతంజలి మాటల్లో వివరించారు.

విప్లవకవి వరవరరావు మాట్లాడుతూ, వైయక్తిక దుఃఖపు కొలిమిలో Resurrect అయిన కవి దేవిప్రియ అని శ్లాఘించారు.

'ఇం..కొకప్పుడు' సంకలనంలోనివన్నీ మనిషి తనాన్ని ప్రకటించిన కవితలే అన్నారు రచయిత్రి ఓల్గా. మనిషి తాత్వికంగా ఎదగడానికి దోహదపడే కవిత్వం దేవిప్రియదని ప్రశంసించారు.

దేవిప్రియ స్పందిస్తూ, విపత్కరకాలంలో తనను హత్తుకున్నవారికి, ఆదరించిన వారికి, సేద దీర్చిన వారికి కృతజ్ఞతలు తెలియపరిచారు. అభౌతిక స్వరాల్లా తన వెంట నిలిచిన డాక్టర్ నీలిమ, శ్రీనివాసులు, పిల్లలు సమత, యువలకు కృతజ్ఞతలు తెలియజేశారు.

ఈ ఆవిష్కరణలో ప్రముఖ రచయిత నవ్యవీక్లీ సంపాదకుడు ఎ.ఎన్.జగన్నాథశర్మ, ప్రముఖ కవి డాక్టర్ ఎన్. గోపి, దర్శకులు బి.నర్సింగరావు కార్టూనిస్టు మోహన్, ప్రముఖ కవులు శిఖామణి, సుధామ, యాకూబ్, శిలాలోహిత, రచయితలు డి. వెంకట్రామయ్య, నందిగం కృష్ణారావు, అక్కినేని కుటుంబరావు ఇంకా ఎంతోమంది ప్రముఖులు పాల్గొన్నారు.

జర్నలిస్టు మల్లేపల్లి లక్ష్మయ్య స్వాగత వచనాలు పలికారు. బండ్ల మాధవరావు వందన సమర్పణ చేశారు.

నవ్య

# అతిపెద్ద విగ్రహం

ఏదేశ చరిత్ర అయినా సరే పురాణేతిహాసాలతో నిండి ఉంటుంది. గ్రీస్ దేశ చరిత్ర కూడా మనదేశ చరిత్రలాగే అతి పురాతనమైనది. ఆదేశంలో ప్రాచీన ఆలయాలు ఎన్నో ఉన్నాయి. అందులో ఒకటి పశ్చిమ గ్రీస్‌లోని ఒలింపియా వద్ద గల జీయాస్ విగ్రహం. ఇది గ్రీస్ దేశంలోకెల్లా చాలా పెద్దది. బంగారం, ఏనుగు దంతంతో నిర్మించిన విగ్రహమిది.

విగ్రహం ఎత్తు దేవాలయం పైకప్పును అంటుకుంటుంది. అంత ఎత్తులో ఉంటుంది మరి. ఇంతకీ దీని ఎత్తు ఎంత అనుకుంటున్నారా? ఇది సుమారు 13 మీటర్ల (42 అడుగులు) పొడవు ఉంటుంది. ఈ బృహత్తర జీయాస్ విగ్రహాన్ని క్రీపూ 430 – 422 మధ్యకాలంలో రూపొందించారు గ్రీస్ దేశ ప్రఖ్యాత శిల్పి ఫిడియాస్. ఇది ప్రపంచ ఏడు వింతలలో ఒకటిగా నిలిచింది. ఈ జీయాస్ విగ్రహం నకలు ప్రపంచంలో ఎక్కడా మనకు కానరాదు. కానీ ప్రాచీన గ్రీకు చరిత్రలో కొన్ని నాణేలపై ఈ చిత్రాలను చూడవచ్చు.

జీయాస్‌దేవుడు సింహాసనం మీద కూర్చుని ఉంటాడు. ఈ సింహాసనాన్ని పచొని, దంతం, బంగారం అమూల్యమైన మణిమాణిక్యాలు రత్నాలతో అలంకరించారు. విగ్రహం దుస్తులు బంగారంతో దంతపు పేడుతో తయారు చేయబడ్డాయి. విగ్రహ నేత్రాల్లో అమూల్యమైన మణులు పొదిగారు. జీయాస్ ఎడమ చేతిలో భయంకరమైన రూపంలో బంగారంతో చేసిన గ్రద్ద బొమ్మ ఉంటుంది. నైక్ గ్రీకులకు విజయాన్ని ప్రసాదించే దేవత. ఈ విగ్రహాన్ని రూపొందించడానికి ఫిడియాస్‌కు ఎనిమిది సంవత్సరాలు పట్టిందట తలపైన ఆలివ్ కొమ్మలతో రూపొందించిన కిరీటం ఉంటుంది. రకరకాల పెయింటింగ్స్, అనేక రకాల అడవి జంతువుల బొమ్మలతో సింహాసనం అలంకరించబడి ఉంటుంది. గ్రీకులకు జీయాస్ ప్రధాన దైవం. మానవులకు జంతువులకు కూడా తండ్రిగా ఆయన్నే భావిస్తారు. గ్రీకుల సిద్ధాంతరీత్యా దేవతల అధిపతి. సర్వాధికారి, రక్షకుడు. ఆయనే వినాశకారకుడు. పిడుగు, గ్రద్ద ఆయన చిహ్నాలు.



జీయాస్ పండుగను డైయనోలైల్సా పాండియా అని పిలుస్తారు. ఈ సందర్భంగా జీయాస్ దేవాలయంలో భవిష్యవాణి పఠనంతో పాటు వివరణ కూడా ఉంటుంది. పిడుగు జీయాస్ శక్తికి ప్రతీక. తన శక్తి తిరుగులేనిదని రుజువు చేయడం కోసం జీయాస్ భూమి మీదకు పిడుగును ప్రయోగించాడని, అందుకే వర్షం పడినప్పుడు పిడుగు పడుతుందని గ్రీకు పురాణ కథనం. రోమన్లు జీయాస్‌నే తమ దేవత జూపిటర్‌గా గుర్తించి ఆరాధించేవారు. కలిగులా చక్రవర్తి జీయాస్ విగ్రహాన్ని రోము నగరానికి తీసుకెళ్లి జీయాస్‌శిరస్సు బదులుగా తన శిరస్సును ఆ విగ్రహానికి అమర్చాలని ఆశించాడుట. జీయాస్ దేవాలయంలో హఠాత్తుగా వెన్ను జలదరించేలా భయంకరమైన వికటాట్టహాస ధ్వనులు ప్రారంభమయ్యాయి. దాంతో చక్రవర్తి, కార్మికులు భయంతో దేవాలయం నుంచి పారిపోయారని ఒక కథనం. ఒకటవ థియోడరస్ చక్రవర్తి జీయాస్ విగ్రహాన్ని కాన్స్టాంట్ నోపుల్‌కు తరలించాడు. క్రీ.శ 475లో ఈ విగ్రహం అక్కడ అగ్ని ప్రమాదానికి గురై శిథిలమైందట. కానీ జీయాస్ దేవాలయాల శిథిలాలను నేటికీ మనం ఒలింపియా వద్ద చూడొచ్చు. ప్రసిద్ధ శిల్పి ఫిడియాస్ జీయాస్ విగ్రహన్ని తయారు చేయడంలో బంగారు భాగాలకు పోత పోసిన మూసలే ఇటీవల చరిత్ర పరిశోధకులకు దొరికాయి.



# సమస్త నేస్తం..పుస్తకం

**ఓ మంచి పుస్తకం చదవడంలో ఉన్న ఆనందం అనుభవించే వాళ్ళకే తెలుస్తుంది. పుస్తకాన్ని చదవడం కనుక మనం అస్వాదించగలిగితే అది తృప్తినిస్తుంది. పుస్తకం అమ్మలా లాలిస్తుంది.. నాన్నలా ఆదరిస్తుంది. గురువులా హితబోధ చేస్తుంది. ఒంటరితనంలో స్నేహితుడిలా అక్కున చేర్చుకుంటుంది. బాధపడే వారిని ఓదారుస్తుంది. అలసిన మనసులను సేద తీర్చుతుంది. అందుకే పుస్తకం అనితరమైన ఆయుధంగా, నేస్తంగా సమస్తంగా అన్ని తరాలవారినీ అలరిస్తోంది.**

**ఏప్రిల్ 23 ప్రపంచ పుస్తక దినోత్సవం పురస్కరించుకుని ఓ ప్రత్యేక కథనం మీకోసం....**

'చినిగిన చొక్కా అయినా తొడుక్కో...కానీ ఓ మంచి పుస్తకం కొనుక్కో. ఓ మంచి పుస్తకం స్నేహితుడితో సమానం. ఓ మంచి పుస్తకం జీవితాన్ని మారుస్తుంది' అని కందుకూరి వీరేశలింగం పంతులు చెప్పిన మాటలు నేటికీ పుస్తక ప్రియుల చెవుల్లో మారుమ్రోగుతూనే ఉంటాయి.

కాలం ఎంతగా మారినా పుస్తక ప్రియులకు కొదవేలేదు. సినిమాలు, టెలివిజన్, ఇంటర్నెట్, మొబైల్ మాయలెన్ని దరిజేరినా పుస్తకం విలువ చెక్కుచెదరలేదు.

'మనల్ని గుచ్చి గాయపరిచి, ఇబ్బందిపెట్టే రచనల్నే మనం చదవాలి. మనం చదువుతున్న పుస్తకం తలపై ఓ మొట్టికాయవేసి మనల్ని మేల్కొలపాలి. లేనిపక్షంలో అసలు చదవడం ఎందుకు? మంచి పుస్తకం ఒక దుస్సంఘటన లాగా మనల్ని ప్రభావితం చేయాలి.

మనకన్నా మిన్నగా మనం ప్రేమించే ఆప్తుల మరణం లాగా మనల్ని తీవ్రంగా కలచివేయాలి. అందరికీ దూరంగా ఏకాంతంగా అరణ్యాలకు పారిపోవాలనిపించేలా ప్రేరేపించాలి. పుస్తకం మనలో గడ్డకట్టిన సముద్రాల్ని గొడ్డలిలాగా పగలగొట్టాలి' అంటాడు ప్రముఖ రచయిత కాఫ్కా.

### ప్రపంచ పుస్తక దినోత్సవ కథనాలు

ఏప్రిల్ 23 పుస్తక దినోత్సవం. ఆ రోజును ప్రపంచ పుస్తక దినోత్సవంగా పరిగణించడంపై విభిన్న కథనాలున్నాయి. 17వ శతాబ్దంనాటి యూరప్‌లో ఈ రోజును సెయింట్ జార్జ్ డేగా పాటించేవారు. స్పెయిన్‌లో ఇదే రోజున ప్రతి పుస్తక కొనుగోలుపై ఒక గులాబీని బహుమతిగా ఇస్తారు. సెవాంతెస్, షేక్స్‌పియర్, ఇన్కా గర్సిలాసో, వేగా అనే ప్రఖ్యాత రచయితలు 1616 సంవత్సరంలో ఇదే రోజు మరణించారు. అంతేకాదు జోసెఫ్ ప్లా, వ్లాదిమర్, మారిస్ ద్రువాం ఇలా ఇంకా చాలా చాలా మంది ప్రపంచ ప్రఖ్యాత రచయితలు ఇదే రోజు మరణించడమో, జన్మించడమో కూడా ఈ పుస్తక దినోత్సవం చేసుకోవడానికి ఒక కారణం. ప్రపంచవ్యాప్తంగా వేర్వేరు తేదీల్లో పుస్తక మహోత్సవాలు నిర్వహించినా ఇన్ని ప్రత్యేకతలున్న ఏప్రిల్ 23వ తేదీన ప్రపంచ పుస్తక దినోత్సవం పాటించాలని 1955లో యునెస్కో ప్రకటించింది. అంతేకాకుండా ప్రపంచ పుస్తక, కాపీ హక్కుల దినంగా జరపాలని, రచయితలు, ప్రచురణకర్తలు, పాఠకులు, ఉపాధ్యాయులను ఈ రోజున గౌరవించాలని సూచించింది. అలాగే ఏటా ప్రపంచంలోని ఒక ప్రముఖ నగరాన్ని 'ప్రపంచ పుస్తక రాజధాని'గా ప్రకటిస్తూ వస్తోంది. 2017 సంవత్సరానికి గానూ రిపబ్లిక్ ఆఫ్ గినీలోని 'కొనాక్రీ' సిటీని, 2018 సంవత్సరానికి గానూ గ్రీస్‌లోని 'ఏథెన్స్' నగరాన్ని ప్రపంచ పుస్తక రాజధానిగా ప్రకటించింది. 2019 సంవత్సరానికి కూడా దరఖాస్తులు చేస్కోవాల్సిందిగా తాజా ప్రకటన చేసింది యునెస్కో.

### ఎక్కువ చదువరులు భారతీయులే

ప్రపంచంలో ఏదేశ వాసులు ఎక్కువసేపు పుస్తకాలు చదువుతారు అనే విషయంపై ఓ సర్వే నిర్వహించారు. ఈ సర్వేలో పలు ఆసక్తికర విషయాలు వెల్లడైనాయి. ప్రపంచంలో అందరికన్నా ఎక్కువ సేపు పుస్తకాలు చదివేవారు భారతీయులేనట. అవును.. ఇండియన్లు వారానికి సగటున 10.2 గంటలపాటు పుస్తకపఠనం చేస్తారని దశాబ్దం క్రితమే చేసిన ఒక అధ్యయనం తేల్చింది. 2013 నాటి సర్వేలో ఈ సమయం 10.4 గంటలకు పెరిగింది. టీవీలు, సినిమాలు, ఇంటర్‌నెట్ వినియోగం.. మారుతున్న జీవనశైలి కారణంగా ఇటీవలికాలంలో మనలో పుస్తక పఠనంపై మోజు తగ్గిందనుకుంటున్నాంగానీ ఈ విషయంలో ఇప్పటికింకా మనమే టాప్. ఈ సంఖ్య మరింత పెరగాలని పుస్తకాలు చదవడంలో ఎప్పటికీ భారతీయులే అగ్రస్థానంలో ఉండాలని పుస్తక ప్రియులు కోరుకుంటున్నారు.

### పుస్తకం – పరిణామక్రమం

మనిషి మేధస్సును, విజ్ఞానాన్ని పెంచడానికి పుస్తకాలు ఎంతగానో దోహదపడుతున్నాయి. ఒక్కసారి విజ్ఞానాన్ని అందిపుచ్చుకుంటే తుదివరకు అది మనిషి జీవితాన్ని ముందుకు నడిపిస్తుంది. మహోన్నత విజ్ఞానాన్ని అందించేది పుస్తకం. అందుకే పుస్తకం ఎప్పుడూ మన చేతిని అలంకరించి ఉండాలని చెప్పారు పెద్దలు. కాలక్రమేణా పుస్తకాలలో అనేక మార్పులు



## పుస్తకాల నది

ప్రస్తుత టెక్నాలజీ యుగంలో.. ఉరుకుల పరుగుల జీవితంలో పుస్తక పఠనం తగ్గిపోయింది. ఏదైనా చదవాల్సి వస్తే ఆన్‌లైన్‌లోనో, కిండిల్ నోట్‌లోనో చదువుతున్నారు. పుస్తకాలను పట్టుకుని చదవడం ప్రజలు మర్చిపోతున్నారనే చెప్పాలి. అందుకే పలు స్వచ్ఛంద సంస్థలు తమకు తోచినట్టుగా ప్రజల్లో పుస్తక పఠనంపై ఆసక్తి కలిగించే ప్రయత్నం చేస్తున్నాయి. అందులో భాగం గానే కొందరు ఆర్టిస్టులు రోడ్డుపై 'పుస్తకాల నది' ఏర్పాటు చేశారు. పుస్తక పఠనంపై ఆసక్తి, అవగాహన పెంచేందుకు స్పెయిన్‌కి చెందిన 'లుజింటెరప్టస్' అనే సోషల్ ఆర్టిస్టు బృందం కెనడాలోని టొరొంటోలో రద్దీ రహదారిపై ఈ వినూత్న కార్యక్రమం నిర్వహించింది. దాతలు ఇచ్చిన దాదాపు 10వేల పుస్త కాలను రాత్రివేళ రహదారులపై పర్చారు. 'లిటరేచర్ వర్సెస్ ట్రాఫిక్' పేరుతో రహదారుల్ని పుస్తకాల నదిలా మార్చేశారు. ఇది చూప రుల్ని బాగా ఆకట్టుకుంది. పుస్తక పఠనం ఇష్టమైనవాళ్ళు ఎవరైనా ఇక్కడికి వచ్చి చదువుకోవచ్చని, ఫొటోలు తీసుకోవచ్చని, ఇంటికి తీసుకెళ్ళవచ్చుననీ ప్రకటించారు. దీంతో ఆ దారిలో వెళ్తున్న వారు, ఇరుగుపొరుగు వారు తమకు నచ్చిన పుస్తకాలను తీసుకెళ్ళారు. తెల్లవారేసరికి రోడ్డు ఖాళీ అయి పోయింది. ప్రజల్లో పుస్తక పఠ నంపై ఆసక్తి కలిగించేందుకే ఈ కార్యక్రమం నిర్వహించారు.

## ఆరోగ్యానికి మేలు

పుస్తక పఠనంతో ఆరోగ్య లాభాలు కూడా ఉన్నాయి. మేధస్సు సక్ర మంగా పనిచేసి ఆలోచనలు నియంత్రించేందుకు పఠనం దోహదం చేస్తుంది. అనవసర ఆలోచనలు నియంత్రించి శారీరక ఆరోగ్యం చేకూ రుస్తుంది. ఒత్తిడి నుండి విముక్తి చెందాలంటే, రాత్రి పడుకోబోయే ముందు సాహిత్యానికి సంబంధించిన పుస్తకాలు చదవడం మంచిది. గాఢ నిద్ర పట్టి శారీరక, మానసిక ఆరోగ్యం కలుగుతుంది. అలాగే ఏకాగ్రత చేకూరి ఒంటరితనాన్ని దూరం చేస్తుంది.

ఎదిగే పిల్లలకు ఒక్కో వయస్సులో ఒక్కో తరహా పుస్తకం అవసరం. ప్రారంభంలో బొమ్మలు, కథల పుస్తకాలతో మొద లుపెట్టి ప్రపంచ నాగరికతలు, వింతలు, శాస్త్రవేత్తలు, పరికరాలు, సాహసగాథలు ఇలా ఒక్కో రోజు ఒక్కొక్క కొత్త విషయం తెలియజేసే పుస్తకాలు చదివించాలి. అలా చదివించి పిల్లలకు పుస్తక పఠనం అలవాటు చేయాలి. ఇంటర్‌నెట్ పుణ్యమా అని కనీసం వార్తాపత్రిక కూడా కొనుక్కోకుండా ఇంటర్‌నెట్ లోనే అన్నీ ఫ్రీగా చదివేస్తున్నాం. కానీ దానితో పాటే రోగాలు కొని తెచ్చుకుంటున్నాం. అదే పనిగా కూర్చుని ఇంటర్‌నెట్‌లో చదవడం వల్ల కళ్ళు పొడవడం, ఊబకాయం వంటి సమస్యలకు అవకాశాలు ఎక్కువ ఉన్నా యని ఇటీవల శాస్త్రవేత్తలు నిర్ధా రించారు. పైగా కంప్యూటర్‌పై చద వడం వల్ల ఊహాశక్తికి తావు ఉండదు. అదే పుస్తక పఠనం ద్వారా చిత్రాలను మనసులో ఊహించుకో గలం, తద్వారా ఊహాశక్తి పెంపొందు తుందని పరిశోధకులు చెబుతు న్నారు.



వచ్చాయి. ఇప్పుడు నడుస్తున్న టెక్నాలజీకి అనుగుణంగా ఈబుక్స్ వచ్చాయి. కానీ పుస్తక పరిణామ క్రమాన్ని పరిశీలిస్తే ఎంతో ఆశ్చర్యం కలుగక మానదు.

**మొట్టమొదటి పుస్తకం:** ప్రపంచంలోనే మొట్టమొదటి పుస్తకం చైనాలోని 8వ శతాబ్దంలో ప్రింట్ చేశారు. ఈ పుస్తకానికి ఉడ్‌బ్లాక్స్‌ను వాడారు. ఆ తర్వాత 14వ శతాబ్దంలో చైనాతో పాటు కొరియా కూడా పుస్తకాలను ప్రింట్ చేయడం ప్రారంభించింది.

**మొట్టమొదటి ఇంగ్లీషు పుస్తకం:** 1473లో విలియం కాక్స్‌టన్ అనే వ్యక్తి ఇంగ్లీషులో మొట్టమొదటి పుస్తకం ప్రింట్ చేశాడు. దీని పేరు The Recuyell of the Historyes of Troye, కానీ అధికారి కంగా చాసర్స్ సెంచర్ ట్యూరీ టేల్స్ అనే పుస్తకం మొట్టమొదటిసారిగా ఇంగ్లీషులో ప్రచురించిన పుస్త కంగా ఉంది. ఈ పుస్తకాన్ని 1477లో ఇంగ్లాండ్‌లో ప్రచురించారు.

**మొట్టమొదటి అమెరికన్ పుస్తకం:** 1638లో ప్రచురించబడిన 'మసాచుసెట్స్ బే కాలనీ, ఓత్ ఆఫ్ ఫ్రీ మాన్' అనే పుస్తకమే అమెరికాలో మొట్ట మొదట ప్రచురించబడింది. రెండవ పుస్తకం 1639లో ప్రచురించారు. దానిపేరు 'అల్మనాక్ ఫర్ ద లియర్ ఆఫ్ అవర్ లార్డ్'.

**అతిపెద్ద పుస్తకం:** ప్రపంచంలో అతిపెద్ద పుస్తకం 5m*8.06m (16.40ft*26.44ft)ల సైజులో ఉంటుంది. ఈ బుక్ మొత్తం 429 పేజీలు ఉన్నాయి. ఈ బుక్ బరువు 1500 కేజీలు. దీన్ని 2012 ఫిబ్రవరి 27లో దుబాయ్‌లో ఎమ్‌షాహిద్ ఇంటర్నేషనల్ గ్రూప్ వారు ప్రచురించారు. 50మంది కలిసి ఈ బుక్‌ను తయారు చేశారు. ఇంతకీ ఈ బుక్ పేరు చెప్పలేదు కదా! దీని పేరు 'దిస్ ద ప్రొఫెట్ మొహమ్మద్ (this the prophet mohamed).

**అతిచిన్న పుస్తకం:** ఈ అతి చిన్న బుక్‌ని చదవా లంటే మీకు మైక్రోస్కోప్ సహాయం తప్పక ఉండా ల్సిందే. కెనడాకు చెందిన ఇద్దరు వ్యక్తులు రూపొం దించిన 30 పేజీల ఈ పుస్తకం ఖరీదు పదిహేను వేల డాలర్లు. దీన్ని మాల్కోమ్ డాగ్లాస్ చాప్లిన్ అనే వ్యక్తి రాయగా అతని సోదరుడు ప్రచురించాడు. 70 మైక్రోమీటర్ల పరిమాణంలో ఈ బుక్ ఉంటుంది. ఈ బుక్ పేరు 'టీనీ టెడ్ ఫ్రమ్ టర్నిప్ టౌన్'. 2012 సంవత్సరంలో ఈ బుక్ అత్యంత చిన్న పుస్తకంగా గిన్నిస్‌బుక్ రికార్డు ల్లోకెక్కింది.

**ఎలక్ట్రానిక్ పుస్తకాలు:** ఎలక్ట్రానిక్ బుక్స్‌ని ఈ బుక్స్ అంటున్నాం మనం. ఇవి ఇప్పటివి కావు, ఇరవై యేళ్ళుగా ఇవి అందుబాటులో ఉన్నాయి. మొదటి ఎలక్ట్రానిక్ బుక్‌కి ఎక్కువ సమాచారం, నిక్షిప్తం చేసుకునే కెపాసిటీ లేదు. స్క్రీన్ కూడా అతిచిన్న సైజులో ఉండేది. 1991లో తయారు చేసిన ఎలక్ట్రానిక్ బుక్ బైబిల్. దీనిలో ఒక్కసారికి కేవలం నాలుగు లైన్లు మాత్రమే కనిపించేవి. కానీ ఇటీవల కాలంలో మొబైల్‌ఫోన్లో కూడా ఈ బుక్ అందుబాటులోకి వచ్చింది. ఇలా పుస్తకం ఎప్పటికప్పుడు తన రూపం మార్చుకుంటూ వినూత్నంగా తన విశిష్టతను నిల బెట్టుకుంటోంది. కానీ ఎలక్ట్రానిక్ బుక్స్ వల్ల కాస్త కనుమరుగు అవుతోంది. పెరుగుతున్న విజ్ఞానంతో పుస్తకం మరింత ఆధునీకరణ చెందుతుందని ఆశిద్దాం.

**–సంతోషలక్ష్మి దహగాం**

# పయనించే ఓ చిలుకా!...

శ్రీధర

**చలికాలం ఇక్కడ ఉండటం చాలా కష్టం. మరీ వారం రోజుల నుంచీ రాత్రీ పగలూ అన్న తేడా లేకుండా చలి వణికించేస్తోంది..ఎంతటి వాడినైనా సరే.**

**ఈ మధ్య పత్తాలేకుండా పోయిన సూర్యుడు ఆ రోజు మిట్టమధ్యాహ్నం వేళకి కిటికీల్లో నుంచి తొంగి చూస్తున్నాడు. శ్రీహరికి ప్రాణం లేచొచ్చినట్లయింది. కాసేపు అలా బయట తిరిగొద్దామని బయల్దేరుతుంటే, గదిలో వర్క్ ఫ్రం హోం చేస్తూ ఆఫీసు పనిలో ఉన్న శాలిని చప్పున బయటకు వచ్చింది.**

"ఎక్కడికి నాన్నా?" అని అడిగింది.

"వారం రోజులనుంచీ హౌస్ అరెస్టులా ఉంది. ఎల్లుండి ప్రయాణం గదా... పద్నాలుగు గంటలు కాలు మెదపటానికి ఉండదు. ఇవాళ కొంచెం ఎండ వచ్చింది. కాసేపు అలా తిరిగొస్తాను" అన్నాడు శ్రీహరి.

"కోటు వేసుకుని వెళ్ళు. సీజన్ బాగాలేదు. జలుబులూ, జ్వరాలూ.." అన్నది శాలిని.

ఇంతలో సుధారాణి టీవీలో తెలుగు ఛానల్ ఆన్ చేసింది. నాలుగునెలల నుంచీ తెలుగులో న్యూస్ తప్ప సీరియల్స్ చూడలేక పోతున్నందుకు ఆమె బాధ పడిపోతోంది. ఆ సీరియల్స్‌లో ఒకరినొకరు చంపుకోవాలని ఎత్తుల మీద ఎత్తులు వేస్తుంటారు. చచ్చినా ఎవరూ చావని కారెక్టర్స్‌తో, నడిచీ నడవక నడిచే సీరియల్స్, టైం గడిచీ గడవక, చూసే వాళ్ళకు యమ థ్రిల్లింగ్‌గా ఉంటాయి మరి.

టీవీ వార్తలో హైదరాబాదులో రోడ్డు యాక్సిడెంట్ చేసిన కుర్రాడినీ, కారులో అతని పక్కన ఉన్న అమ్మాయినీ, కారునీ మార్చిమార్చి చూపిస్తున్నారు.

"ఏమండీ... వాడు మన రవిలా ఉన్నాడు చూడండి.." అన్నది సుధారాణి, గొంతులో ఆశ్చర్యం ఆదుర్దా కలగలిపి.

"వాడే..." అని ధృవీకరించింది శాలిని.

"ఇదివరకు కూడా ఎవరో ముసల్దాన్ని గుద్దాడు.." అన్నది సుధారాణి.

"ఈసారి వయసులో ఉన్నవాళ్ళ మీదికే కారు ఎక్కించాడు. ఇంప్రూవ్‌మెంట్ ఉంది.." అన్నది శాలిని.

ఇంతకీ ఆ రవి ఎవరో కాదు. సుధారాణి తమ్ముడి కొడుకే. ఆరు నెలల కిందట కారు కొన్నాడు. ఫ్రెండ్స్‌తో కారులో తిరగటానికి ఇరవై నాలుగు గంటలు సరిపోవటం లేదు. వాడి విషయం చర్చించుకుంటుండగానే ఫోన్ మోగింది.

శాలిని రిసీవ్ చేసుకుని తండ్రికి ఫోన్ ఇచ్చింది. "నీకే" అంటూ.

హైదరాబాద్ నుంచి సుధారాణి తమ్ముడు మాట్లాడాడు.

"బావా, వాడు కావా



# నవ్యవీక్లి-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతి సాహితి కథల పోటీలో విశేష బహుమతి రూ.5,000 పొందిన కథ

లని చెయ్యలేదు..”

“కావాలని ఎవడూ చెయ్యడు. మొత్తం మీద యాక్సిడెంట్ చేశాడు గదా..” అని శ్రీహరి కాసేపు అక్షింతలు చల్లి, రేపొద్దున్నే వెళ్ళి పి.పి.ప్రకాశరావుని కలిసి తన పేరు చెప్పమన్నాడు.

“పి.పి. అంటే?” అడిగింది శాలిని.

“పబ్లిక్ ప్రాసిక్యూటర్...”

“నాన్నా, ఇలాంటి కేసులు వాళ్ళ దగ్గరకు తీసు కెళ్తే ఏమనుకుంటారు?”

“వాళ్ళ దగ్గరకొచ్చే వాటిల్లో ఇవి చాలా చిన్నవి. ఏం అనుకోరు..”

“అదే ఇక్కడ అమెరికాలో చిన్నతప్పు చేసినా పెద్దశిక్ష వేస్తారు. ట్రాఫిక్ సిగ్నల్స్ పాటించక పోయినా, రెండుసార్లు చూసి మూడోసారి లైసెన్స్ కాన్సిల్ చేస్తారు.” అన్నది శాలిని.

“ఎక్కడి గోల అక్కడే.. బీయే



రోమియో వెన్ యూ ఆర్ ఇన్ రోమ్ అన్నారు” అన్నాడు శ్రీహరి.

“బీయే రోమియో కాదు. రోమన్.. సామెతలూ మార్చేస్తున్నావు..” అన్నది శాలిని నవ్వుతూ.

శ్రీహరి కోటు తగిలించుకుని బయటకు నడి చాడు. రోడ్లన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. అసలు ఇళ్ళల్లో అయినా జనం ఉన్నారా లేదా అన్నట్లున్నారు.

పార్క్ చుట్టూ నాలుగుసార్లు తిరిగొచ్చి, బెంచీ మీద ఎండలో కూర్చున్నాడు.

ఎల్లుండి ప్రయాణం. మనిషి ఇక్కడున్నాడే గానీ మనసంతా ఇంటి మీదే ఉంది. అలవాటైన వీధులూ... పరిచయం ఉన్న ముఖాలూ... చిరు నవ్వుల చిలకరింపులూ... అదొక ప్రపంచం.

శ్రీహరి బావమరుదులూ, మరదళ్ళూ, మేన కోడళ్ళూ బంధువర్గం అంతా ఆ చుట్టుపక్కలే ఉన్నారు. కానీ ఆయన ఎవరింటికీ వెళ్ళడు. ఎక్కడా గుక్కెడు మంచినీళ్ళు తాగడు. ఈయన రావటం లేదని, వాళ్ళు ఈయన దగ్గరకు రావటం మానే శారు. కానీ ఇదుగో ఇలాంటి అవసరాలు వచ్చిన ప్పుడు, వాళ్ళే వస్తుంటారు.

చివరకు కూతురు ఇంటికి రావటానికీ ఆయన ఇష్టపడలేదు. కూతురు నిష్ఠూరాల మధ్య, భార్య బలవంతంమీద ఇక్కడికి వచ్చి, జీవితంలో మొదటి సారి ఇన్నాళ్ళు ఇంటికి దూరంగా ఉన్నాడు.

నిజానికి ఈ నాలుగునెలల్లో కార్లల్లో విమా నాల్లో తిరుగుతూ, సరికొత్త లోకం చూశాడు. ఊహ కందని వింతలెన్నో చూడగలిగాడు. ఆదరణకీ, ఆప్యాయతకీ లోటు లేదు. అయినా తన ఇల్లే స్మృతి పథంలో మెదులుతోంది.

వీలున్నంతలో తండ్రినీ తల్లినీ సుఖపెట్టాలని శాలిని తాపత్రయం. ఇల్లు పాతదైపోయింది. పడ గొట్టించి, అందంగా అధునాతనంగా కట్టించింది. ఇంట్లో అవసరమైన అన్ని హంగులు ఏర్పాటు చేసింది.

“ఇంట్లో పాతవేవీ ఉంచొద్దు. బయట పారె య్యండి..” అని హుకుం జారీ చేసింది. చాలావరకు ఆ పాత వస్తువులు తనే పనివాళ్ళకు ఇచ్చేసింది.

అంతా అయిపోయాక శ్రీహరి కూతురితో అన్నాడు. “ఇంట్లో రెండు మాత్రం పాతవి మిగిలి పోయాయి. పారెయ్యలేక పోతున్నాం..”

“అవి కూడా పడేసెయ్యండి.. ఇంతకీ ఏంటవి?”

“మీ అమ్మ ముఖం, నా ముఖం.. ఇవి ఎప్పటి నుంచో ఉన్నాయి. పారెయ్యలేకపోతున్నాం..” శ్రీహరి హాస్యానికి అన్నా, శాలిని నొచ్చుకుని నాలుగు రోజులు మాట్లాడటం మానేసింది.

కూతురు వద్దన్నా వినకుండా రెండో అంత స్తులో రేకులతో ఒక రూం కట్టించుకున్నాడు శ్రీహరి. తన సామాన్లు అన్నీ అందులోకి చేర్చుకున్నాడు. పాతికేళ్ళ కిందటి కేన్ చెయిర్... పాత టేబులూ, చెక్క కుర్చీ..యాభై ఏళ్ళ నుంచి పోగుచేసుకున్న పుస్తకాలూ, జ్ఞాపకాలూ, కలలూ, పొంగి పొర్లి పోయేలా ఆప్యాయతలు ఒలకబోస్తూ ఎవరెవరో రాసిన ఉత్తరాలూ... ఇప్పుడు వాళ్ళూ లేరు. ఆ పరి స్థితులూ లేవు. అయినా వాటికీ ఆయన ప్రాణానికీ విడదీయలేని లంకె. పూర్వం కథల్లో చెప్పినట్లు రాక్ష సుడిప్రాణం మర్రిచెట్టు మీద తొర్రలో ఉన్న చిల కలో ఉన్నట్లు, ఆయన ప్రాణమంతా వాటిల్లో ఉంది.

మొదటి అంతస్తులోని సోఫాలో వెనక్కివాలి.. టీవీలో వస్తున్న విషయాలపైన వ్యాఖ్యానాలు చేసే శ్రీహరి వేరు. రేకుల గదిలో ఆలోచనా లోచనాలతో అంతర్ముఖుడయ్యే శ్రీహరి వేరు. రోజూ ఒక గంట ఆ కేన్ చెయిర్‌లో కూర్చుని వస్తే, రోజుకి సరిపడా గుండెల నిండా ఆక్సిజన్ నిండి పోతుంది.

“ఏమిటీ పిచ్చి?” అంటుంది సుధారాణి ఎప్పు డైనా ఆ గదిలోకి వచ్చి.

పిచ్చి ఏముంది? ఇది నా నీడ.. కాసేపు నీడలో కూర్చోవాలన్న ఆశ... అంతే” అనేవాడు.

ఎన్నోఏళ్ళుగా రోజూ కొంచెం కొంచెం తింటూ ఈ శరీరాన్ని పెంచుకున్నామా లేదా? అలాగే అను భవాలనూ, అనుభూతులనూ నెమరేసుకుంటే మనసు పెరుగుతుంది. పాతవే కదా అని, శరీ రంలో నుంచి కాలునీ, చేతినీ నరికెయ్యలేం. అలాగే మనసులోంచి గతాన్ని తీసి పారెయ్యలేం.

ఎదురుగా ఎవరో వచ్చి నిలబడడంతో శ్రీహరి ఆలోచనల్లో నుంచి తేరుకున్నాడు. అతని చేతిలో ఏవో తెలుగు పుస్తకాలున్నాయి.

“మీరు ఇండియా నుంచా?” అడిగాడు ఆ అజ్ఞాత వ్యక్తి.

“మాది హైదరాబాద్..” చెప్పాడు శ్రీహరి.

“మాదీ హైదరాబాదే..” అన్నాడతను పక్కనే కూర్చుంటూ.

శ్రీహరి అతని చేతిలో పుస్తకాల వంకే చూస్తున్నాడు.

“కొత్త రచయితలు, చాలా బాగా రాశారు. మంచి నవలలు.. మీరూ చదవాల్సినవే...” అని ఆ పుస్తకాలు శ్రీహరికి ఇచ్చాడు.

ఆయన ఒక నిముషం పాటు తిరగేసి పుస్తకాలు తిరిగి ఇచ్చేశాడు.

"సార్ నా పేరు నాగేశ్వరరావు. అమెరికావచ్చి నెలరోజులైంది. న్యూజెర్సీ, చికాగో, టెక్సాస్‌లకు వెళ్ళాను. నాలుగురోజుల కిందట ఇక్కడకు వచ్చాను. మన తెలుగు అసోసియేషన్ సెక్రటరీ ఇంట్లో ఉన్నాను. ఆయనేమో ఇవాళ అర్జంటుగా వేరే సిటీకి వెళ్ళాడు. రేపు మధ్యాహ్నం వస్తానన్నాడు. ఫోన్ చేసి చెప్పాడు. ఈ ఒక్కపూట ఎక్కడుండాలో తెలియటం లేదు. దయచేసి ఈ ఒక్క రాత్రికి మీ ఇంట్లో కారు గ్యారేజ్‌లో నన్ను పడుకోనిస్తే.."

"నేనే గెస్ట్‌గా వచ్చాను. నేనేం ఆశ్రయం ఇవ్వగలను?" అన్నాడు శ్రీహరి.

"ప్లీజ్ సర్.. ఒక్కరాత్రికి. చాలా క్లిష్టమైన పరిస్థితుల్లో ఉన్నాను. దయచేసి హెల్ప్ చేయండి.." బ్రతిమిలాడుకుంటున్నాడు నాగేశ్వరరావు.

కుదరదని చెప్పినా, అతను ప్రాధేయపడుతూనే ఉన్నాడు. శ్రీహరితో పాటు నాగేశ్వరరావూ వాళ్ళింటికి వచ్చాడు. ఎంత వదిలించుకోవాలని చూసినా అతను వదలటం లేదు. బంకలా పట్టుకున్నాడు.

లోపలికి వచ్చాక కూర్చోమన్నాడు. సోఫా అంచున కూర్చున్నాడు. శ్రీహరి మంచినీళ్ళు తెచ్చి ఇచ్చాడు. తాగాడు.

కిచెన్‌లో సుధారాణి కాఫీ కలుపుతోంది. "ఎవరూ?" అడిగింది.

"ఎవరో హైదరాబాదట. ఎవరింట్లోనో ఉంటున్నాడట. ఏదో ప్రాబ్లం వచ్చింది. ఈ రాత్రికి మనింట్లో ఉంటానంటూ వెంటపడి వచ్చాడు.."

"తాదూర సందులేదు. మెడకో డోలు అన్నట్లు... మనమే ఇక్కడ గెస్టుల్లా ఉంటున్నాం. ఇక మనకి తోడు పరాయి వాళ్ళు కూడానా?" అన్నది సుధారాణి.

శాలిని ఆఫీసు పని ముగించుకుని వచ్చింది. శ్రీహరి విషయం చెప్పాడు.

"పోన్లే నాన్నా.. ఒక్క పూటేగదా..ఉండనీ. ఇక్కడ మన అసోసియేషన్ వాళ్ళకిది మామూలే. ఇదివరకు మాకూ ఇలాంటివి తప్పేవికావు. ఇప్పుడు ఆ సంఘాల్లోంచి బయట పడ్డాం" అన్నది శాలిని.

శ్రీహరి నాగేశ్వరరావుకి కాఫీ ఇచ్చాడు. తాగాడు.

శ్రీహరి, సుధారాణి ఇండియాకి వెళ్ళిపోతున్న సందర్భంగా వెనకవీధిలో ఉన్న షీలా వాళ్ళింట్లో డిన్నర్‌కి ఆహ్వానించింది. వీళ్ళతో పాటు మరో అయిదారు కుటుంబాల వాళ్ళూ వస్తున్నారు.

'మనం డిన్నర్‌కి వెళ్ళాలి కదా" గుర్తు చేసింది సుధారాణి.

"ఆయన్నీ తీసుకు వెళ్దాం. షీలాకి నేను చెబుతానులే, మీరు రెడీ అవండి.." అన్నది శాలిని.

**అమెరికాలో కూతురు ఇంటికి వెళ్ళాడతను. దగ్గరలో ఉన్న పార్కుకు వెళ్ళి కూర్చున్నాడు. ఒక అపరిచితుడు వచ్చి మీరు ఇండియా నుంచి వచ్చారా ? అని ప్రశ్నించాడు. ఔను, హైదరాబాద్ చెప్పాడు అతను. మాటలు కలిపి తన గోడు విన్నవించుకున్నాడా అపరిచితుడు. వద్దన్నా వెంటపడి అతని ఇంటికెళ్ళాడు. చుట్టమై వచ్చి దయ్యమై పీడిస్తున్నాడని వాపోయాడతను. ఇంతకీ ఆ అపరిచితుడెవరు ? అతని కథేంటి?**

రాత్రి ఎనిమిది గంటలకు షీలా ఇంటికి వెళ్ళారు. మిగిలిన కుటుంబాల వాళ్ళూ వచ్చారు. కుశల ప్రశ్నలు, పరామర్శలు అయ్యాక, వెల్‌కం డ్రింక్ కింద పానీయాలొచ్చాయి. అవన్నీ అయ్యాక షీలా చిన్న అనౌన్స్‌మెంట్ చేసింది. రాంచందర్‌గారి అమ్మాయి పద్మప్రియ ఒక పాట పాడుతుందని. అందరూ సర్దుకుని కూర్చున్నాక ఆ అమ్మాయి పాడింది.

'కృష్ణం కలయసుఖ సుందరం బాల..' ఆ అమ్మాయి ఇంకా నేర్చుకునే దశలో ఉంది. అయినా బాగా పాడిందని అందరూ మెచ్చుకున్నారు.

నాగేశ్వరరావు మాత్రం లేచివెళ్ళి ఆమెతో కరచాలనం చెయ్యటానికి చెయ్యి చాచాడు. ఆ అమ్మాయి అంటీ అంటనట్లు చెయ్యి కలిపింది. పరాయివాళ్ళ మధ్య అతను అలా చొరవ తీసుకోవటం ఎవరికీ నచ్చలేదు. కానీ వయసులో పెద్దవాడు గదాని చూసీ చూడనట్లు ఊరుకున్నారు.

నాగేశ్వరరావు అందరి మధ్యలో నిలబడి తానూ ఒక పాట పాడతానని అన్నాడు. అందరూ ఆశ్చర్యంగా చూశారు. పాడమని కోరకముందే అందుకున్నాడు.

'పయనించే ఓ చిలుకా..' అని ఎత్తుకున్నాడు. అతనిలో అంత గొప్ప గాయకుడు ఉన్నాడని ఎవరూ ఊహించలేదు. అచ్చు ఘంటసాలే వచ్చి పాడుతున్నాడా అన్నంత అద్భుతంగా పాడాడు.

పద్మప్రియకి హుషారు వచ్చింది. ఇంకో కీర్తన అందుకుంది. 'శరణం భవ కరుణామయ కురుదీన దయాళో..' అని పాడింది. ఈసారి ఎవరూ అడగకుండానే నాగేశ్వరరావు 'కృష్ణా ముకుందా మురారీ' ఎత్తుకున్నాడు. ఆ పాట పూర్తయ్యేటప్పటికి అతనో గొప్పగాయకుడన్న విషయం తెల్సొచ్చింది. ఇంక అందరూ అడగటం మొదలెట్టారు. ఇంకో పాట... ఇంకోపాట.. అంటూ అన్నీ ఘంటసాల పాటలే గంటసేపు పాడాడు.

జగమే మారినది మధురముగా.. నిన్న కనుపించింది... కలకానిది... వగలరాణివి నీవే.. పిలిచిన పలుకవు జవరాలా... ముద్దబంతిపూలు పెట్టి... శివశంకరీ..

అందరికీ అర్థమైంది. అతనెంత గొప్ప గాయకుడో.. గంటసేపు అక్కడున్న వాళ్ళందర్నీ మంత్రముగ్ధుల్ని చేశాడు.. సమ్మోహన పరిచాడు.

నార్త్ ఇండియావాళ్ళు ఒకరిద్దరున్నారు. హిందీ పాటలు పాడమన్నారు. హిందీ పాటలు ఎక్కువగా రావంటూనే రెండు పాటలు అందుకున్నాడు పాత సినిమాల్లోవి. అభీ నజావో ఛోడ్‌కర్.. హమ్ తుమ్ ఏక్ కమ్‌రేమె..

గంట సేపటి క్రితం వరకూ అతనొక అనామకుడు. అనుకోని అతిథి. అన్‌వాంటెడ్ పర్సన్... ఇప్పుడతనొక ఆరాధ్య దైవంలా మారిపొయ్యాడు, దేశం కాని దేశంలో ముక్కూ మొహం తెలియని వాళ్ళకి.

అందుకే అన్నారు. 'స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే' రాజు స్వదేశంలోనే పూజనీయుడు, పండితుడు సర్వత్రా పూజనీయుడు.

అసలు విందు కన్నా నాగేశ్వరరావు చేసిన వీనుల విందు బహు పసందుగా ఉందని అందరూ సంతోషించారు.

భోజనాల సమయంలో అతనికి కొసరి కొసరి వడ్డించారు.

ఒకరోజు ప్రత్యేకంగా అతని ప్రోగ్రాం ఏర్పాటు చేస్తే ఎలా ఉంటుందీ అన్న ఆలోచనా వచ్చింది.

రాత్రి పదకొండు గంటలకు శ్రీహరి కుటుంబంతో పాటు నాగేశ్వరరావు వాళ్ళింటికి వచ్చాడు.

కింద హాల్లో పడుకుంటానన్నాడు. కానీ శాలిని ఒప్పుకోలేదు. 'చలికి తట్టుకోలేరు. పైన ఇంకో గెస్ట్ రూం ఉంది' అంటూ ఆ గదిలో నాగేశ్వరరావుకి పడక ఏర్పాటు చేసింది.

ఉదయం ఎనిమిది గంటలకు శ్రీహరి లేచేటప్పటికి హాల్లో సోఫాలో కూర్చుని నాగేశ్వరరావు కాఫీ తాగుతున్నాడు. శాలిని అప్పుడే పనిలో మునిగిపోయింది.

సుధారాణి కూడా కిందకు వచ్చాక, కాసేపు కబుర్లు చెప్పుకున్నారు. బ్రేక్‌ఫాస్ట్ అయింది.

శాలిని, సుధారాణి మాల్‌కి వెళ్ళారు. రేపు ప్రయాణం గనుక, కావల్సినవన్నీ తెచ్చుకోవటానికి.

శ్రీహరి, నాగేశ్వరరావు కబుర్లల్లో పడ్డారు.

"మీరు ఎవరు, ఏం చేసేవారు... అన్నీ వివరంగా చెప్పండి" అడిగాడు శ్రీహరి.

"సార్.. నాదొక విచిత్రమైన కథ. అలాంటి



ప్రాబ్లమ్స్ ఎవరికీ రాకూడదు. నిజం చెప్పాలంటే నేను ఇప్పుడు ఇండియానుంచి పారిపోయి వచ్చి, ఇక్కడ దిక్కులేని పక్షిలా తిరుగుతున్నాను. ఎవరైనా రచయిత వింటే నా కథ ఒక గొప్ప నవలగా రాయవచ్చు" అన్నాడు నాగేశ్వరరావు.

"చెప్పండి. తీరిగ్గానే ఉన్నాం కదా...కాసేపు కాలక్షేపం అవుతుంది" అన్నాడు శ్రీహరి.

"నేనొక ప్రైవేట్ కంపెనీలో క్యాషియర్‌గా పని చేశాను. జీవితం అంతా కష్టపడితే ఒక చిన్న ఇల్లు కట్టుకోగలిగాను. అదీ ఎప్పుడో కొన్నేళ్ళ కిందట చవుకగా కొన్న స్థలంలో. ఇప్పటిదాకా అంటే నెల రోజుల కిందట నేను అమెరికా పారిపోయి వచ్చే దాకా ఆ ఇంట్లోనే ఉన్నాను. రెండు గదులు అద్దెకి ఇచ్చాను. అదే కొంత ఆధారం.

"నాకు ఒక కొడుకు. ఒక కూతురు. అందరి తల్లిదండ్రులమాదిరిగానే కొడుకు మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాం. వాడు పైకి వస్తే మా కష్టాలు తీరిపోతాయని ఆశించాం. కానీ వాడు కులాంతర వివాహం చేసుకున్నాడు. మాకు అదో పెద్ద శాపంలా పరిణమించింది.

"నా భార్య లలిత వాడిని ఇంట్లోకి రావద్దని శాసించింది. ఇంకా చాలా అన్నది. మేం చస్తే మా తలకొరివి పెట్టటానికి కూడా రావద్దని తిట్టిపోసింది. వాడేం మాట్లాడలేదు. తల్లి కాళ్ళకు దండం పెట్టి వెళ్ళిపోయాడు. ఢిల్లీలో ఉద్యోగం చేసుకుంటున్నాడు. ఇప్పుడు వాడికి ఇద్దరు పిల్లలు.

"వాడు చేసిన నిర్వాకంవల్ల మా అమ్మాయికి వచ్చిన పెళ్ళి సంబంధాలు వెనక్కి వెళ్ళిపోయాయి. లలితకు దిగులు పట్టుకుంది. తలదాచుకోవటానికి మాకున్న నాలుగు గదుల ఇల్లుతప్ప మరే ఆధారమూ లేదు. నాకు పెద్ద సంపాదనా లేదు. పరిస్థితులు అర్థం చేసుకున్న పిల్ల గనుక, మా అమ్మాయి, పెళ్ళికాలేదనే దిగులు పెట్టుకోలేదు. చదువుకుంది. ముంబయ్‌లో ఉద్యోగం వస్తే వెళ్ళిపోయింది.

"మా ఆవిడకి మనోవ్యాధి ఎక్కువైంది. మంచాన పడింది. హాస్పిటల్‌లో వేలకు వేలు ఖర్చు చేయగల స్తోమత నాకులేదు. రోగాలు ఒకదానికొకటి తోడై నాలుగేళ్ళ కిందట బంధాలన్నీ తెంచుకుని వెళ్ళిపోయింది. మా వాడు చూడటానికి కూడా రాలేదు. నా అంతట నేను వాడిదగ్గరకు వెళ్ళడానికి మనసొప్పలేదు.

"దేవుడు నాకు అన్ని విధాలా అన్యాయం చేశాడు గానీ, మంచి గాత్రం ఇచ్చి నాకు గొప్ప మేలు చేశాడు. చిన్నప్పటి నుంచి సినిమా పాటలు పాడుకునే అలవాటు ఉండేది. ఇప్పటికీ అదే అలవాటు. బాగా ఆకలేసినప్పుడు, తినటానికి ఏమీ లేనప్పుడు, విషాద గీతాలు పాడుకుంటూ కన్నీరు కారుస్తాను. ఆకలి మర్చిపోతాను. కొంచెం హుషారుగా ఉన్నప్పుడు మెలోడీ సాంగ్స్ పాడుకుంటూ ఒంటరి జీవితంలో అడ్జస్ట్ అవుతూ వచ్చాను.

"కాలక్షేపం కోసం భజన సంఘాల దగ్గరకు వెళ్ళి భక్తిగీతాలు పాడేవాడిని. వాళ్ళందరూ నాకు ఎంతో గౌరవం ఇచ్చేవారు. నా కోసం ఎదురొచ్చి బండి మీద తీసుకెళ్ళేవాళ్ళు. తెల్సినవారి ఇళ్ళల్లో ఎక్కడ ఏ ఫంక్షను జరిగినా, ఉత్సవం జరిగినా, మా ఇంటికొచ్చి నన్ను తీసుకెళ్ళేవారు. అదొక తృప్తి.

"రోజులు ఇలా గడిచిపోతుండగా, ఏడాది కిందటనుంచీ కొన్ని అనుకోని సంఘటనలు మొదలయ్యాయి. ఒకరోజు రాత్రి పది గంటలప్పుడు ఎవరో ఒక స్త్రీ మా ఇంటికి ఫోన్ చేసింది. రాంగ్ నెంబర్. మర్నాడు మళ్ళీ అదే సమయానికి అదే గొంతు. సరస్వతి కావాలన్నది రాంగ్ నెంబర్. అదే టైంకి రోజూ అదే రాంగ్‌నెంబర్ రావటంతో మాటలు పెరిగాయి. వివరాలు తెల్సాయి. కబుర్లు మొదలయ్యాయి.

"నెల రోజుల కల్లా ఫ్రెండ్స్ అయిపోయాం. రెండు రోజులు చంద్రకళ నుంచి ఫోన్ రాకపోతే నేనే ఫోన్ చేసి, ఏమన్నా ప్రాబ్లమ్స్‌లో ఉన్నదా అని కనుక్కునేవాణ్ణి. మా భజన సమాజం సభ్యులు కొందరు కాశీలో పదకొండు రాత్రులు ఉండి రావాలన్న ప్రతిపాదన పెట్టారు. ఒక గురువుగారి ఆధ్వర్యంలో బయల్దేరాం. తలో మూడు వేలు.

"నన్నూ తీసుకెళ్ళొచ్చు కదా అని అడిగింది చంద్రకళ. కాదనలేక పోయాను. ఆమెకీ డబ్బు కట్టాను.

"రైల్వేస్టేషన్లో మొట్టమొదటి సారి చంద్రకళను చూశాను. చామనచాయగా ఉన్నా అందమైనదే అని చెప్పాలి. ఎక్కువ మాట్లాడదుగానీ, అన్నీ గమనిస్తూనే ఉంటుంది".

"కాశీలో ఒక సత్రంలో బస. పొద్దున్నే లేచి చంద్రకళా, నేనూ స్నానానికి వెళ్ళి గుడిలో దర్శనం చేసుకుని, అక్కడే భోజనాలు చేసుకుని సాయంత్రం నది ఒడ్డున కూర్చుని కబుర్లు చెప్పుకునేవాళ్ళం. అలా నాలుగు రోజుల్లో బాగా చనువు ఏర్పడింది.

"చంద్రకళలో చంద్రుడిలో ఉన్నన్ని కళలూ ఉన్నాయి. ఒకసారి కిలకిలా నవ్వుతుంది. ఒకసారి




## చిగురించే కాలాన

శిశిరపు తొడుగుల్ని
విదిలించుకొంటున్న వేళ
పిలవకుండానే కొన్ని లేత చిగుళ్ళు
నాలోంచి మొలకెత్తుతున్నాయ్
ఆశలకు ఊహలకు
ఉయ్యాలతాళ్లను కట్టి
ఆకాశం నుండి ఆకాశంలోకి ఊగుతున్నాను
ఎక్కడా నిలబడింది లేదు
గమ్యం నిరంతరం మారుతూనే ఉంది
లోలకపు జీవితంలో
ఎండిపోవడం చిగురించడం
సాధారణ ప్రక్రియ అయింది.



దేహపు స్పృహ
మొదలవుతున్న కాలాన
నన్ను నేను రగుల్చుకోవడం
కొత్త వాసనలతో పరిమళించడం
ఓ వేడుకగా ఉండేది
సంభాషణలతో కరచాలించుకోవడం
ఉత్సాహపు నురగలతో తేటపడటం
సరికొత్త ప్రశ్నలై తలెత్తడం
ప్రవాహానికి ఎదురెళ్లడం
అన్నీ నూతన శ్వాసై
గుండెల్లో నిలిచేవి
ఎదుగుతున్న చీకటికొసకి
దీపపు కాంతులు అంటించడం

విస్తరిస్తున్న శరీర దాహానికి
ఇంత వేడిని పుట్టించడం
కొమ్మల మాటున దాగిన
ఓ నల్లని గొంతును సవరించుకోవడం
నాకు నేనే ఓ ప్రశ్నగా ఎదురుపడటం
వింత అనుభవాలే!

దేహం స్పృహను
కోల్పోతున్న కాలాన
తడి ఇంకిపోతున్న మాటల్ని పేనుతున్నట్లు
రంగులన్నీ శ్వేతవర్ణంలో కలిసిపోయినట్లు
రాగాలన్నీ గొంతులో పూడుకుపోయినట్లు
మళ్లీమళ్లీ అదే పేరుతో జన్మిస్తూ అంతరిస్తూ
వాడిపోయి వడలిపోయి అంతలోనే చిగురిస్తూ
అనుభవం కానిదాన్ని అనుభవిస్తున్నాను

నువ్వు అట్లా దేహానికి
కొత్తరంగు అద్దుతున్నప్పుడే
దేహకాంతులు విరిగిపడుతున్న చప్పుడు
మొలవని చెట్టుకు వేలాడుతున్న
వెన్నెల రాలిపడుతుంటుంది
పొంగుతున్న ప్రవాహాల సుడిగుండాలలో
ఆధారం కోసం ఆయాస పడాలి
అక్కడే సరికొత్తగా
జీవితాన్ని గురించిన అన్వేషణ మొదలవుతుంది
మూసుకుపోయిన మార్గాలలోంచే
ఓ కాంతిరేఖ చెయ్యిపట్టి
నన్ను నడిపిస్తుంది
శూన్యం ఇప్పుడు
నన్నో
నాలాంటి వాళ్లనో
తనలో నింపుకొంటుంది
మళ్లీకొన్ని కొత్త చిగుళ్ల
నాలోంచి మట్టిలోంచి
కొమ్మచాటు గొంతుల్లోంచి పైకిలేస్తాయి

**—బండ్ల మాధవరావు**
**సెల్: 88976 23332**

మూగదానిలా మారిపోతుంది. ఒకసారి అనర్గళంగా మాట్లాడేస్తుంది. ఒకోసారి తర్కంలోకి దిగేది.

"ఒకరోజు స్వామీజీని దేవుడున్నాడా? అని అడిగింది. కలడు కలడనెడివాడో కలడో లేడో అని సందేహం వెలిబుచ్చింది. నాలుగు రోజులు తరువాత నాకు చలిజ్వరం పట్టుకుంది. మా బృందం వాళ్ళంతా నన్ను రైలు ఎక్కించారు. నాతో పాటు చంద్రకళా వచ్చింది.

ఈసారి తిన్నగా నాతోపాటు మా ఇంటికే. వారం రోజులు తిష్టవేసింది. నాకు తగ్గింది గదా మీ ఇంటికి వెళ్ళు' అన్నాను. 'ఇదే నా ఇల్లు' అన్నది. నా గుండె గుభేలు మన్నది.



జంలో వాళ్ళని ఒకరిద్దరిని అడిగాను. ఒక స్త్రీ కోర్టు బోనులో నిలబడి ఫలానా వాడు నన్ను మానభంగం చేశాడని చెబితే చాలు, వేరే ఏ సాక్ష్యమూ అక్కర్లేదు. కోర్టు ఆమె మాటలు నమ్మి శిక్ష వేస్తుందని చెప్పారు.

"పోలీసు కానిస్టేబుల్ ఒకడు రాయబారం చేశాడు. నా ఇల్లు ఆమెకు రాసిస్తే, కేసు విత్ డ్రా చేసుకుంటుందిట. రేపు ఈ విషయాలన్నీ నా కొడుక్కీ, కూతురికీ తెలిస్తే ఎంత నామర్దా? పరువు పోవటం కన్నా ప్రాణం పోవటం నయం కదా సార్"

"ఒక కల్చరల్ ట్రూపువాళ్ళు అమెరికాలోని కొన్ని నగరాల్లో ప్రోగ్రాములు ఇస్తున్నారని తెల్సి, వాళ్ళ కాళ్ళు పట్టుకుని ఆ ట్రూపులో చేరి అమెరికా వచ్చాను. వాళ్ళంతా వెళ్ళిపోయారు. నేను తప్పించుకు తిరుగుతున్నాను" చెప్పి ముగించాడు నాగేశ్వరరావు.

"కానీ ఎన్నాళ్ళు ఇలా తప్పించుకు తిరుగుతావు? తప్పు చెయ్యనప్పుడు ఎందుకు పారిపోవాలి?" అడిగాడు శ్రీహరి.

"జీవితంలో నా ఆఖరి ఘడియలు నా గడప లోనే గడపాలని నా ఆశ. అదీ అడియాస అవుతోంది.." అన్నాడు నాగేశ్వరరావు.

"క్యారెక్టర్ అసాసినేషన్... మనిషిని మానసికంగా చంపేమార్గం ఇది. ఇందులో ఒక పెద్ద అసంబద్ధత ఏమిటంటే, పోలీసు కంప్లయింట్ అక్కడెక్కడో ఇవ్వటం ఏమిటి? అక్కడ మానభంగం జరిగిందని ఆమె రుజువు చెయ్యాలంటే అక్కడ నువ్వు ఉన్నట్లు రుజువు చెయ్యాలి గదా. ఇందులో నీ

ఒకరోజు ముషీరాబాద్ పోలీసుస్టేషన్ నుంచి శ్రీహరికి ఫోన్ వచ్చింది. నాగేశ్వరరావు అనే వ్యక్తి తన ఇంట్లో రాత్రి ఆత్మహత్య చేసుకున్నాడు. చనిపోయేముందు అతను శ్రీహరి పేర ఒక లెటర్ రాశాడు. ఫోన్ నెంబరూ ఇచ్చాడు.

శ్రీహరి పోలీస్ స్టేషన్‌కి వెళ్ళాడు. వాళ్ళు ఆయనకు నాగేశ్వరరావు రాసిన లేఖ అందించారు.

'ధగద్దాయమానమైన కిరీటాలు ధరించిన దేవుళ్ళకి నిత్య పూజలు అందుకునేందుకే తీరిక లేదు. ఇంక నాలాంటి నిరుపేద మొర ఎక్కడ ఆలకిస్తారు? దేశం కాని దేశంలో దిక్కులేని పక్షిలా తిరుగుతున్న నన్ను ఒక పూట చేరదీసి, వెన్నుతట్టి ధైర్యంచెప్పి ఇంటికి పంపించిన దేవుడికి నమస్కారం.

మీరు చెప్పిందే కరెక్ట్. క్యారెక్టర్ అసాసినేషన్... ఎలా తెల్సిందో నేను చంద్రకళను రేప్ చేసి, పారిపోయానని అందరూ అనుకుంటున్నారు. నాతోనూ అన్నారు. పరువుపోయిన తర్వాత ప్రాణం ఉన్నా ఒకటే, లేకున్నా ఒకటే.

చివరి ఘడియలు నా గడపలోనే గడపాలన్న చిన్న ఆశ నెరవేర్చిన మీకు కృతజ్ఞతలు.

–నాగేశ్వరరావు'.

శ్రీహరి లేచి నాగేశ్వరరావు ఇంటికి వెళ్ళబోతుంటే బావమరిది ఫోన్ చేశాడు.

"బావా! రాత్రి డ్రంక్ అండ్ డ్రైవ్‌లో మనవాణ్ణి పట్టుకున్నారు. ఎవరికన్నా చెప్పు.."

## కీర్తి సావిత్రి కాదా?

*కచ్చితంగా అవునని ఎవరూ చెప్పడం లేదుకానీ అనుమానాలు మాత్రం వ్యక్తం చేస్తున్నారు. దీనికి ఒక కారణం ఉంది. ఈ సినిమాకు కీర్తి మూడుకోట్లు అడిగిందట! మామూలుగా కీర్తి ఒక్క సినిమాకు కోటిన్నర తీసుకుంటుంది. ఈ సినిమా ద్విభాషా చిత్రం కావడంతో మూడుకోట్లు అడిగిందట! అయితే ఈ సినిమాదర్శక నిర్మాతలు రెండు కోట్లు ఇవ్వడానికే ఒప్పుకున్నారట! కీర్తి మాత్రం మూడు కోట్లకు ఒక్క మెట్టు కూడా దిగి రాకపోవడంతో ఆమెస్థానంలో మరో హీరోయిన్ కోసం వేట మొదలు పెట్టారట! మరో హీరోయిన్ దొరికితే సరి, లేకపోతే మరికొద్దిగా బేరం చేయాలని అనుకుంటున్నారట దర్శకనిర్మాతలు. హీరోయిన్ ఎంపిక కోసమే సంవత్సరాలు గడిచిపోయేటట్టు ఉందనీ ఇక సినిమా ఎప్పుడు మొదలుపెడతారో? అని సినీ జనాలు అంటున్నారు.*

"రెండురోజులు ఇద్దరి మధ్యా వాదోపవాదాలు జరిగాయి. తనను పెళ్ళి చేసుకోమంది. సాధ్యం కాదని చెప్పాను. ఏ కులాంతర వివాహం కారణంగా కొడుకును వేరు చేసుకున్నానో, అలాంటి కులాంతర వివాహమే తానూ చేసుకుంటే రేపు నా కొడుకు ముందు తలెత్తుకుని నిలబడగలనా? నలభై ఏళ్ళ కూతురు ముందు నిలబడగల అర్హత ఉంటుందా? ఎట్టి పరిస్థితుల్లోనూ కుదరదని" చెప్పాను.

తనమాట కాదంటే పరిస్థితులు తీవ్రంగా ఉంటాయని హెచ్చరించి వెళ్ళిపోయింది. వారం రోజుల తర్వాత రాచకొండ పోలీసుస్టేషన్ నుంచి ఫోన్ వచ్చింది. చంద్రకళ అనే స్త్రీని నువ్వు మానభంగం చేశావని రిపోర్టు ఇచ్చింది. రేపు స్టేషన్‌కి రమ్మన్నాడు. అదెక్కడుందో వెతుక్కుంటూ వెళ్ళాను.

నా మీద క్రిమినల్ కేసు రిజిస్టరు అయిందనీ, నాకు శిక్ష తప్పదనీ బెదిరించాడు. ఇదెక్కడి గోల? చుట్టమై వచ్చి దయ్యమై పట్టుకుంది? భజన సమా

తప్పేమీ లేదు కాబట్టి నాకు చేతనైన సాయం చేయటానికి ప్రయత్నం చేస్తాను. ఒక రిటైర్డ్ ఐ.జి. రోజూ పార్క్‌లో కలుస్తుంటాడు. మంచి ఫ్రెండ్ కూడా. ఆయన పేరు చెబితే ఇప్పటికీ పోలీసు వాళ్ళకి గౌరవమే. అంతగా అవసరం అయితే ఆయన ద్వారా పరిష్కరించే ప్రయత్నం నేను చేస్తాను. నా ఫోను నెంబరు తీసుకో. నువ్వు ఇంటికి వెళ్ళు. నీ ఇంట్లో నువ్వు నిశ్చింతగా ఉండు. ఏం పర్వాలేదు.." అభయం ఇచ్చాడు శ్రీహరి.

నాగేశ్వరరావు లేచి, వంగి ఆయన పాదాలకు నమస్కారం చేశాడు.

శాలిని, సుధారాణి వచ్చాక భోజనాలు చేశారు. శాలిని నాగేశ్వరరావుని ఆయన ఫ్రెండ్ ఇంట్లో దించేసి వచ్చింది.

మర్నాడు శ్రీహరి, సుధారాణి బయల్దేరి హైదరాబాద్ వచ్చారు.

నెల రోజులు గడిచిపోయాయి.

శ్రీహరి ఎవరికీ చెప్పదల్చుకోలేదు. శాలిని మాటలే గుర్తొచ్చాయి. అమెరికాలో చిన్న తప్పులకీ పెద్ద శిక్షలు వేస్తారు.

"ఇండియాలో తప్పు చేయకపోయినా, ఎవడికి వాడు చాలా పెద్ద శిక్ష వేసుకుంటాడు."

ఆయన మాటలు విన్న పోలీసు ఆఫీసర్ ఆశ్చర్యంగా చూశాడు.

శ్రీహరి నాగేశ్వరరావు ఇంటికి వెళ్ళేసరికి అంతిమ సంస్కారం జరుగుతోంది. స్నానం చేయిస్తున్నారు.

చంద్రకళ కాబోలు పక్కన నిలబడి అన్నీ తానే అయి చేయిస్తోంది.

నాగేశ్వరరావును తాళ్ళతో బిగించి కట్టేశారు. లారీ ఎక్కించారు. నెమ్మదిగా లారీ కదిలింది. దూరంగా వెళ్ళిపోయింది. అతని పాటే చెవుల్లో మారుమోగుతోంది.

'పయనించే ఓ చిలుకా, ఎగిరిపో, పాడైపోయెను గూడు...'

**సెల్: 99595 56876**

సురభి

## కుకూ గడియారం

కుకూ గడియారం చూసే ఉంటారుకదా. గంట గడవగానే ఓ చిన్న పక్షి తలుపులు తెరుచుకుని బయటకు వచ్చి కుకు...కుకు... అనేసి మళ్ళీ లోపలికి వెళ్ళిపోతుంది. ఆ శబ్దం కూడా వినసొంపుగా ఉంటుంది. మరి అలాంటి గోడగడియారమే మరింత పెద్దగా ఉంటే...

జర్మనీలోని ట్రిబర్గ్‌లో, ఎబ్లె ఉహ్‌రెన్ పార్కులో ఈ అతిపెద్ద కుకూ గడియారం ఉంది. దీనికి ప్రపంచంలోనే అతి పెద్ద కుకూ క్లాక్‌గా పేరూ, రికార్డు ఉన్నాయి. 15 అడుగుల పొడవుండే ఈ గడియారంలో పొడవైన లోలకం అటూ ఇటూ ఊగుతూ ఉంటుంది. దీనికి రెండు పక్కలా బోలెడు బొమ్మల్నీ ఉంచారు. గంటకు రెండు సార్లు కుకూ బొమ్మ వచ్చి శబ్దం చేయగానే ఇరువైపులా ఉన్న బొమ్మలన్నీ చక్కగా తిరుగుతుంటాయి. ఈ గడియారం లోపలి అమరిక, యంత్రాల పని తీరును నేరుగా, దగ్గరగా చూడ్డానికి లోపలికి వెళ్ళొచ్చు.



ఎవల్డ్, రాల్ఫ్ ఎబ్లె అనే ఇద్దరు గడియారం తయారీదారులు కలిసి దీన్ని 1994లో ఏర్పాటుచేశారు. ఇదున్న పార్కులోనే తరతరాలనాటి కుకూ గడియారాల్నీ, గోడ గడియారాల్ని ప్రదర్శనకు ఉంచారు. ఎటుచూసినా కుకూ క్లాక్‌లతో ఆకట్టుకునేలా ఉంటుందీ పార్కంతా.

## లక్కీనాట్ వారధి

కొన్ని ప్రదేశాలు, ప్రాంతాలు, కట్టడాలు చూడటానికి కొత్తగా, వింతగా, ఆసక్తికరంగా ఉంటాయి. అలాంటి ఆసక్తికరమైన కట్టడమే చైనాలో ఒకటి ఉంది. అదికూడా ముచ్చటగా మూడు ప్రాంతాలను కలిపే వంతెన. చూడాలంటే మాత్రం చైనా వెళ్ళాల్సిందే.

చైనాలోని చాంగ్షా నగరంలో ఈ మధ్యనే ప్రారంభమైంది లక్కీనాట్ వంతెన. నెదర్లాండ్స్‌కు చెందిన వాస్తుశిల్పులు దీన్ని రూపొందించారు. చూడటానికి మెలికలు పడ్డ రిబ్బన్‌లా ఉంటుందీ వంతెన. మెట్లతో కూడి చూడముచ్చటగా అనిపిస్తుంది. ఈ వంతెన ఇక్కడి రహదారిని, ఓ ఉద్యాన వనాన్ని, డ్రాగన్ కింగ్ హార్బర్ అనే నదిని కలుపుతుంది.



అంతం లేకుండా మెలికలు తిరిగే 'మొబియస్ స్ట్రిప్'ను ఆదర్శంగా తీసుకుని, చైనా సంస్కృతిలో అదృష్టం గుర్తును పోలినట్టు ఈ వంతెన నిర్మించారు. కాబట్టే దీనికి లక్కీనాట్ అని పేరు పెట్టారు. సంపదకు, సంతోషానికి చిహ్నంగా భావించే ఎరుపు రంగు వేశారు. పర్యాటకుల్ని విపరీతంగా ఆకట్టుకుంటోంది ఈ రిబ్బన్ వంతెన. సందర్శకులు మెలికలు తిరిగిన వంతెనపై నడుస్తూ, ఫొటోలు దిగుతూ తెగ ఆనందపడిపోతున్నారు.

## పరుగు పర్యటన



రికార్డు కోసమో, ఆశయం కోసమో, సరదా కోసమో నడుస్తూనో, వాహనాలపైనో, సైకిళ్ళపైనో యాత్రలు చేయడం చూస్తూనే ఉంటాం. కానీ కాయ్ మార్కస్ గ్జియాంగ్ మాత్రం పరుగెడుతూ పర్యటిస్తున్నాడు. అదీ జర్మనీ నుంచి చైనా వరకు.

కాయ్ మార్కస్ జర్మనీ, బవేరియాలో పుట్టినా, తన తాతగారి వల్ల చైనా దేశం అంటే మక్కువ ఏర్పడిందట. అక్కడి సంస్కృతీ సంప్రదాయాలు తెగ నచ్చేశాయట. అంతేకాదు చైనా సంప్రదాయ వైద్యంపై నమ్మకం కుదిరిందతడికి. దాంతో చైనా దేశంపై చాలామందికి ఉన్న అపోహలు తొలగించేందుకు కంకణం కట్టుకుని జర్మనీ హామ్‌బర్గ్ నుంచి చైనా షాంఘై వరకు పరుగులు పెట్టాలని నిర్ణయించుకున్నాడు. అంతే మార్చి 12న తన పరుగు మొదలుపెట్టాడు కూడా. 235 రోజుల్లో 12 వేల కిలోమీటర్ల దూరం పరుగెత్తి షాంఘై చేరుకోవాలని దృఢనిశ్చయంతో ఉన్నాడు మార్కస్. 'రన్ ఫై సిల్క్ రోడ్' పేరుతో వెబ్‌సైట్ తెరిచి, తన పరుగు విశేషాలు ఎప్పటికప్పుడు అప్‌డేట్ చేస్తున్నాడు. బెలారస్, రష్యా, కజికిస్థాన్, ఉజ్బెకిస్థాన్, కిర్గిజిస్థాన్ మీదుగా తన ప్రయాణం సాగేలా ప్లాన్ సిద్ధం చేసుకున్నాడు.

## కుంగ్‌ఫూ గ్రానీ

విద్య నేర్చుకోవడం ఒకెత్తు. నేర్చుకున్న విద్యను నిరంతరం ఆచరణలో పెట్టడం మరొక ఎత్తు. అదే చేస్తోంది జాంగ్ హెక్సియన్. కుంగ్‌ఫూ యోధురాలిగా వృద్ధాప్యంలోనూ తన సత్తా చాటుతోంది. తన ఊరికే సంరక్షకురాలిగా ఉంటూ అందరి మన్ననలు పొందుతోంది.

చైనాలోని లియాంగ్ ప్రాంతానికి చెందిన జాంగ్ హెక్సియన్ తన ఊరికి సంరక్షకురాలిగా మారింది. 94 ఏళ్ళ వయసులోనూ దొంగలు, దుండగుల భరతం పడుతోంది. నాలుగేళ్ళ నుంచే కుంగ్‌ఫూ నేర్చుకోవడం మొదలు పెట్టిందట హెక్సియన్. దశాబ్దాలుగా కుంగ్‌ఫూ విద్యతో ఊరిలో దోపిడీలు జరగకుండా అడ్డుకుంటోంది. అందుకే స్థానిక ప్రజలు ఆమెను 'కుంగ్‌ఫూ గ్రానీ' అని పిలుస్తారు. అక్కడి యువతకు ఆమె కుంగ్‌ఫూ గురువుగా మారి పాఠాలు నేర్పిస్తోంది. వేడుకల సమయంలో హెక్సియన్ తన విద్య నైపుణ్యాల్ని ప్రదర్శిస్తుంటుంది.



–నర్మద వాసిరెడ్డి

# వెట్టి
## (ది వారియర్)
### -మధుబాబు




**'ఇందాక ఒకసారి చెప్పాను. మళ్ళీ ఇంకోసారి చెప్పాల్సిన అవసరం వస్తుందని అనుకోలేదు. సమస్యల మీద సమస్యల్ని తలకు ఎత్తుకోవటం నీకు బాగా అలవాటు అయిపోయింది' అన్నాడు రమణయ్యపంతులు.**

**రభసరభసగా ఉంది శివారెడ్డి గది వెలుపల ఉన్న ప్రదేశం. కళ్ళు తేలవేసి పిచ్చి చూపులు చూస్తున్న కొడుకును గదిలో నుంచి ఇవతలికి లాగి మొఖం మీద నీళ్ళు చిలకరించమని కేకలు పెడుతున్నాడు బాజిరెడ్డి.**

'పిలవండి. డాక్టరు గారిని వెంటనే రమ్మని చెప్పండి' అంటున్నాడు.

బిల్డింగ్ ముఖద్వారం దగ్గరికి వచ్చి నిలబడ్డాడు అతని డ్రైవర్. తన దగ్గర ఫోన్ లేకపోవటంతో పిచ్చిచూపులు చూస్తున్నాడు.

'వాడు ఇంతకుముందు రోడ్డుమీద ఉన్న జనంతో కలిసి మనల్ని వాచ్ చేస్తున్నాడు కదా... ఎప్పుడు లోపలికి వచ్చాడు?' అతన్ని గమనించిన ప్రణవి చిన్నగా అడిగింది పంతులుగారిని.

'ఇందాక కారు వచ్చినప్పుడే తను కూడా వచ్చేశాడు. లైట్లు పోయినప్పుడు నన్ను ఆపటానికి ట్రై చేశాడు' అన్నాడు పంతులుగారు.

'ఇప్పుడు ఏం జరుగుతుంది?' మరో ప్రశ్న వేసింది ఆమె.

పంతులుగారు సమాధానం ఇవ్వకముందే, పిచ్చి చూపులు చూస్తున్న పఠాన్‌కి పూర్తిగా వచ్చింది స్పృహ.

'అప్పా.. వాడే.. వాడే నన్ను కొట్టాడు..' అంటూ గబుక్కున లేచి నిలుచున్నాడు.

అయోమయమైపోయింది బాజిరెడ్డికి. 'ఎవడురా? ఎవడు కొట్టాడు? ఏం మాట్లాడుతున్నావు?' అని అడిగాడు.

'వాడే అప్పా... విఠల్‌రెడ్డి' అని చెప్పబోతూ, పెద్ద పెద్ద కళ్ళు మరింత పెద్దవిచేసి చూస్తున్న ప్రణవిని గమనించి, ఆ మాటల్ని మింగేశాడు పఠాన్.

'చెప్పరా... చెప్పు.. ఎవరు నిన్ను కొట్టింది?' కొడుకు మొఖం దగ్గర మొఖం పెడుతూ అడిగాడు బాజిరెడ్డి.

'నువ్వు సైడయిపోవటం బాగుంటుంది అబ్బయ్యా! వాడు నిన్నుచూపిస్తే గొంతు చినిగి పోయేటట్టు కేకలు పెడతాడు వీడు. వెట్టి వెనుకే నిలబడి చిన్నకంఠంతో హెచ్చరించాడు శంకరయ్య.

'వాడు నా గురించి చెపితే, నేను సైడయిపోయినా కూడా కేకలు వెయ్యడం వెయ్యటమే' అన్నాడు వెట్టి.

'చెప్పరా... చెప్పు. ఎవడు నీ ఒంటిమీద చెయ్యి వేసింది?' చాలా రఫ్‌గా కొడుకు షర్టు పట్టుకుని గుంజుతూ ఇంకోసారి అడిగాడు బాజిరెడ్డి.

మళ్ళీ చూశాడు పఠాన్ – ప్రణవి వైపు.

అంత సీరియస్ సిచ్యుయేషన్‌లో కూడా ఉబికి వస్తున్న నవ్వును బిగపట్టుకోవటం కష్టమై పోతున్నది ఆమెకు. పెదవులు ముడిచి తలను పక్కకు తిప్పుకుంటున్నది.

ఆమె మీది నుంచి శివారెడ్డి గది ద్వారం వైపు మరలాయి పఠాన్ చూపులు. గదిలో ఉన్న శివారెడ్డి, అతన్ని అటెండ్ అయ్యే డాక్టరుగారు తప్ప మిగిలిన వారందరూ బయటికి వచ్చి నిలబడి ఉన్నారు.

'చెప్పమని అడుగుతుంటే పిచ్చిచూపులు చూస్తావేమిటి పఠాను? చెప్పమంటున్నాడుగా చెప్పు' అన్నది పిచ్చమ్మి.

ఆమెకు నాలుగు అడుగుల దూరంలోనే నిలబడి ఉన్నాడు వెట్టి. జెముడుకాకి ఏ రంగులో ఉంటుందో, ఆ రంగులోకి మారిపోయింది పఠాన్ మొఖం అతణ్ణి చూడగానే.

'ఎవరూ కొట్టలేదు. కాలుజారి కిందపడ్డాను. ఆ దెబ్బకు తల దిమ్మెక్కి. ఎవరో కొట్టినట్టు అనిపించింది. అంతే' అంటూ తనను పట్టుకుని ఉన్న తండ్రి చేతుల్ని వదిలించుకుని, విసవిసా ముఖద్వారం దగ్గరికి వెళ్ళిపోయాడు.



## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. తన పెత్తనాన్ని సవాలు చేసిన వెట్టిని అంతమొందించాలను కుంటాడు బాజిరెడ్డి. రాయుడిపల్లిలో చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో వెట్టి తెలుసుకుంటాడు. కదిరి బయలుదేరిన అతడికి చౌడేశ్వరి ఆత్మశిల కనిపిస్తుంది. పిచ్చిపూజారికి ఆత్మశిల గురించి చెప్పి, ఎవరికీ తెలియకుండా ఆ తల్లిని యథాస్థానంలో ఎలా ప్రతిష్ఠించాలో ఆలోచించమంటాడు. తిరిగి ఎస్టేటుకు వచ్చిన వెట్టి, సబ్బిరెడ్డితో మాట్లాడి, తాను అరెస్టు చేసిన పఠాన్‌ని విడిచిపెట్టమంటాడు. కడప నుంచి హేమారెడ్డి డైరెక్ట్‌గా శివారెడ్డికే ఫోన్ చేస్తాడు. బాజిరెడ్డి తనదగ్గర తీసుకున్న మొత్తాన్ని చెల్లించ కుంటే ఎస్టేట్ మొత్తాన్ని స్వాధీనపరుచుకుంటా నని హెచ్చరిస్తాడు. సమస్యలన్నీ తాను సాల్వ్ చేస్తానని మాటిస్తాడు వెట్టి. పఠాన్‌ని బాజిరెడ్డి ఎస్టే టుకు తీసుకురావడంతో అతనికి ఎదురు పడతాడు వెట్టి. స్పృహకోల్పోయేలా కొడతాడు. **ఆ తర్వాత...**

'ఏమిటిది సంపంగీ – అసలు ఏం జరిగింది గదిలో?' ఒకపక్కగా నిలబడిన సంపంగిని అడి గాడు బాజిరెడ్డి.

ఆందోళనగా తనవైపు చూసిన శంకరయ్యను, పంతులుగారిని చూసి ముసిముసిగా నవ్వాడు వెట్టి.

'సంపంగికి ఏమీ తెలియదు. తను నన్ను చూడలేదు' అన్నాడు.

అదేమాట ఆమె తనకు చెప్పటంతో మరింత అయోమయానికి గురైనాడు బాజిరెడ్డి. తను కూడా ముఖద్వారం దగ్గరికి బయలుదేరుతూ, వెట్టివైపు చూసి, 'నువ్వు బయటికి రా. నీతో మాట్లాడాలి' అన్నాడు.

'అయిపోయింది అబ్బయ్య. నీ పని అయి పోయింది. ఇప్పుడు జరిగిన గొడవకి కారకుడివి నువ్వేనని తెలియకపోయినా, నీ భరతం పట్టేస్తాడు' కంగారుగా అన్నాడు శంకరయ్య.

'ఇదిగో వెట్టి. నువ్వు ఎక్కడికీ పోవాల్సిన అవ సరం లేదు. పోయి డైనింగ్ రూమ్‌లో కూర్చో.. పో' ఖంగుమంటున్న కంఠంతో హెచ్చరించింది పిచ్చమ్మ.

ఆ మాటలు తనకు వినబడనట్టే నటిస్తూ 'వస్తున్నావా?' అని బిగ్గరగా పిలిచాడు బాజిరెడ్డి.

'ముందూ వెనకా చూసుకోకుండా ఏదో ఒక పాడుపని చెయ్యడం. తర్వాత లేనిపోని బాధల్ని



నెత్తిమీదికి తెచ్చుకోవడం – ఎంతచెప్పినా ఏమీ ఉపయోగం లేకుండాపోతుంది' చిరాకు సగం, బాధ సగం నిండిన కంఠంతో అన్నది ప్రత్యూష.

అందరి మాటలకి సమాధానంగా ఒక చిరు నవ్వు నవ్వాడు వెట్టి. 'ఎప్పుడో ఒకప్పుడు ఇటువంటి పరిస్థితి ఒకటి వస్తుందని నాకు తెలుసు. అందుకు నేను సిద్ధంగా ఉన్నాను. మీరెవ్వరూ కంగారుపడి కాళ్ళు తొక్కుకోకండి' అంటూ ముందుకు అడుగు వేశాడు.

ముఖద్వారంలో నిలబడి ఉన్న బాజిరెడ్డికి అతని మాటలు వినబడలేదు గానీ, అతను కదలటం కని పించింది. పెదవుల మీద ప్రత్యక్షం అయింది ఒక చిరునవ్వు.

'రా. త్వరగా రా..' అని అంటూ ద్వారం దాటి మూడు అడుగులు ముందుకు వేశాడు.

'ఏంటి సారూ... ఏంటీ సంగతి' అంటూ అతణ్ణి సమీపించాడు వెట్టి పదిసెకన్ల తరువాత.

గుమ్మం ముందే నిలబడి ఉన్నది బాజిరెడ్డి కారు. దాని దగ్గరే ఉన్నారు అతని డ్రైవర్, పఠాన్.

'పట్టుకోండిరా... పట్టుకోండి' వెట్టి షర్టుకాలర్ పట్టుకుని బయటకి నెట్టాలనే కోరికతో చేతులు జాస్తూ వారిని హెచ్చరించాడు బాజిరెడ్డి.

అంతే... అంతకుముందు మాదిరిగానే ఉన్నట్లుండి కొండ ఎక్కాయి ఆ బిల్డింగ్‌లో ఉన్న దీపాలు అన్నీ. ఎదుట ఉన్న మనిషి మొఖం కూడా సరిగ్గా కనిపించనంత చీకటి అక్కడ ప్రత్యక్షం అయింది.

క్షణం.. ఒక్క క్షణంపాటు తడబాటుకు గురైనాడు బాజిరెడ్డి. 'ఏంటిరా ఇది? ఏంటి ఈ కరెంటు పోవటం?' పెద్దగా అంటూ తనకు సమీపంలోకి వచ్చిన వెట్టి కాలర్ పట్టు కునే ప్రయత్నం చేశాడు.

ప్రయత్నం అయితే పూర్తి అయిందిగానీ, చేతికి అందవలసిన వెట్టి కాలర్ మాత్రం అంద లేదు. కనీసం అతని భుజం కూడా అతని చేతికి దొరకలేదు.

కరెంట్ కట్టయి, దీపాలు కొండెక్కి, చీకట్లు ప్రత్యక్షం అయిన మరుక్షణం మెరుపులా కది లాడు వెట్టి. అవతలికి దూకి, అర్జంటుగా పక్కకు పరిగెత్తాడు.

శివారెడ్డి హౌస్‌హోల్డ్ మొత్తానికి పాలు సప్లయ్ చేసేందుకు పది మేలుజాతి పశువులు పెంచబడే బంగళా పెంకులషెడ్డు ఒకటి ఉన్నది ఆ బిల్డింగ్ పక్కభాగంలో. అటుకేసి పోయాడు అతను. అక్కడికి పాతిక అడుగుల దూరంలో ఉన్న ప్రహరీని సమీపించి, అమాంతం దాని మీదికి ఎగబాకాడు.

అతను ప్రహరీని అధిగమించి అవతలిపక్కన ఉన్న ఒక సన్నపాటి సందులోకి ఎంటర్ అవుతుండ గానే, గప్పున వెలిగాయి బిల్డింగ్‌లో లైట్లు అన్నీ. మరో సారి కాంతిమంతం అయింది ఆవరణ.

'ఏడిరా? ఏడిరా వాడు? ఏమైపోయాడు?' అని అడుగుతూ చుట్టూచూశాడు బాజిరెడ్డి.

'అప్పా.. వాడే... వాడే విఠల్‌రెడ్డి. గ్రానైట్‌మైన్స్‌కి మనం పంపించిన విఠల్‌రెడ్డి..' గబగబా చెప్పాడు కారు పక్కన నిలబడి ఉన్న పఠాన్.

విపరీతమైన కోపంతో నల్లగా కమిలిపోయింది బాజిరెడ్డి మొఖం. పళ్ళు పటపటమని కొరుకుతూ చాచిపెట్టి కొట్టాడు అతని చెంపమీద.

వెట్టి కొట్టిన దెబ్బల నొప్పికి, ఆ నొప్పికూడా తోడయ్యేసరికి, తూలి కారు బోనెట్‌ని ఆనుకున్నాడు పఠాన్. 'ఎందుకు నన్ను కొట్టావ్?' ఆశ్చర్యంగా అడిగాడు.

'ఇప్పుడు చెప్పిన మాట నువ్వు ఇందాకనే చెప్పి వుంటే–' అంటూ సడన్‌గా మాటలు మింగేశాడు బాజిరెడ్డి.

అతను ఎందుకు ఆగిపోయాడో అర్థం అయింది కాబోలు, 'లోపల ఉండగా చెప్పటానికి ఆడవాళ్ళం దరూ వింటున్నారని ఆగిపోయాను' అన్నాడు తను కూడా పఠాన్.

క్షణకాలం తర్వాత తనను తను కంట్రోల్ చేసు కున్నాడు బాజిరెడ్డి. 'పదండి...రోడ్డు మీదికి పదండి' అంటూ పఠాన్‌ని, డ్రైవర్‌ని హెచ్చరించి, కాలినడకనే తను ఆవరణలో నుంచి బయటికి వచ్చాడు.

'ఏంటి సారూ.. ఏమయింది? కరెంటేమిటి అన్ని సార్లు పోయి వస్తోంది' అడిగాడు ఒక అనుచరుడు.

'రోడ్డుమీద లైట్లన్నీ బాగానే ఉన్నాయి సారూ' అన్నాడు మరొకతను.

పళ్ళు పటపటమని కొరకబోయి, అందువల్ల ఎటువంటి ఉపయోగము ఉండదని ఆగి పోయాడు బాజిరెడ్డి.

'వాడు తప్పించుకున్నాడు. మనం వాడికోసం సిద్ధంగా ఉన్నామని తెలిసింది. చిటికెలో మటుమాయం అయిపోయాడు' అన్నాడు.

'ఇప్పుడు ఏం చేయమంటారు మమ్మల్ని' అడి గారు వాళ్ళు.

'వాడు సిటీలోనే ఉంటాడు. రైల్వేస్టేషన్, బస్ స్టేషన్ అన్నిటినీ కవర్ చేయండి. ఎక్కడ కనిపిస్తే అక్కడ మట్టిలో తొక్కేయండి' చెప్పాడు బాజిరెడ్డి.

తలలు ఊపారు వాళ్ళు. బాజిరెడ్డి డ్రైవర్‌ని వెంటబెట్టుకుని ఆ ఏరియా నుంచి నిష్క్రమించారు.

***

'ఏమిటే ప్రత్యూషా... ఏమిటి మెయిన్ దగ్గరికి పోయి దీపాలన్నిటినీ కొండెక్కించి వస్తున్నావ్? ఏమయింది నీకు?' ప్రత్యూషని నిలవేసింది పిచ్చమ్మి.

ఆమె అలా బిగ్గరగా మాట్లాడకుండా ఉంటే బాగుంటుందని ఎంతగానో అనుకున్నది ప్రత్యూష. కాని అప్పటికే జరిగిపోయింది జరుగవలసిన డామేజి.

చెవులు రిక్కించి నిలబడి ఉన్న సంపంగి విననే విన్నది ఆ మాటల్ని. క్షణం కూడా ఆలస్యం చేయకుండా కిచెన్‌వైపు వెళ్ళిపోయింది.

'ఆపాలి వదినమ్మ... అది బాజిరెడ్డికి చేరవేస్తుంది. విఠల్‌బాబు మొఖం రోడ్డుమీద ఉన్న వాళ్ళకి కనిపించకుండా ఉండటానికి నేను మెయిన్ ఆఫ్‌చేశానని తెలిసిపోతుంది' కంగారుగా శివారెడ్డి భార్యకు చెప్పింది ప్రత్యూష.

'సంపంగీ.. ఓయ్ సంపంగీ..' బిగ్గరగా పిలిచింది ఆమె.

కిచెన్‌లోకిపోయి, తన పమిటెచాటున దాచి పెట్టుకున్న ఫోన్ బయటికి తీయబోతున్న సంపంగి ఉలికిపడింది.

'డైనింగ్ హాల్లోకి రా.. వచ్చేయ్' పిలిచింది శివారెడ్డి భార్య.

మొఖం అదోలా పెట్టుకుని వెనక్కివచ్చింది సంపంగి. 'టేబుల్‌ని చూస్తే చిరాకేస్తోంది. శుభ్రం చెయ్' ఆర్డర్ ఇచ్చింది ఆమె.

తల వంచుకుని అటుపోతున్న సంపంగిని చూసి చిన్నగా నవ్వింది ప్రణవి. 'రేపో మాపో అది పని మానేసి బయటికి వెళ్ళిపోతుంది. నిన్నమొన్నటి నుంచీ దానికి ఊపిరి సలపటం లేదు.' అంటూ ఉన్నట్లుండి తల పక్కకు తిప్పుకున్నది.

'ఏమిటే? ఉన్నట్లుండి ఏమైంది నీకు?' ఆశ్చర్యంగా అడిగింది పిచ్చమ్మి.

'విఠల్‌బాబు గుట్టు రట్టు అయిపోయింది. బాజిరెడ్డి జనం అతణ్ణి వదిలిపెట్టరు. నాకు ఏదో సాయం చేస్తాడని అనుకున్నాను. చేయడు. చేయలేడు' నీరు నిండిన కనులతో చెప్పింది.

'ఏది జరగాలని రాసిపెట్టి ఉంటే అది జరుగుతుంది. అతణ్ణి ఏదైనా చేయాలంటే అందుకు ముందుగా అతణ్ణి పట్టుకోవాలి. క్షణం క్రితం వరకూ ఎట్ట ఎదుట నిలబడి ఉన్న మనిషి కాస్తా ఎలా తప్పించుకున్నాడో మనందరికీ కనిపించింది. అదే మాదిరి ఇకముందు కూడా తప్పించుకుంటాడు' అన్నది పిచ్చమ్మి.

'క్షణక్షణానికి అతని చుట్టూ ఉచ్చు బిగుస్తోంది అత్తమ్మా' అన్నది శివారెడ్డి భార్య.

**గుడ్డిగా పరుగులుదీస్తున్నాడు వెట్టి. దారి తెలియదు. ఎటువెళుతున్నాడో తెలియదు. పరుగెడుతూనే ఆలోచిస్తున్నాడతను. ఇలా పరుగెడుతూ ఉంటే లాభంలేదు. ఓచోట కుదురుగా రెండు మూడు గంటలు కూర్చొని ఆలోచిస్తే కానీ తన సమస్య ఓ కొలిక్కిరాదని భావించాడు. కానీ ఎక్కడికి వెళ్ళాలి? ఎటువైపు వెళ్ళాలి? ప్రశ్నలు తొలుస్తున్నాయి. మరి అతడి ప్రశ్నలకు సమాధానాలు లభించాయా?**

'గ్రానైట్‌మైన్స్ జనాన్నే బోల్తాకొట్టించి పారిపోయి వచ్చినవాడు.... ఈ బాజిరెడ్డిని మబ్బు చేయటం అతనికి ఒక లెక్కలోనిది కాదు' అంటూ డైనింగ్ హాల్లోకి బయలుదేరింది పిచ్చమ్మి.

***

పశువులశాలకు సమీపంలో ఉన్న ప్రహరీ మీది నుంచి అవతలికి దూకి ఆవరణలో నుంచి ఎగ్జిట్ అవటం అయితే అయ్యాడుగాని, అప్పటికప్పుడు తను ఎటుపోవాలో వెంటనే నిర్ణయించుకోలేక పోయాడు వెట్టి.

పరుగుపరుగున సందులో నుంచి ఒక మెయిన్ రోడ్డు మీదికి వెళ్ళాడు.

ఏ రోడ్డు ఎటుపోతుందో తెలియకుండా గుడ్డిగా పరుగులు తీస్తే తనకోసం తోడేళ్ళ మందలా వచ్చిపడే బాజిరెడ్డి జనానికో, గ్రానైట్‌మైన్స్ వాళ్ళకో పట్టుబడిపోవటం తప్పనిసరి అని తెలుస్తూనే ఉన్నది అతనికి.

సిటీ గురించి పూర్తిగా తెలిసిన రమణయ్య పంతులుగారు గనుక బిల్డింగ్‌లో కాకుండా బయటే ఉండివుంటే చాలా బాగుండి ఉండేదని అనిపించింది.

బాజిరెడ్డి జనానికి దొరకకుండా మటుమాయం అయిపోయే మార్గం ఆఖరి క్షణం వరకూ తనకే తెలియదు. ముంచుకు రాబోతున్న ప్రమాదాన్ని, ముందే ఊహించి మెయిన్ ఆఫ్ చేసింది ప్రత్యూష. తనని రక్షించింది.

కరెంట్ తీసేసింది ఆమేనన్న నమ్మకంతో మనసు లోనే ఆమెకు కృతజ్ఞతలు తెలియచేసుకున్నాడు అతను.

రెండు మూడు గంటలపాటు కుదురుగా ఎటువంటి టెన్షన్లూ లేకుండా ఎక్కడో ఒకచోట కూర్చోవాలి తను. తెల్లవారిన తర్వాత చేయవలసిన పనుల్ని గురించి ఆలోచించుకోవాలి.

దార్లు సరిగ్గా తెలియని ఆ సిటీలో గుడ్డిగా పరుగులు తీయడంకంటే, తనకు బాగా పరిచయం అయిన రాయుడిపల్లి వైపు పోవటం మంచిదేమో అనిపించింది అతనికి ఒక అరగంట తర్వాత.

అనిపించటం అయితే అనిపించింది గాని, ఆచరణలో పెట్టటానికి మాత్రం అంగీకరించలేదు అతని అంతరంగం.

రమణయ్యపంతులుగారు ఇప్పించిన బుల్లెట్ బండిని తాను రాయుడిపల్లిలోనే వదిలేసి వచ్చాడు. సరైన వెహికల్ ఏదీ ఇప్పుడు తన దగ్గర లేదు. కాలి నడకన బయలుదేరితే పుణ్యకాలం కాస్తా నడకకే సరిపోతుంది. రాత్రంతా తిరిగి పగలంతా నడిస్తే గాని తను అక్కడికి చేరుకోవడం కుదరదు. రెండు మూడు గంటలు ఎటువంటి టెన్షన్లు లేకుండా గడపటానికి అంత శ్రమ పడవలసిన అవసరం ఉన్నదా?

పాంటు జేబులో ఉన్న సిగరెట్ పాకెట్ తీసి సిగరెట్ వెలిగించుకుంటూ తనకు తెలియకుండానే, తనకు బాగా పరిచయం అయిన హాస్పిటల్ రోడ్డు మీదికి పోయాడు అతను.

హాస్పిటల్ అల్లంత దూరంలో ఉండగానే అతణ్ణి పలుకరించాడు చల్లగాలి కోసం తన దుకాణంలో నుంచి బయటికి వచ్చిన దుకాణం యజమాని.

'సారూ... చూడకుండా వెళ్ళిపోతున్నారు. ఇటుకేసి చూడండి ఒకసారి' అంటూ.

ఉలికిపడ్డాడు వెట్టి. తన చుట్టూ ఉన్న పరిసరాల్ని చాలా జాగ్రత్తగా పరికించుకుంటూ అడుగులు వేయవలసిన తను, ఏవేవో ఆలోచనల్లో మునిగి పోయి గుడ్డివాడి మాదిరి నడుస్తూ ఉండటాన్ని గమనించుకునేసరికి తనమీద తనకే కోపం వచ్చింది అతనికి.

'ఇప్పుడే కాచి ఫ్లాస్కులో పోశాను. టీ తాగుదురుగాని రండి సారు' చాలా మర్యాదగా మరోసారి పిలిచాడు దుకాణం యజమాని.

తను ఎక్కడికి పోవాలో ఇంకా నిర్ణయించుకుని ఉండకపోవటం వల్ల, ఆలస్యం చేయకుండా అతని దగ్గరికి పోయాడు వెట్టి. అతను ఇచ్చిన వెచ్చ వెచ్చటి టీని తాగి, పాంటు జేబులో చేయి పెట్టాడు డబ్బులు ఇవ్వటం కోసం.

'మీకు టీ ఇచ్చి డబ్బులు వసూలు చేసుకోవటం కోసం పిలవలేదు సారూ. పరిచయం ఉన్న వాళ్ళని పిలిచా.. జేబులోనుంచి చేతిని తీసేయండి'



అంటూ గొంతు తగ్గించాడు దుకాణం యజమాని.

'శివారెడ్డి సారు ఆరోగ్యం కుదుటపడిందని, బాజిరెడ్డిని ఇక మీదట బయటికి పంపించేస్తాడని అందరూ చెప్పుకుంటున్నారు. నిజమేనా?' అడిగాడు.

శివారెడ్డి అనారోగ్యం మటుమాయం అయిపోతున్న సంగతి అప్పుడే అందరికీ ఎలా తెలిసిపోయిందో వెట్టికి అర్థం కాలేదు.

'హాస్పిటల్లో చెప్పుకుంటున్నారు సారూ.... అందుకే అడిగాను' అతని నుంచి సమాధానం రాకపోవటంతో తనే మాట్లాడాడు దుకాణం యజమాని.

సిగరెట్ వెలిగించుకుని, పగిలిపోయిన పాత నాపరాయి స్థానంలో అతను కొత్తగా కట్టించిన ఇటుకల దిమ్మ మీద కూర్చున్నాడు వెట్టి.

'ఆళ్ళెవరో గువ్వలగుట్ట గ్రానైట్‌మైన్స్ వాళ్ళంట. కిటకిటలాడిపోతోంది హాస్పిటలు. కళ్ళు తేలేసి కోమాలో ఉన్న వాళ్ళ మనిషిని చూడటానికి ఎక్కడెక్కడినించో వచ్చి ఇక్కడే మకాం పెట్టారు' మళ్ళీ ఇంకో న్యూస్ వినిపించాడు దుకాణం యజమాని.

గ్రానైట్‌మైన్స్ జనం తనకోసం గాలిస్తూ ఉంటారని అనుకుంటున్న వెట్టికి చిన్న సైజు కరెంట్ షాక్ తగిలినట్టు అయింది.

'ఎంతమంది? ఎప్పటినుంచీ ఇక్కడ మకాం పెట్టారు?' అని అడిగాడు.

'ఇవ్వాళ పొద్దున వచ్చారు. అప్పటినుంచీ ఇక్కడే ఉన్నారు' అంటూ రోడ్డు మీదికి చూసి, 'అరుగో ఇంకా కొంతమంది వస్తున్నారు. గ్రానైట్‌మైన్స్ వాళ్ళే అయి ఉంటారు. సందేహం లేదు' అన్నాడు దుకాణం యజమాని.

మరోసారి షాక్ తిన్నాడు వెట్టి. 'తెల్లటి షర్టులు, మందపాటి తెలుపు రంగు పంచెలు, భుజాల మీద తెల్లటి ఉత్తరీయాలు.. సందేశం అవసరం లేకుండా తెలిసిపోయింది అతనికి.

సిమెంట్ దిమ్మ మీది నుంచి లేచి, వేగంగా దుకాణం పక్కభాగంలోకి పోయి నిలుచున్నాడు. తన చర్యలు దుకాణం యజమానికి ఆశ్చర్యాన్ని కలిగిస్తాయని తెలుస్తూనే ఉన్నా, ఆగలేదు.

పెద్దపెద్ద అడుగులు వేస్తూ దుకాణం ముందుకు వచ్చారు వాళ్ళు.

సగం మంది హాస్పిటల్ దగ్గరికి పోయారు. సగం మంది దుకాణం దగ్గరికి వచ్చారు.

'రండి.. రండి.. టీ వేడిగా ఉంది' అన్నాడు యజమాని.

తలలు ఊపి, కౌంటర్ మీద ఉన్న సిగరెట్ పాకెట్స్‌లో నుంచి తలా ఒక సిగరెట్ తీసి వెలిగించుకున్నారు వాళ్ళు.

'గ్రానైట్‌మైన్స్ వాళ్ళే కదూ మీరందరూ?' తన అభిప్రాయాన్ని కన్‌ఫర్మ్ చేసుకోవటానికన్నట్లు అడిగాడు దుకాణం యజమాని.

తలలు ఊపారు అందరూ.

'మీ వాళ్ళే కాబోలు ఇంకా చాలామంది వచ్చారు. హాస్పిటల్లోనే ఉన్నారు' చెప్పాడు దుకాణం యజమాని.

'దెబ్బతిన్న మా బసవప్పకి ఎలా ఉందిట? ఏమైనా తెలిసిందా?' అడిగాడు వారిలో ఒకతను.

'తెల్లారగానే బెంగుళూరు పంపించేస్తారట. ఇక్కడ నయమయ్యే ఛాన్సు లేదని అంటున్నారట' తనకు తెలిసింది చెప్పాడు దుకాణం యజమాని.

'అలా ఎలా పంపించేస్తారు?' ఉన్నట్లుండి కరుకుగా అడిగాడు ఒకతను.

'అదేంటి సారూ? ఎలా పంపించేస్తారంటే... ఆంబులెన్స్‌లో' అమాయకంగా అతనంత తెలివి తక్కువవాడు ప్రపంచంలో మరొకడు ఎవడూ ఉండడన్నట్లు హీనంగా చూడబోయిన తమ మనిషి భుజం తట్టాడు వారిలో మరొకడు.

'విషయం ఏమిటో అతనికి తెలియదు. తెలియవలసిన అవసరం లేదు. వదిలేయ్' అంటూ ముందుకు లాగాడు.

తాము తీసుకున్న సిగరెట్లకి, తాగిన టీలకు డబ్బులు చెల్లించి హాస్పిటల్ వైపు కదలబోతూ, ఉన్నట్లుండి ఆగిపోయారు వాళ్ళు.

ఝల్లుమన్నది వెట్టి శరీరం. తమ మాటల్లో తాముండి, వాళ్ళు తనను గమనించే అవకాశం ఉండదని అనుకుంటున్నాడు అతను.

గమనించటం వల్లనే వాళ్ళు ఆగిపోయారని భావించి, ఆ తర్వాత జరగవలసిందేమిటో ఆలోచించటం మొదలుపెట్టాడు.

ఎక్కువమంది లేరు. ఎడాపెడా పదిదెబ్బలు కొడితే చెల్లాచెదరు అయిపోతారు. తను అవతలికి జంప్‌చేసి దూరంగా పరిగెత్తవచ్చు.

ఎటొచ్చీ వాళ్ళు గావుకేకలు పెట్టి హాస్పిటల్ దగ్గర ఉన్న వాళ్ళందర్నీ ఎలర్ట్ చేస్తేనే వస్తుంది చిక్కు.

దుకాణం యజమాని మాటల్ని బట్టి చూస్తుంటే తనకోసం చుట్టుపట్ల ఉండే పట్టణాల్ని, పల్లెల్ని గాలిస్తున్న జనం అందరూ వచ్చి కదిరిలోనే సమావేశం అయినట్టు అర్థం అవుతోంది. అంతమందిని తను తప్పించుకోవటం సాధ్యపడక పోవచ్చు.

తన మొట్టమొదటి సమస్యను సాల్వ్ చేసుకోకుండా శివారెడ్డి వ్యవహారంలోకి వేళ్ళు పెట్టటం, బాజిరెడ్డిని రెచ్చగొట్టడం తప్పయిపోయిందనే మాట మెదిలింది అతని మనస్సులో.

బిగపట్టి ఉంచిన ఊపిరిని బయటికి వదులుతూ పిడికిళ్ళు బిగించి ఫైటింగ్‌కి రెడీ అవబోతూ ఉండగా తెలిసి వచ్చింది అతనికి, వాళ్ళు తనను గమనించటం వల్ల ఆగిపోలేదు.

దుకాణం పక్కభాగంలోకి చూడడం లేదు వాళ్ళు. తాము ఎటునుంచి వచ్చారో అటుకేసి చూస్తున్నారు.

'ఎవరై ఉంటారు? బాజిరెడ్డి అయ్యుంటాడా?' ఉన్నట్లుండి కామెంట్ చేశాడు వారిలో ఒకతను.

అధికం అయిపోయింది వెట్టి ఆత్రుత. పులిమీద పుట్ర మాదిరిగా ఇప్పుడు బాజిరెడ్డి కూడా అక్కడికి వచ్చేస్తే తన పరిస్థితి మరింత ప్రమాదకరంగా తయారవుతుందని అర్థమై, నోరు చేదుగా మారిపోయింది.

అక్కడినుంచి అవతలకి జంప్ చేయడమే మంచిది అనుకుంటూ, వెనక్కి జరిగాడు. దుకాణం వెనుక భాగంలోని ప్రహరీని సమీపించి అవతలి పక్కకు జంప్ చేయాలని అతని ఉద్దేశం.

మూడో అడుగు వేయకముందే మ్రోతలు చేస్తూ వచ్చి సరిగ్గా దుకాణం ముందు ఆగాయి ఖరీదైన కార్లు రెండు.

'శివారెడ్డి పెద్దలు కట్టించిన హాస్పిటల్ ఇదే కదూ?' విండోలో నుంచి తల బయటికి పెడుతూ అడిగాడు ఒక మనిషి.

తల ఊపాడు కళ్ళు అప్పగించి చూస్తున్న గ్రానైట్‌మైన్స్ మనిషి.

'శివారెడ్డి ఇప్పుడు హాస్పిటల్లోనే ఉంటాడు కదూ?' మళ్ళీ అడిగాడు ఆ మనిషి.




## పాదముద్రల సాక్షిగా

మస్తిష్కంలో నిక్షేపంగా
ఉన్న జ్ఞాపకాల్ని
గుండె లోతుల్నుంచి తవ్వి
ఊహావశేషాలను



తలుచుకుంటూ
ఎప్పటికీ చెరిగిపోని
నీ హృదయ ఫలకంపై
అందమైన కవితాక్షరాలు
నేను పేర్చిన క్షణాలు
నీకురుల కుంచెతో
నా చెక్కిలిపై
మృదువుగా నీవు నిమరిన క్షణాలు
మంచుకురిసిన గడ్డిపై మోపిన
నీ పాదాలకు
విరిసిన పసుపు పువ్వులతో
నేను పారాణి రాసిన క్షణాలు
వెన్నెల నీడల్లో మనం వేసిన
అడుగుల జాడల గుర్తులింకా
చెరిగిపోలేదు.
ఆ పాదముద్రల సాక్షిగా
నువ్వే నా దానివి
నా గుండె గుడిలో దేవతవి

**–కె.హరనాథ్**
**సెల్: 97035 42598**

ఒకరి వంక ఒకరు చూసుకున్నారు గ్రానైట్ మైన్స్ జనం. వాళ్ళు సమాధానం చెప్పకముందే తను కల్పించుకున్నాడు దుకాణం యజమాని.

'శివారెడ్డి సారుకు నయం అయిపోతోందని చెప్పి ఇంటికి తీసుకుపోయారు సారూ... హాస్పిటల్లో లేడు' అన్నాడు.

'నిజంగా? నిజంగానే?' ఆశ్చర్యంగా అడిగాడు కారులోని మనిషి.

'నిజంగా కాకపోతే అబద్ధంగా ఎలా చెపుతాను సారు. శివారెడ్డి సారుని ఎప్పుడో ఇంటికి తీసుకుపోయారు. అసలు ఇవాళో రేపో తనంతట తానే లేచి బయటికి వచ్చేయవచ్చని కూడా అనుకుంటున్నారు' తనకు తెలిసిన విషయాలు మరెవరికీ తెలియవని గ్రహించి, మరింత ఉత్సాహంగా చెప్పాడు దుకాణం యజమాని.

రెండు క్షణాలు ఆలోచించి కారులో నుంచి కిందికి దిగాడు ఆ మనిషి. 'అయిన ఆలస్యం ఎలాగూ అవుతోంది. ఇప్పటికిప్పుడు శివారెడ్డి ఇంటికిపోయి మనం మాట్లాడేది ఏమీ ఉండదు. టీ తాగి వెనక్కి పోదాం' అన్నాడు కార్లో ఉన్న తనవారితో.

ఒకరితర్వాత ఒకరుగా కిందికి దిగారు లోపల ఉన్నవాళ్ళు. అదేమాదిరి బయటికి వచ్చి ఒళ్ళు విరుచుకుంటూ దుకాణం ముందు నిలుచున్నారు రెండో కారులోని వాళ్ళు.

కొత్తగా వచ్చినవాళ్ళు తమ వంక చూడటం గాని, తమను పలుకరించే ప్రయత్నం చేయటం గాని ఏమీ జరగకపోవటంతో, ఒకరి వంక ఒకరు చూసుకున్నారు గ్రానైట్‌మైన్స్ జనం. ఒకరి వంక ఒకరుగా హాస్పిటల్ వైపు వెళ్ళిపోయారు.

'ఇంతకుముందు ఎప్పుడూ ఇక్కడ చూడలేదు. ఎక్కడినుంచి వస్తున్నారు సారు? మీరు ఎవరు?' టీ కప్పులు అందిస్తూ కొత్తగా వచ్చిన వాళ్ళని అడిగాడు దుకాణం యజమాని.

'మేము? కడప నుంచి వస్తున్నాము. హైమారెడ్డి తెలుసుకదా. ఫైనాన్షియరు' అన్నాడు ఒకతను.

తెలుసన్నట్టు తల ఊపాడు దుకాణం యజమాని.

'ఆయన పేరు తెలవక పోవటం ఏమిటి సారు? పెద్దమనిషి' అన్నాడు.

'ఇడుగో.. ఆయనే ఈయన..' నవ్వుతూ తన పక్కనే ఉన్న ఒక మధ్యవయస్కుడిని చూపించాడు మొదట మాట్లాడిన వ్యక్తి.

దుకాణం యజమాని మొఖంలో ఎటువంటి ఫీలింగులు ప్రత్యక్షం అయ్యాయోగాని, గుండెలు గుబిల్లుమన్నాయి దుకాణం పక్కభాగంలో నిలబడి ఆ సంభాషణ వింటున్న వెట్టికి.

'ఎక్కువగా మాట్లాడుతున్నట్టు అనిపిస్తే క్షమించండి. శివారెడ్డి సారుకు బంధువులా మీరు?' అడిగాడు దుకాణం యజమాని.

గాని, అతనితో వచ్చిన వారికిగాని తాను ఎవరో తెలియదు. తన కథ కూడా వారికి ఇంట్రస్ట్ కలిగించదు.

అప్పులు ఇవ్వటం, నయానో భయానో తిరిగి వసూలు చేసుకోవటం తప్ప మరో పని పెట్టుకోరు వాళ్ళు. తను హేపీగా రోడ్డుమీదికి పోవచ్చు.

పాంటుజేబులో నుంచి సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు అతను. చిమ్మచీకటిగా ఉన్న దుకాణం పక్కభాగంలోనుంచి ఒక్కసారిగా వెలుగు కనిపించే సరికి ఎలర్ట్ అయిపోయారు ఆ జనం.

తలలు తిప్పి అటే చూడటం మొదలుపెట్టారు. తాపీగా అడుగులు వేస్తూ దుకాణం ముందు భాగంలోకి వెళ్ళాడు వెట్టి.

'అరెరే.. వెళ్ళిపోయారని అనుకుంటున్నా. ఇక్కడే ఉన్నారా? టీ ఇంకోటి ఇవ్వమంటారా?' ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు దుకాణం యజమాని.

తల అడ్డం తిప్పి రోడ్డు మీదికి పోయాడు వెట్టి.

'అతను ఎవరు?' దుకాణం యజమానిని అడిగాడు హైమారెడ్డి జనంలో ఉన్న ఒక యువకుడు.

'అతను? అతను.. శివారెడ్డి తాలూకు మనిషే..' అతణ్ణి గురించి హాస్పిటల్ గార్డు తనకు చెప్పిన మాటలు గుర్తు చేసుకుంటూ అన్నాడు దుకాణం యజమాని.

'అతని పేరు ఏమిటి?' అడిగాడు ఆ యువకుడు.

బ్లాంక్ ఫేస్ పెట్టాడు దుకాణం యజమాని. 'మనిషి మాత్రమే తెలుసు సారు. పేరు తెల్వదు. మాట మహామంచిగా ఉంటుంది. కష్టం సుఖం

## నన్ను అలాగే చూస్తున్నారు

మిల్కీ బ్యూటీ తమన్నా బాధ ఇది. మొదట్లో అందాల ఆరబోత తమన్నాకు ఇష్టంగానే ఉన్నా ఇప్పుడు కష్టంగా ఉంటోందట! తన తోటి హీరోయిన్లు మంచి మంచి కథలతో దూసుకుపోతుంటే తనను మాత్రం గ్లామర్‌కే పరిమితం చేసేశారని తెగ ఇదయిపోతోంది. తనతో సినిమా అనుకోగానే గ్లామర్ డోస్ ఎక్కువ చేస్తున్నారనీ, మొదట చెప్పేదొకటి, చివరికి చూపించేది ఒకటిగా ఉంటోందని వాపోతోంది. 'అభినేత్రి'గా ఎంతగా ఆకట్టుకుందామని చూసినా అది ఎంత ఫ్లాపు సినిమానో తమన్నా గుర్తించకపోయినా దర్శకనిర్మాతలకు మాత్రం తమన్నా టాలెంట్ పూర్తిగా తెలిసిపోయింది. అందుకే తమన్నాతో నటన కన్నా అందాల ఆరబోత చేయిస్తేనే తమకు లాభం అని గ్రహించి ఆ దిశగా ఆమెను చూపిస్తున్నారన్న మాట! ఇదంతా తమన్నాకు తెలిసినా, తనలోని లోపాన్ని ఒప్పుకోకుండా దర్శకనిర్మాతల మీద ఆరోపణలు గుప్పిస్తోందని అంటున్నారు సినీ జనాలు.



'బంధువులు కాదు. మా దగ్గర అప్పు తీసుకున్నాడు. తీర్చలేదు. అడుగుదామని ఫోన్ చేస్తే సమాధానం సరిగ్గా చెప్పటం లేదు. ఎదురుపడి మాట్లాడటానికి వచ్చాము' అంటూ ఖాళీ అయిన టీ కప్పు సిమెంట్ దిమ్మె మీద పెట్టాడు ఆ మనిషి. సుడిగుండాల మాదిరి సుడితిరగటం మొదలుపెట్టాయి వెట్టి మనసులోని ఆలోచనలు. గ్రానైట్‌మైన్స్ జనం అవతలికిపోయిన మరుక్షణం తను ప్రహరీ మీదినుంచి అవతలకి దూకవలసిన అవసరం లేదని తెలిసిపోయింది అతనికి. హైమారెడ్డికి

తెలిసిన మనిషి..' అన్నాడు.

'ఏంటిరా? ఏంటి నీ అనుమానం?' వెట్టి వైపే చూస్తున్న యువకుడిని అడిగాడు హైమారెడ్డిగా పరిచయం చేయబడిన మధ్యవయస్కుడు.

'అతణ్ణి ఎక్కడో చూసినట్టుగా అనిపిస్తోంది. బాగా పరిచయం ఉన్న మొఖం మాదిరిగా కనిపిస్తున్నాడు. గుర్తుకు రావటం లేదు' మొఖాన్ని రుద్దుకుంటూ అన్నాడు యువకుడు.

'నువ్వు మామూలు మనిషివి అవటానికి కనీసం రెండు నెలలు పట్టవచ్చని డాక్టరు చెప్పాడు. పిచ్చి ఆలోచనలు పెట్టుకోకుండా ప్రశాంతంగా ఉండాలని కూడా అన్నాడు. ఇంటి దగ్గరే ఉండమని చెపితే వినిపించుకోకుండా మా వెంట వచ్చావ్..' విసుగు నిండిన కంఠంతో అన్నాడు హైమారెడ్డి.

'నాకు ఏమీ కాలేదు. నేను బాగానే ఉన్నానని' వెట్టి వైపే చూస్తూ చెప్పాడు యువకుడు.

**(ఇంకా వుంది)**

## నడుంనొప్పి తగ్గుతుందంటే నమ్మలేదు

యధావిధిగా క్లినిక్‌లో పేషెంట్స్‌తో బిజీగా ఉన్నాను. జూనియర్ డాక్టర్ వచ్చి ఒక పేషెంట్ పరిస్థితి సీరియస్‌గా ఉంది అని చెప్పడంతో లోపలికి పంపించమని చెప్పాను. అతని వయసు సుమారు యాభై ఉంటుంది. అమాంతం ఇద్దరు మనుషులు ఎత్తుకుని తీసుకుని వచ్చారు. ఏంటీ ప్రాబ్లం అని అడిగితే ఇలా చెప్పుకొచ్చాడు." సార్ నా పేరు దయాకర్. వ్యవసాయం చేస్తుంటాను. రోజూ పొలం పనులకు వెళితే తప్ప గడవదు. అలాంటి ఇప్పుడు నేను మంచానికే పరిమితమయ్యాను. ఎలాగైనా మీరే కాపాడాలి" అంటూ కన్నీళ్ల పర్యంతమయాడు. సమస్య ఏంటో క్లియర్‌గా చెప్పండి అన్నాను. "నాకు నాలుగైదేళ్లుగా నడుం నొప్పి ఉంది. పొలం పనులు ఎక్కువ చేయడం వల్ల నడుం నొప్పి వస్తుందేమో అనుకుని వదిలేసాను. ఆ తరువాత నొప్పి కాలుకు పాకింది. ఊర్లో డాక్టర్ మందులు ఇస్తే వాడాను. కొన్ని రోజులు బాగానే ఉంది. ఆ తరువాత నొప్పి ఇంకా ఎక్కువయింది. నడుం నుంచి పాదం వరకు సురుకు సురుకు మని పొడుస్తున్నట్లుగా నొప్పి ఉంటుంది" అని తన సమస్యనంతా చెప్పుకొచ్చాడు. స్కాన్ చేయిస్తే సయాటికా అని తేలింది.

**చికిత్స తరువాత**

నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం. వెన్నుపూసలో జరిగే మార్పులను నివారిస్తూ, కండరాలకు బలం చేకూరే విధంగా చికిత్స ఇవ్వడం వల్ల మంచి ఫలితం ఉంటుంది. సరిగ్గా ఆరు నెలలు మందులు వాడాడు. ఇప్పుడతనికి నొప్పి లేకుండా పోయింది.

## హోమియోతో కొత్త జీవితం

హెచ్‌ఐవికి చికిత్స ఉందని, క్రమంతప్పకుండా మందులు వాడితే అందరిలా సాధారణ జీవితం గడపొచ్చని చాలా మందికి తెలియదు. హోమియోలో హెచ్‌ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్‌ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్‌ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

**హెర్పిస్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఈ సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

**హోమియో చికిత్స :** హోమియో మందులతో రోగనిరోధక శక్తి బలపడుతుంది. తద్వారా హెచ్‌ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది. హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు కూడా హోమియో చికిత్స పనిచేస్తుంది. హోమియో చికిత్స మూల కారణాన్ని తొలగించి ఆరోగ్యవంతమైన జీవనం గడిపేలా చేస్తుంది.

**Dr. K Ravikirane**

M.D.,M.sc(psych), P.G(virology)LONDON

గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్

మాస్టర్స్ హోమియోపతి

అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి

ఫోన్ : 7842 106 106, 9032 106 106

V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి

సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి

10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## మళ్లీ మామూలు మనిషినయ్యాను

కొంతమంది సమస్య వల్ల ఎటువంటి బాధ కలగడం లేదు కదా అని చికిత్స వెళ్లకుండా ఉంటారు. మరికొంతమందికి దానికి చికిత్స ఉన్న విషయం కూడా తెలియదు. చాలా మందిలో సాధారణంగా కనిపించే ఆ సమస్య పేరు వెరికోస్ వెయిన్స్. కాలి పిక్కల భాగంలో మెలిపడిపోయిన నరాలు అని చెబితే ఎవరైనా ఇట్టే గుర్తుపట్టే ఈ సమస్యకు హోమియోలో మంచి మందులు ఉన్నాయి.

ఈ సమస్య యుక్తవయసు వారిలో కనిపించదు. వయసు పైబడిన వారిలోనే కనిపిస్తుంది. స్త్రీలలో, స్థూలకాయుల్లో, వ్యాయామం చేయని వారిలో ఎక్కువగా కనిపిస్తుంది. ఎక్కువ సేపు నిలబడటం వల్ల కాలి పిక్కల దగ్గర ఉన్న కండరాలు పనిచేయడం మానేస్తాయి. పంపింగ్ మెకానిజం తగ్గి రక్తాన్ని పైకి పంపించలేకపోతుంది. ఫలితంగా వెరికోస్ వెయిన్స్ సమస్య వస్తుంది. సిరలు ముదురు నీలం రంగులో, చర్మం కింద ఉబ్బిపోయి, మెలిపడి కనిపిస్తుంటాయి. కాలి పిక్కల దగ్గర నొప్పి ఉంటుంది. నడుస్తున్నప్పుడు నొప్పి తీవ్రత చాలా ఎక్కువగా ఉంటుంది. పడుకున్నప్పుడు కాలి పిక్కలు పట్టేయడం జరుగుతుంది. ఎక్కువసేపు కూర్చున్నప్పుడు లేదా నిలుచున్నప్పుడు లక్షణాలు తీవ్రంగా ఉంటాయి. వెరికోస్ వెయిన్స్ ఉన్న ప్రాంతంలో దురద, చర్మం రంగు మారుతుంది. వాపు, సమస్య తీవ్రంగా ఉన్నప్పుడు కాలు వాయడం వంటి లక్షణాలు కూడా కనిపిస్తాయి.

**హోమియో చికిత్స :** చాలా మంది ఈ సమస్యకు చికిత్స లేదని వైద్యుల దగ్గరకు వెళ్లకుండా ఉండిపోతారు. కానీ హోమియో వైద్యంతో ఈ సమస్య సమూలంగా తొలగిపోతుంది. హోమియో వైద్యంలో మూలకారణాన్ని తొలగించే విధంగా చికిత్స ఉంటుంది. కాబట్టి వ్యాధి నుంచి పూర్తిగా విముక్తి లభిస్తుంది.

## హెపటైటిస్ బాధ పూర్తిగా తగ్గింది

**నా పేరు భాను.** నా వయస్సు 35 సంవత్సరాలు. ప్రభుత్వ ఉద్యోగం. మంచి జీతం, లైఫ్ హ్యాపీగా ఉంది అనుకుంటున్న సమయంలో అకస్మాత్తుగా ఒక సమస్య మొదలయ్యింది. మరికొన్ని రోజులు అలస్యమైతే ప్రాణాలు కూడా పోయేవి. ఇంతకీ నా అనారోగ్య లక్షణాలు ఎలా మొదలయ్యాయంటే... ప్రారంభంలో నీరసంగా ఉండటం, ఆకలి లేకపోవడం, ఆకలిగా అనిపించినా తినాలని అనిపించకపోయేది. తింటే వాంతులు అయ్యేవి. కొన్ని రోజులకు కడుపు నొప్పి కూడా మొదలయింది. డాక్టర్‌కు చూపిస్తే పరీక్షలన్నీ చేసి హెపటైటిస్ వైరస్ సోకిందని చెప్పారు. ఫ్యాటీలివర్ సమస్య కూడా ఉందన్నారు. దాంతో నాకు ఒక్కసారిగా పాతాళంలో కూరుకుపోయినట్టిగా అనిపించింది. కాలేయ వ్యాధులతో చనిపోతున్న వారి వార్తలు రోజు వింటూనే ఉన్నాను. ఆ సమయంలోనే తెలిసిన మిత్రుడు ఒకడు హోమియో చికిత్స గురించి చెప్పాడు. దాంతో ఆగమేఘాల పరిగెత్తుకుంటూ డాక్టర్ రవికిరణ్ గారి దగ్గరకు వెళ్లాను.

**చికిత్స తరువాత**

హోమియో మందులతో త్వరగా కోలుకుంటావని, ఏమాత్రం భయపడాల్సిన అవసరం లేదని డాక్టర్ గారు ధైర్యం చెప్పారు. హోమియో చికిత్స మొదలు పెట్టాక వారం రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. వికారం తగ్గింది. ఆకలి పెరిగింది. నెల రోజుల తరువాత చాలా మార్పు కనిపించింది. వైరల్ లోడ్ పరీక్ష చేయిస్తే అతి తక్కువ స్థాయిలో ఉన్నట్లుగా తేలింది. ఫ్యాటీలివర్ పూర్తిగా తగ్గిపోయింది. జీవితం ముగిసిందన్న దశలో హోమియో చికిత్స ప్రాణాలు నిలిపింది. ప్రస్తుతం యధావిధిగా జాబ్‌కు వెళుతున్నాను. నాకు కొత్త జీవితం ప్రసాదించినందుకు డాక్టర్‌గారికి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు.




# కాలనేమిసంహారం:విష్ణుదేవునియోగనిద్ర

**దేవదానవయుద్ధంలో ఉభయసేనలూ తీవ్రంగా నష్టపోయాయి. అనేకమంది మరణించారు. యుద్ధభూమిలో నెత్తురు ఏరులుగా ప్రవహించింది. ఆ ప్రవాహాల్లోంచి పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ నడచి వచ్చి విజృంభించాడు కాలనేమి. పర్వతంలా శరీరాన్ని పెంచాడతను. నూరు చేతులూ ఒక్కసారిగా పైకెత్తాడు. భయంకరమైన కోరలు కనబరుస్తూ, గట్టిగా అరుస్తూ వీరవిహారం చేశాడు. అతని పాదాలు, మోకాళ్ళు, ఊరువులు, పిడికిళ్ళు మొదలైన అవయవాల కఠిన ఘాతాలకు కొందరు దేవతలు తుళ్ళిపోయారు. అతని బాణప్రయోగాలకి మరికొందరు దేవతలు అంగాంగాలు పోగొట్టుకుని కూలిపోయారు. ఇంకొందరు ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని పారిపోయారు.**

ఇంద్రునివైపు చూశాడు కాలనేమి. ఐరావతం మీద కూర్చుని కకావికలవుతున్నాడు ఇంద్రుడు. అతన్ని సమీపించాడు.

ఇంద్రా! నా చేతిలోని ఈ గద చూశావు కదా, దీన్ని ప్రయోగిస్తే నీ శిరస్సు క్షణంలో రెండు ముక్కలవుతుంది. అమరాధిపతి ఆచూకీ దొరకదెవరికీ. ముల్లోకాలూ నా అధీనమవుతాయి. కాచుకో అన్నాడు.

ఎదుర్కొనక తప్పని స్థితి. శక్తినంతా కూడదీసుకున్నాడు ఇంద్రుడు. వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. అది కాలనేమి గుండెల్ని చీల్చలేదు సరికదా, ఆ రాక్షసుణ్ణి పువ్వులా మెత్తగా తాకి, వెంటనే వెనుతిరిగి వచ్చింది. ఇంద్రుని చేతిలో దాగింది. వజ్రాయుధమే వెనుతిరిగితే ఇక ఇంద్రుడు ఎంత? అతని ఐరావతం ఎంత? రెచ్చిపోయాడు కాలనేమి. గదతో ఐరావతం కుంభస్థలాన్ని మొత్తాడు. అదే రీతిలో ఇంద్రుని గుండెలపై కూడా మోదాడు. ఐరావతం స్పృహతప్పి కిందపడింది. ఇంద్రునికీ స్పృహ తప్పింది. అయితే కాసేపటికి తేరుకున్నాడతను. తేరుకుని యుద్ధరంగం నుండి పారిపోయాడు. అప్పుడు ఐరావతం తేరుకుంది. తేరుకున్నదన్న మాటేగాని, శక్తిలేనిదానిలా ఊగిపోసాగింది. యుద్ధరంగం నుండి ఇంద్రుడు పారిపోయాడు. ఇప్పుడిక ఎవరు? అన్నట్టుగా వెదికాడు కాలనేమి. వరుణదేవుడు కనిపించాడు. అతన్ని ఎదుర్కొన్నాడు. పన్నగపాశాన్ని రెండు ముక్కలు చేశాడు. తర్వాత వరుణదేవుడు యుద్ధభూమిని వదిలిపోయేంత వరకు శరపరంపరను ప్రయోగించాడు. ఎప్పుడైతే వెన్నిచ్చి వరుణదేవుడు పారిపోయాడో అప్పుడు విజయశంఖం పూరించి ఆనందించాడు కాలనేమి. పూరించిన శంఖాన్ని పెదవుల మీది నుంచి తొలగించి, అటుగా చూశాడు. కుబేరుడు కనిపించాడతనికి. అంతే! కుబేరుని మీద పరిఘాయుధాలను ప్రయోగించి, విపరీతంగా బాధించాడతన్ని. ఆ ఘాతాలకు కుబేరుడు మూర్ఛపోయాడు. అదే అవకాశంగా అతని నిధులను కైవసం చేసుకున్నాడు కాలనేమి. అడ్డు వచ్చిన కిన్నరులను నిర్దయగా నిర్మూలించాడు. ఇటు చూశాడు. యముడు కనిపించాడు. కనిపించడమే ఆలస్యం అతనిపైకి ఉరికాడు కాలనేమి. కాలెత్తి అతని గుండెలపై తన్నాడు. దెబ్బకి వెల్లకిలా పడ్డాడు యముడు. పడిన యముని మెడపై కాలుంచి నొక్కిపెట్టాడు కాలనేమి. అతని కోరలు ఖండించాడు. అడ్డుకున్న కిన్నరులను తరిమి తరిమికొట్టాడు. మీదికి ఉరికిన యముని మహిషాన్ని చేతులతో ఎత్తిపట్టి గిరగిరా తిప్పి విసిరేశాడు. అయోమయంగా చూస్తున్న యమునితో అన్నాడిలా.

పిరికిప్రాణులమీదే నీ ప్రతాపం. నా మీద కాదు. జాగ్రత్త!

చూపుడు వేలెత్తి హెచ్చరించి, అపహసించాడు.

లోకపాలకులంతా అలా అతలాకుతలమవడంతో మిగిలిన వారు యుద్ధభూమిలో నిలువలేక పరుగందుకున్నారు. కాలనేమి కంటిచూపుకి అందనంత దూరంగా పారిపోయారు.

**ఇంద్రాదిదేవతలను ఓడించి స్వర్గాధిపత్యం సాధించిన కాలనేమి అనంతరం విష్ణుమూర్తిపై దండెత్తాడు. చెదరని చిరునవ్వుతో తన దేహాన్ని మహోన్నతం చేశాడు విష్ణువు. భూమ్యాకాశాలు నిండిపోయాడు. అతని బాహువులు దిశలన్నిటా వ్యాపించాయి. శిరస్సు పైపైకి పెరిగినంతనే ఆకాశం తునాతునకలైంది. పాదయుగళి సమస్త భూమండలాన్ని ఆక్రమించుకుంది. ఆ త్రివిక్రమ రూపం చూసి రాక్షసులు భయభ్రాంతులయ్యారు.**

నవ్వుతూ తన సేనాపతుల్ని చూశాడు కాలనేమి. అన్నాడిలా.

ఇక ఆలస్యం దేనికి? అందుకోండి లోకపాలకుల స్థానాల్ని. అధిరోహించండి సింహాసనాల్ని.

రాజాజ్ఞ పాటిస్తున్నట్టుగా విజయహాసం చేశారు సేనాపతులు.

స్వర్గానికి చేరుకున్నాడు కాలనేమి. ద్వారపాలకుడు సూర్యుణ్ణి చూశాడక్కడ. వెళ్ళిక్కణ్ణుంచి అని కసిరాడు. ఆ కసురుకి అక్కణ్ణుంచి తొలగిపోయాడు సూర్యుడు. చుక్కలసీమలో దాగున్న చంద్రుణ్ణి చూశాడు కాలనేమి. అక్కణ్ణుంచి కిందికి లాగి, విసిరేశాడతన్ని. అగ్నిదేవుణ్ణి కూడా అవమానించి పంపించాడు. అక్కడి అధికారాలతో పాటు పదవులు ఆక్రమించుకున్నాడు. ఊర్ధ్వలోకాలను కూడా స్వాధీనం చేసుకున్నాడు కాలనేమి. విశ్వాన్ని చేజిక్కించుకున్నాడు. అప్సరసలు, గంధర్వాదుల్ని పరిచారకుల్ని చేసుకున్నాడు.

దేవతలంతా పదవీభ్రష్టులై పేదవారిలా సంచరించసాగారు. కొనప్రాణాలతో జీవించసాగారు.

దేవతలు ఎంతగా విలపించినా వేడుకున్నా విష్ణుమూర్తి తటస్థుడై నిరీక్షించాడు. కాలం నిండాలి. కలిసి రావాలి. అప్పటికి కాని కాలనేమిని ఎవరూ ఏమీ చేయలేరన్నాడు.

సర్వలోకాధిపత్యం సాధించినా ఎక్కడో ఏదో లోపం ఉన్నదని గ్రహించాడు కాలనేమి. క్షమ, ధర్మం, శ్రుతం, సత్యం, లక్ష్మి తన సమీపానికి రాలేదని తెలుసుకున్నాడు. అవి విష్ణుమూర్తినే అంటిపెట్టుకుని ఉన్నాయి. అందుకు ఆగ్రహించాడు కాలనేమి. వెంటనే రాక్షససేనలతో విష్ణుమూర్తి మీదకి దండెత్తి వచ్చాడు. కర్ణకఠోరంగా అతన్ని తూలనాడాడు. తర్వాత అనుకున్నాడిలా.

నేటికి కదా! ఈ దానవాంతకుని అంతం చూసే అదృష్టం కలిగింది. ఇతడే కదా మహాబ్ధిమధ్యంలో మధుకైటభుల్ని సంహరించాడు. హిరణ్యకశిపుణ్ణి కూడా ఇతడే కదా వధించింది. వామనరూపంలో లోకాలన్నీ ఆక్రమించుకున్నదితడే! అమరులకు అభయాన్నిస్తూ, తిరిగి తిరిగి జన్మిస్తూ రాక్షసుల అంతం చూస్తున్నాడు. రాక్షసుల ప్రత్యక్షమృత్యువు ఇతడు. మహామాయావి. ఈతని సంహారమే నా ప్రథమ కర్తవ్యం.

కాలనేమి ఆంతర్యాన్ని గ్రహించాడు విష్ణువు. సన్నగా నవ్వాడు. హెచ్చరించాడిలా.

ఓరీ! దైత్యాధమా! అనుకున్నంత మాత్రాన అవలీలగా విజయం దక్కదు. బ్రహ్మవరప్రసాదివై సాధు జనులను హింసించడం అలవాటుగా చేసుకున్నావు. అందుకు నిన్ను వధించక తప్పదు. నిన్ను వధించి, దేవతలందరినీ వారి వారి స్థానాల్లో ప్రతిష్ఠిస్తాను. వీరుడివైతే రా! నన్ను ఎదిరించు.

విష్ణువు ఆహ్వానం అందుకున్నాడు కాలనేమి. నూరు చేతుల్లో గల దారుణాయుధాలను ఒక్క



సారిగా ప్రయోగించాడు. అతన్ని అనుసరించారు మయుడు, తారుడు, విప్రచిత్తి మొదలైనవారు. అంతా తమ తమ భయంకర ఆయుధాలను విష్ణువు మీద ప్రయోగించి, ఘోరసంగ్రామం ప్రారంభించారు. ఎవరెన్ని ఆయుధాలు ప్రయోగించినా చెదరని చిరునవ్వే విష్ణుమూర్తి ఆయుధమైంది. దానిని తట్టుకోలేకపోయాడు కాలనేమి. వికటాట్టహాసం చేస్తూ గదనొకదాన్ని గరుత్మంతునిపై ప్రయోగించాడు. గదాఘాతానికి గరుత్మంతుడు విలవిల్లాడాడు. గమనించాడది విష్ణువు. ప్రేమగా గరుత్మంతుణ్ణి నిమిరాడు. నిమురుతూ పూర్వం కన్నా అత్యధిక జవసత్వాలు అతనికి అనుగ్రహించాడు. ఇక ఉపేక్షించి లాభం లేదనుకున్నాడు. కాలనేమిని తీక్షణంగా చూసి, గరుత్మంతుని సహా తన దేహాన్ని మహోన్నతం చేశాడు విష్ణువు. భూమ్యాకాశాలు నిండిపోయాడు. అతని బాహువులు దిశలన్నిటా వ్యాపించాయి. శిరస్సు పైపైకి పెరిగినంతనే ఆకాశం తునాతునకలైంది. పాదయుగళి సమస్త భూమండలాన్ని ఆక్రమించుకుంది. విష్ణువు విశ్వరూపం చూసి రాక్షసులు భయభ్రాంతులయ్యారు. త్రివిక్రమస్వరూపుడై నిలిచిన విష్ణువుని చూసి వేలుపులూ, తాపసులూ వేడుకున్నారిలా.

పరమేశ్వరా! రాక్షసుల్ని సంహరించి, లోకాలకు అభయం ప్రసాదించు!

అనంతంగా పెరిగిన విష్ణుదేవుడు తేజోమహిమతో ప్రత్యర్థి ప్రభావాన్ని రూపుమాపాడు. తర్వాత వేయి వాడి అంచులుగల చక్రాయుధాన్ని కాలనేమిపై ప్రయోగించాడు. ప్రళయకాలసూర్యునిలా ఆ ఆయుధం పైకెగసి, ముందు కాలనేమి బాహువుల్ని ఖండించింది. తర్వాత అతని శిరస్సును నేలపాలు చేసింది. చేతులు లేవు. శిరస్సు లేదు. అయినా కాలనేమి మొండెం నిలబడే ఉందింకా. అది చూసి ఆశ్చర్యపోయారంతా. అప్పుడు గరుత్మంతుడు ప్రళయవేగంతో మొండెం మీద ఉరికినంతనే అది మహావృక్షంలా విరిగిపడింది. ఎప్పుడైతే కాలనేమి సంహారం జరిగిపోయిందో అప్పుడు అతని అనుచరులు అక్కడ ఉండడం క్షేమం కాదనుకుని పరుగులంకించుకున్నారు. యుద్ధభూమి నుండి పారిపోతున్నా వారిని వదలలేదు విష్ణువు. గదా ఖడ్గప్రయోగాలతో వారందరినీ సంహరించి, దేవతల జయజయధ్వానాలు అందుకున్నాడు.

అలా తారకామయమన్న ఆ ఘోరాపద తొలగిపోవడంతో వేలుపులంతా ఆనందించారు. అఖండవిజయంతో విలసిల్లుతున్న విష్ణుమూర్తిని అభినందించేందుకు అప్పుడక్కడకి వచ్చాడు బ్రహ్మ. విష్ణువుని అనేక విధాల ప్రశంసించాడతను.

కాలనేమిని నువ్వు తప్ప వేరొకరు సంహరించలేరు. ఆ రాక్షసుణ్ణి సంహరించి, దేవేంద్రుని ఆపద్భీతి తొలగించావు. చాలా ఆనందంగా ఉంది నాకు. ఈ ఆనందంలో నీకు అనేక వరాలు ఇవ్వాలని ఆశగా ఉంది. అయితే ముల్లోకాలకూ శుభాలనుగ్రహించే నీకు కోరికలేమి ఉంటాయి? ఉండవని బాధగా ఉంది. నా లోకంలోని మునీశ్వరులంతా నిన్ను సందర్శించేందుకు కుతూహలపడుతున్నారు. కరుణించి నా లోకానికి దయచేయాల్సిందిగా అర్థిస్తున్నాను.

తప్పకుండా అన్నాడు విష్ణువు. వినయంగా నిల్చున్న దేవతలను చూశాడు. చెప్పాడిలా.

దేవతలారా! మీ శత్రువులైన రాక్షసులందరూ ఈ యుద్ధంలో మరణించారు. ఇక మీమీ అధికార స్థానాలను మీరు కైవసం చేసుకుని, యథావిధిగా ధర్మనిర్వహణకు ఉపక్రమించండి. భూలోకంలో యజ్ఞయాగాదులు ఎప్పటిలాగానే సాగుతాయి. ఆందోళన చెందకండి.

ధన్యులం అన్నారు దేవతలు. ఆనందించారు.

అలాగే శత్రువులు నశించారని ఏమరుపాటున ఉండకండి! వారిని ఓ కంట కనిపెట్టి ఉండండి! అన్నాడు విష్ణువు. వీడ్కోలు తీసుకున్నాడు అక్కణ్ణుంచి.

ప్రయాణించి బ్రహ్మలోకానికి చేరుకున్నాడు. అక్కడ ఆ లోకంలో యజ్ఞాలెంతో శ్రద్ధతో నిర్వహిస్తున్న తపోధనులను చూశాడు. తనకు ప్రత్యేకించిన యాగభాగాలను చూసి అభినందించాడు విష్ణువు. త్రేతాగ్నులకు ప్రదక్షిణ నమస్కారాలు అర్పించాడు. పైడి యూపస్తంభాలను, యజ్ఞసంభారాలను పరిశీలిస్తూ, వేదనాదాలు వింటూ సంతోషించాడు. యథేచ్ఛగా విహరించాడు. అప్పుడక్కడకి దేవతలు వచ్చారు. విష్ణువుకి అర్ఘ్యపాద్యాలు అందించారు. శ్లాఘించారిలా.

లోకసంరక్షకా! యజ్ఞ యాగాదులన్నిటా ప్రథమ పూజ నీకే! నీవు పుణ్యపురుషుడవు. వేదాలలో పేర్కొన్న సమస్త విధులు నీవే! నువ్వు దుష్టశిక్షణ చేసేటప్పుడు మేము సర్వదా నిన్నే స్మరిస్తాం. నీ అఖండవిజయం వల్ల మేమంతా ఈనాడు ధన్యులమయ్యాం. కరుణించి మమ్ము అనుగ్రహించు. మా పూజలందుకో!

అనుగ్రహించాడు విష్ణువు. దేవతల పూజలు అందుకున్నాడు. బ్రహ్మకు నమస్కరించి అక్కణ్ణుంచి బయల్దేరాడు. క్షీరసాగరంలోకి ప్రవేశించాడు. వైకుంఠధామం చేరుకున్నాడు. మహనీయ తేజస్సులు సూర్యచంద్రులు కూడా ఆ లోకంలోకి ప్రవేశించలేరు. అలాగే బ్రహ్మాదిదేవతలు కూడా ప్రవేశించలేరక్కడికి. అలాంటి పరమపదంలోకి ప్రవేశించిన విష్ణువు, వేయిశిరస్సులతో, వేలకొలది బాహువులతో దివ్యస్వరూపం ధరించాడు. గ్రీష్మ ఋతువు తుదికాలంలో శేషతల్పంపై శయనించాడు. కొన్నివేల దివ్యసంవత్సరాలనుండి అలసిపోయి ఉన్నాడేమో! ఆ అలసట తొలగించుకునే సంకల్పంతో కళ్ళు అరమోడ్పుగా మూసుకున్నాడు. విశ్వమోహన యోగనిద్ర అప్పుడతని ఆత్మలో ప్రవేశించింది. అలా యోగానిద్రా ముద్రితుడైన శ్రీమన్నారాయణుణ్ణి తిలకించి, కొందరు అతన్ని నిత్యసుప్తుడు అన్నారు. ఇంకొందరు నిద్ర స్పృశించని మహనీయమూర్తి అన్నారు. మరికొందరు అతను నిత్యజాగరూకుడు అన్నారు. ఏది ఏమైనా విష్ణువు రాక్షసుల గుండెల్లో నిద్రించాడన్నది నిజం.

విష్ణువు యోగనిద్రలో ఉన్న సమయంలోనే వర్షాధిదేవత లోకం సమస్తాన్నీ ముంచెత్తుతాడు. ముంపు ఆగిందంటే విష్ణువు ఆత్మాంతరాళం నుండి నిద్ర తొలగిపోయినట్టే! అనేక కల్పాలు ఆ విధంగా సాగిన సందర్భాలలోనే విష్ణువు వేర్వేరు అవతారాల్లో అవతరించి, గర్వోన్మత్తులను నాశనం చేస్తున్నాడు. సాధుజనులను సంరక్షిస్తున్నాడు. మంగళపరంపర అనుగ్రహిస్తున్నాడు. ఇది ఆ దేవుని నిత్యలీల.

**(చతుర్థఖండం సమాప్తం)**

**—అరణి**




**"ఒక ఐడియా జీవితాన్నే మార్చేస్తుంది" అన్నది కొంచెం స్టయిలిష్‌గా చెప్పేమాట. "ఒక ఐడియా ఏకంగా కొంపలు ముంచుతుంది" అన్నది ముఖం మీద గుద్దినట్టు చెప్పేమాట.**

**మొదటిది పాజిటివ్ భావన. రెండోది పక్కా నెగెటివ్ ఎఫెక్టు. రెండూ అనుభవపూర్వకంగా తెలిసేవే.**

# అసలైన కుర్రాడు వాడే

ఈ రెండు రకాల ఐడియాల ప్రభావాన్ని వివిధ దశల్లో వ్యక్తిగతంగా చవిచూసిన వాళ్ళకే ఒకరకమైన స్థితప్రజ్ఞత క్రమంగా అలవడుతుంది. ఈ రెండు భావనల ప్రభావాన్ని చవిచూసే దశ టీనేజ్. ఒకవైపు ఎన్నో విలాసవంతమైన ఆకర్షణలు మనసును లాగుతుంటే, మరోవైపు భవిష్యత్తు లక్ష్య సాధనకు అనువైన పరిస్థితులూ కనబడుతుంటాయి. ఇందులో మనం ఏదారిని తీసుకుని ఏ ఐడియాని మనలో జెనరేట్ చేసుకుంటాం అన్నదే ముఖ్యం.

ఈ క్రమంలో టీనేజర్లపై స్నేహం, మీడియా, చుట్టూ ఉండే వ్యక్తులు, పరిసరాలు ఇవన్నీ ప్రభావం చూపిస్తాయి. ముఖ్యంగా ఇంతకుముందు చెప్పుకున్నట్లు స్నేహితుల ప్రభావం టీనేజర్లపై ఎక్కువగా ఉంటుందని పరిశోధకులు కూడా చెప్తున్నారు.

### ఎలాంటి స్నేహం కావాలి?

ఒక వ్యక్తి తన స్నేహితునితో పాటు గుడికి వెళ్ళాడు. వెళ్ళేముందు తన స్నేహితునితో ఇలా అన్నాడు. "ఈ గుడిలో పూజారి బాగా డబ్బులు సంపాదించాడు. దేవుడి కానుకల సొమ్ము మొత్తం తనే దోచుకుంటున్నాడు... అలాంటి వాడి ఇంటికి నేను దొంగతనానికి వెళుతున్నాను..నువ్వు ఎలాగైనా ఆ పూజారిని ఓ గంట సేపు మాటల్లో దించు, దయచేసి నీకు కూడా ఆ సొమ్ములో వాటా ఇస్తాను" అన్నాడు. స్నేహితుడు సరే అని ఒప్పుకున్నాడు.

గుడిలోకి వెళ్ళాడు. పూజారి పూజ ముగించాడు. తరువాత ఆ స్నేహితుడు పూజారిని మాటల్లోకి దింపాడు. మాటల మధ్యలో ఆ స్నేహితునికి ఆ పూజారి చాలా మంచి మనిషిలా కనపడ్డాడు. పాపం ఈ మంచి మనిషినా నేను మోసం చేస్తున్నాను అనిపించింది. పూజారికి అసలు విషయం చెప్పి ఇంటికి వెళ్ళండి స్వామీ! నన్ను మన్నించండి అని అడిగాడు. దానికి ఆ పూజారి బిగ్గరగా నవ్వుతూ, ఇలా అన్నాడు.

"నాకు తలదాచుకోవడానికి చిన్న గుడిసెకూడా లేదు. అంతెందుకు ఒకపూట భోజనానికి కూడా నాకు కష్టమే! నీ స్నేహితుడు నా ఇంటికి దొంగతనానికి రావడానికి అలా చెప్పలేదు. వాడు నీ ఇంటికే ఖచ్చితంగా దొంగతనానికి పోయి ఉంటాడు. నువ్వే ఇంటికి వెళ్ళి చూసుకో నాయనా!" అన్నాడు.

దిమ్మతిరిగిపోయింది ఆ స్నేహితునికి.

కాబట్టి మంచి స్నేహానికి స్వాగతం పలకండి. వారిని ఎన్నటికీ, ఎప్పటికీ మరువకండి. చెడు స్నేహాన్ని మీ దరిదాపులకు కూడా రానివ్వకండి. ఎందుకంటే చెడు స్నేహం మాయలో పడితే మీ భవిష్యత్తు పాతాళంలోకి పోవడం గ్యారెంటీ. కేవలం స్నేహం మాత్రమే కాదు, మీ బంగారు భవిష్యత్తును మీనుంచి దూరం చేయడానికి ఎన్నో రకాల ఆకర్షణలు మీకు నిత్యం కనిపిస్తూనే ఉంటాయి. వాటన్నింటి నుంచి దూరంగా ఉండడానికి ప్రయత్నం చేయాల్సిన బాధ్యత టీనేజర్‌గా మీపైన ఉంది.



### దృక్పథాలలో మార్పులు

పిల్లల అవసరాలు, అభిప్రాయాలు, ఆసక్తులు త్వరత్వరగా మారిపోతుండే కాలం ఇది. బాహ్య ప్రపంచంలో వాళ్ళ చుట్టూ వేగంగా జరిగిపోయే క్రియాత్మకమైన మార్పులే కాక అంతర్గతంగా వాళ్ళ శరీరాలలో జరిగే మార్పులు కూడా అంతుపట్టక ఎప్పటికప్పుడు కన్ఫ్యూజ్ అయిపోతుంటారు. ఉదాహరణకు...

ఇంతకు ముందు బజారుకు వెళ్ళి ఏదైనా తీసుకు రమ్మనగానే బుద్ధిమంతుడిలా తీసుకొచ్చే కుర్రాడు సడెన్‌గా ఎప్పుడూ నేనే తేవాలా అని ఎదురు చెప్తుంటాడు. నిన్న మొన్నటిదాకా తనతో ఆడుకున్న నేస్తం, ఆ అమ్మాయి అకస్మాత్తుగా ఇప్పుడు వయ్యారాలు పోతూ ఉన్నట్లు అనిపిస్తుంది. అలాగే ఆడపిల్లలకు కూడా, మొన్నటిదాకా తనతో స్వేచ్ఛగా ఆడిన కుర్రవాడు తనవేపు కొత్తగా దొంగ చూపులు ఎందుకు చూస్తున్నాడో అర్థం కాదు.

అసలు వాళ్ళకు ఆ క్షణాన లోకమే ఏదో కొత్తగా రవరవలాడుతున్నట్లూ, ఉత్తేజపూరితంగానూ ఒకో సందర్భాన భయం గొలుపుతున్నట్లుగానూ కనిపిస్తుంది. నిజానికి అసలిదంతా బాహ్య మార్పుకాదనీ, తమలో జరుగుతున్న అంతర మార్పుల ప్రభావమేననీ వాళ్ళకు తెలియదు. అలా తెలియజెప్పే వాళ్ళుగానీ, అర్థం చేసుకునే వాళ్ళుగానీ ఎవరూ కనిపించరు. తల్లిదండ్రులు తమ నుంచి కోరుకునే కోరికలు వాళ్ళకిప్పుడు అర్థంపర్థం లేనివిగా, ప్రాముఖ్యం లేనివిగా అనిపించి చిరాకు కలిగిస్తాయి.

ఇక భవిష్యత్తు గురించి చూసినప్పుడు నిజం చెప్పాలంటే పెద్దవాళ్ళకంటే వాళ్ళకే ఇప్పటి భవిష్యత్తుపట్ల అధిక ధ్యాస ఉంటుంది. అయితే తేడా దృక్పథాలలోనే. పెద్దవాళ్ళ దృష్టిలో భవిష్యత్తు అంటే మరికొన్ని ఏళ్ళు గడిచి చదువైపోయిన తర్వాత జీవితం కానీ టీనేజర్ దృష్టిలో భవిష్యత్తు అంటే వచ్చేవారం, మర్నాడు, మరో పది నిముషాల తర్వాతి జీవితం.

అంతేకాక ఇప్పుడు వాళ్ళకు పెద్దవాళ్ళు చెప్పినట్లు వినడం చిన్న పిల్లల లక్షణంగా కనిపిస్తుంది. తనిప్పుడు పెద్దవాడు అయిపోతున్నాడు, పెద్దవాళ్ళకేం అలాగే చెబుతారు, తనింకా చిన్నపిల్లవాడు అనుకుంటున్నారు నేను ఎదిగిపోయాను కదా, ఇంకా ఇంట్లో వాళ్ళు చెప్పిన పనులన్నీ చేస్తుంటే తననింకా చిన్నపిల్లవాడనే అనుకుంటారు. తనుషేమ్ అవొచ్చు, అందుకే ఏవీ వినకూడదు ఇలా ఉంటాయి ఆలోచనలు, ఆడపిల్ల ఆలోచనలు కూడా ఇంచుమించు ఇలానే ఉంటాయి.

ముఖ్యంగా బాల్యం నుంచి ఏ బాధ్యతలూ

## పేరెంట్స్ గైడ్‌లైన్స్

ఒకో సమయాన తల్లితండ్రుల ప్రవర్తన మూలంగా పిల్లలు పైన చెప్పినట్లు చెడిపోయే అవకాశం కూడా ఉంది. ఎలాగంటే పెద్దవాళ్ళు అతి గారాబం, అతిగా ఆంక్షలు పెట్టడం పిల్లల్ని స్వతంత్రంగా ఎదగనివ్వకపోవడం. వీటి ప్రభావం పిల్లల పైన రెండు రకాలుగా ఉంటుంది.

1. తల్లిదండ్రులు చెప్పినట్లల్లా వింటూ మనోభివృద్ధిలేక పనికిమాలినవాళ్ళుగా తయారవ్వడం

2. లేదా తన స్వతంత్రానికి అడ్డుకట్టవేస్తున్నారని అరాచకంగా తయారవ్వడం

ఈ రెండూ వాళ్ళ భవిష్యత్తుకు అడ్డుకట్ట వేసేవే. అందుకే టీనేజ్ పిల్లల విషయంలో తల్లిదండ్రులు చేయాల్సిన అతిముఖ్యమైన పనేంటంటే వారిని ఓ కంట గమనిస్తూనే వాళ్ళ ప్రవర్తనకు వారే బాధ్యులన్నట్లుగా, తద్వారా జరిగే పరిణామాలను తమకుతాము తెలుసుకునేట్టు ఎదగనివ్వడం.



లేకుండా బలాదూరుగా లేక గారాబంగా పెరిగిన టీనేజర్ మీద అకస్మాత్తుగా బాధ్యతాయుతంగా మెలగాలనే భారం లేదా ఆంక్షల్ని రుద్దితే తట్టుకోలేక కన్‌ఫ్యూజన్‌లో పడిపోతాడు. ఇక్కడ తల్లిదండ్రులు గుర్తుంచుకోవాల్సిన అతి ముఖ్యమైన విషయం ఏమిటంటే,

టీనేజ్ పిల్లలు ఎంతో కొంత బాధ్యతా రహితంగా ప్రవర్తించడమే ఆరోగ్యకరమైన లక్షణం! తల్లిదండ్రులు చెప్పినట్లుగా వింటూ మంచి కుర్రవాడు అనిపించుకుంటుంటే అతడు కేవలం వాళ్ళకు ప్రతిబింబంలా తయారవుతాడే తప్ప స్వంత వ్యక్తిత్వం ఏర్పరుచుకోలేడు. బాల్యంలో ఇలా మంచి కుర్రాడు అనిపించుకున్నవాళ్ళు కూడా టీనేజ్‌లోకి వచ్చేసరికి రివోల్ట్ కాక తప్పదని అనేక పరిశోధనలు చెబుతున్నాయి. టీనేజ్‌లో చెప్పినట్లు వినకపోవడమూ బాధ్యతారాహిత్యంగా ప్రవర్తించడమనేదే అసలు సిసలైన ఎదుగుదలకు సూచన. ఆరోగ్యకర లక్షణం. ఇంకా విశాలంగా చెప్పాలంటే టీనేజ్ పిల్లలు ఒక పరిధికి లోబడి తల్లిదండ్రులను లెక్క చేయకుండా అరాచకంగా ప్రవర్తించడంలోనే ఆరోగ్యకర లక్షణం ఇమిడి ఉంది. అయితే ఇక్కడ ఒక విషయం గుర్తుంచుకోవాలి. ఈ అరాచక లక్షణం ఒక పరిధికి లోబడే ఉంటుందన్నది గుర్తుంచుకోవాలి.

కుర్రవాడు కాలేజీకి వెళ్ళట్లేదు, మార్కులు తక్కువగా వస్తున్నాయి, చెడు అలవాట్ల బారిన పడుతున్నాడు, అమ్మాయి బాయ్‌ఫ్రెండ్‌తో తిరుగుతోంది, కాలుజారుతుందేమో అన్న సందేహం కలుగుతోంది... ఇలాంటివి వారి భవిష్యత్ జీవితాన్ని ఒడిదుడుకులలో పడవేసే ప్రమాదకర ప్రవర్తనలు కనిపిస్తున్నప్పుడు, పిల్లలు ఆ పరిధి దాటుతున్నారనిపించినప్పుడు తల్లిదండ్రులు తగు జాగ్రత్తలు తీసుకోవడం, మార్గదర్శకత్వం చేయడం అవసరమే. అది వాళ్ళ కర్తవ్యం కూడా. కానీ ఆ కల్పించుకోవడం చకాలు ఉంటాయని మనం ముందే ఊహించి, అంగీకరించి అందుకు సిద్ధంగా ఉండాలి. టీనేజర్ మరీ బాధ్యతాపూరితంగా ప్రవర్తిస్తే అతను టీనేజర్ కాడు కదా! అంటే దీనర్థం పిల్లలు ఇలాంటి పనులు చేస్తుంటే మీరేమీ అసలు పట్టించుకోవద్దని కాదు.

తల్లిదండ్రులు పట్టించుకోవాలి. పట్టించుకోవడం వారి ధర్మం. అయితే నిదానంగా తగు మాత్రంగా జరగాలది. ఆ అవకతవకల గురించి సమయం సందర్భం చూసి వాళ్ళకు గుర్తుచేసి హెచ్చరించి దారిలో పెట్టాలి.

## టీనేజర్ల పై పెద్దల ఒత్తిడి

టీనేజర్లతో వారి తల్లిదండ్రులు ఎలా ఉంటున్నారన్నదానిపై వారి వ్యక్తిత్వ నిర్మాణం ఆధారపడి ఉంటుందని అమెరికాలోని వాషింగ్టన్ సైకాలజీ యూనివర్సిటీ పరిశోధకులు హెచ్చరిస్తున్నారు. 214 మంది టీనేజర్లు, వారి తల్లిదండ్రుల మధ్య అనుబంధం, టీనేజర్ల వ్యక్తిత్వవికాసంపై వారు అధ్యయనం చేశారు.

ఆత్రుత, ఒత్తిడికి గురయ్యే టీనేజ్ పిల్లలతో పెద్దలు ఫ్రెండ్లీగా ఉంటే వారు ఆనందంతో ప్రతీ చిన్న విషయాన్నీ పేరెంట్స్‌తో పంచుకునేందుకు ఆస్కారం ఉంటుంది.

ముఖ్యంగా చదువుకునే సమయంలో చీటికి మాటికి చీకాకు పడుతుంటే, వారెందుకు అలా ప్రవర్తిస్తున్నారో గమనించాలి. ప్రేమ, ఆప్యాయత ప్రదర్శించడం వల్ల పేరెంట్స్‌తో పిల్లలు స్నేహపూర్వకంగా ఉంటారు. అలా కాకుండా ప్రతి చిన్న విషయానికీ మీరు వారిని రుద్దడం, వారిపై లేనిపోని భారం మోపడం వల్ల తల్లిదండ్రులకు తమ సమస్య చెప్పేందుకు కూడా వెనకడుగు వేస్తారని పరిశోధనలో వెల్లడైంది. అయితే వారి విషయాలలో అప్పుడప్పుడు సహాయ సహకారాలు అందిస్తూ, వారిని ఒకకంట గమనిస్తూ ఉండాలని, వారి అంతర్గత వ్యవహారాలపై తలదూర్చడం మంచిది కాదని పరిశోధకులు వెల్లడించారు.



కూడా చాలా సున్నితంగా ఉండాలి.

### ఇంకో సంగతి

ఇంతకుముందు చెప్పినట్లుగా డిసిప్లిన్ కానివ్వండి, హితబోధలు కానివ్వండి సడెన్‌గా టీనేజ్ వయసు పిల్లలపై రుద్దితే వర్కవుట్ కాదు. బాల్యం నుంచి పెంపకంలో అలవడినప్పుడే సరైన ఫలితాలు దొరుకుతాయి.

అలాగే మనం చెప్పుకున్నదంతా టీనేజర్స్‌కి సంబంధించిందే తప్ప వ్యక్తిత్వం సంతరించుకున్న అడల్ట్ గురించి కాదు. కాబట్టి టీనేజర్స్‌లో ఎంతో కొంత బాధ్యతారాహిత్యం అరా

వాళ్ళు పెద్దయినతర్వాత ఎప్పుడో ఒకప్పుడు మీ నుంచి దూరంగా ఉండాల్సి వస్తుంది. అప్పుడు మీకు వాళ్ళులేని లోటు తెలుస్తుంది. ఈలోపు వారు చేసే తప్పొప్పుల్ని భరిస్తూ మురుస్తూ, మురిపాలు చేస్తూ మధ్య మధ్య తగ్గ సలహాలనిస్తూ వాళ్ళకు హితుల్లా, స్నేహితుల్లా తల్లిదండ్రుల్లా మెలగడం మీధర్మం, కర్తవ్యం.

– లతాకమలం

lathakamalam.me@gmail.com

(అయిపోయింది)



# కత్తి మీద సాము!

**బంగ్లాదేశ్‌తో భారత్ స్నేహం చాలా ముఖ్యం. కానీ, భారత్‌కు ఆ స్నేహాన్ని నిలుపుకోలేని పరిస్థితి ఏర్పడుతోంది.**

బంగ్లాదేశ్‌కు సంబంధించినంత వరకూ భారత్ ఏ ఒక్క తప్పటడుగు వేసినా అది దేశ దీర్ఘకాలిక భద్రత, వ్యూహాత్మక ప్రయోజనాలను దెబ్బ తీయడమే కాదు, దక్షిణాసియాలో ప్రాంతీయ సుస్థిరతకు కూడా భంగం కలుగుతుంది. తీస్తా నది మీద ఏర్పడిన ప్రతిష్ఠంభనను ఈ రెండు దేశాలూ కలిసి ఏదో విధంగా తొలగించుకునే ప్రయత్నం చేయడమే మంచిది. ఈ దేశాల్లో స్థానికంగా ఉండే ఇబ్బందులు, ఒత్తిళ్ల కారణంగా ఈ దేశాల మధ్య ఉన్న సుహృద్భావం, సత్సంబంధాలు వెనుకపట్టు పట్టాయి. నాలుగు రోజుల భారత్ పర్యటనకు వచ్చిన బంగ్లాదేశ్ ప్రధాని షేక్ హసీనా 22 ఒప్పందాలతో ఢాకా తిరిగి వెళ్లి ఉండొచ్చు. కానీ, తీస్తా నదీజలాల ఒప్పందం మాత్రం ఈ రెండు దేశాల మధ్య కుదరకపోవడం హసీనాకు నష్టం కలిగించవచ్చు. బంగ్లాదేశ్‌లో త్వరలో ఎన్నికలు జరగనున్న పరిస్థితిలో ఈ ఒప్పందం ఆమెకు రాజకీయంగా కూడా లాభం కలిగించి ఉండేది.

బంగ్లాదేశ్‌లో ప్రతిపక్ష నేషనలిస్ట్ పార్టీ నాయకురాలు ఖలీదా జియాకు హసీనా ఈ ఒప్పందాలతో తగిన సమాధానం చెప్పవచ్చు. కానీ, ప్రజలు, ప్రతిపక్షాల సహనం నశించిందనీ, తీస్తా తన రాజకీయ ప్రయోజనాలను దెబ్బతీయడం ఖాయమనీ ఆమెకు మనసులో అర్థమైపోయింది. ఖలీదా జియా ముందు ధైర్యంగా నిలబడే పరిస్థితికి ఆమె దూరమైపోయారు. షేక్ హసీనా రాజకీయంగా ఓడిపోతే అది భారతదేశానికి పెద్ద దెబ్బే... హసీనాలో ఎన్ని లొసుగులు, లోపాలు ఉన్నప్పటికీ, ఆమె భారత్‌కు అనుకూలమైన వ్యక్తి కావడంతో భారత్ ఆమెను దూరం చేసుకోలేదు. ముఖ్యంగా ఉగ్రవాదం వైపు బంగ్లాదేశ్ మళ్లకుండా చేయగలిగిన సత్తా హసీనాకు మాత్రమే ఉంది. ఎన్నికల్లో హసీనా పరాజయం పాలైతే భారత్‌కు ఎంత నష్టమో ప్రధాని నరేంద్ర మోదీకి బాగా తెలుసు.

బంగ్లాదేశ్ నుంచి వలస వచ్చేవారి సంఖ్య పెరగడమో, తరగడమో ఇక్కడ ముఖ్యం కాదు. హసీనా పరాజయం పాలు కావడం, జియా అధికారంలోకి రావడం అనేది బంగ్లాదేశ్ లౌకిక వ్యవస్థను బలహీనపరుస్తుంది. ఫలితంగా బంగ్లాదేశ్‌ను ప్రమాదంలోకి నెడుతుంది. కేవలం హసీనా కారణంగానే భారత్‌కు తూర్పున మరో పాకిస్థాన్ ఏర్పడకుండా ఉంది. ఉగ్రవాదానికి వ్యతిరేకంగా భారత్ అనుసరిస్తున్న వైఖరికి హసీనా మొదటి నుంచీ మద్దతునిస్తున్నారు. ఒక్కోసారి హసీనాయే ఉగ్రవాదుల నిర్మూలనకు గట్టి చర్యలు కూడా తీసుకున్నారు. ఆమె నాయకత్వంలోని అవామీ లీగ్ పార్టీ ప్రభుత్వం ఉగ్రవాదులను తీవ్ర స్థాయిలో వెంటాడటంతో చాలామంది కరడుకట్టిన ఉగ్రవాదులు పశ్చిమ బెంగాల్, అస్సాం, త్రిపుర గుండా భారత్‌లోకి ప్రవేశించడం కూడా జరిగింది.

## హసీనా స్నేహబంధం

ఒక్క 2016లోనే భారతదేశంలోకి బంగ్లాదేశ్ నుంచి సుమారు 2020 మంది హర్కత్‌ఉల్‌జిహాది అల్‌ఇస్లామి, జమాత్‌ఉల్‌ముజాహిదీన్ బంగ్లాదేశ్ (జె.ఎం.బి) ఉగ్రవాదులు ప్రవేశించారు. ఇది 2015 సంవత్సరం కంటే మూడు రెట్లు ఎక్కువ. ఇందులో 720 మంది పశ్చిమ బెంగాల్ వైపు నుంచే భారత్‌లోకి ప్రవేశించడం గమనించాల్సిన విషయం. భౌగోళికంగా కోల్‌కతా ఉన్న పరిస్థితిని బట్టి ఉగ్రవాదులు ఈ నగరాన్ని తాత్కాలిక బస చేసుకోవడమో లేదా ఇక్కడి నుంచి మరో చోటికి వెళ్లడానికి ఉపయోగించుకోవడమో జరుగుతోంది.

ఇక దౌత్యపరంగా పాకిస్థాన్‌ను భారత్ ఎదుర్కోవడానికి కూడా బంగ్లాదేశ్ ఉపయోగపడుతోంది. బంగ్లాదేశ్‌లోని ముస్లింల మీద ఉగ్రవాదుల ప్రభావం రానురానూ పెరుగుతున్న స్థితిలో తన రాజకీయ జీవితాన్ని కూడా పణంగా పెట్టి హసీనా భారత్‌కు అనుకూలంగా చర్యలు తీసుకోవడం జరుగుతోంది. ఈ రెండు దేశాల మధ్యా ద్వైపాక్షిక సంబంధాలు పటిష్ఠంగా కొనసాగడానికి హసీనా వైఖరి ఎంతగానో తోడ్పడుతోంది. 'పాకిస్థాన్‌ను ఒంటరి చేయండి' అంటూ ప్రపంచ దేశాల మధ్య నరేంద్ర మోదీ చేస్తున్న నినాదానికి హసీనా మొదటి నుంచీ మద్దతు నిస్తుండడం కూడా గమనించాల్సిన విషయం. ఈశాన్య బంగ్లాదేశ్‌లో సాయుధ తిరుగుబాటుదార్లనే కాకుండా దేశంలో ఉగ్రవాద చర్యలను చేపడుతున్న ఇస్లామిస్ట్ వర్గాలను అణచివేయడంలో కూడా ఆమె ఎన్నో కఠిన చర్యలు తీసుకుంటున్నారు. భారత్‌లో నకిలీ కరెన్సీ ప్రవేశపెట్టడానికి బంగ్లాదేశ్ గుండా పాకిస్థాన్ చేసిన కుట్రలను ఆమె ముందుకు సాగనివ్వలేదు. ఈశాన్య ప్రాంతాలకు సరుకులను రవాణా చేయడానికి భారత్ కొన్ని బంగ్లాదేశ్ ప్రాంతాలను ఉపయోగించుకుంటోంది. దీనికి కూడా బంగ్లాదేశ్ ఎన్నో అవకాశాలను కల్పించింది. అంతేకాదు, ఈశాన్య ప్రాంతానికి చేరడానికి అవకాశం కల్పించే చిట్టగాంగ్, మోంగ్లా రేవులను అభివృద్ధి చేయడానికి గత వారం ఈ రెండు దేశాల మధ్య ఒప్పందం కుదరడానికి ఉభయ దేశాల అధికారులు ఎంతో ప్రాధాన్యం ఇచ్చారు.

పాక్ ఆక్రమిత కశ్మీర్ నుంచి ఉగ్రవాదులు బయలుదేరి బంగ్లాదేశ్ సరిహద్దుల గుండా భారత్‌లో చేరడానికి చేస్తున్న ప్రయత్నాలు సాగనివ్వకుండా హసీనా అనేక చర్యలు తీసుకున్నారు. భారతదేశం తన తూర్పువైపున ఉగ్రవాదులు, తిరుగుబాటుదార్లతో సతమతమయ్యేటట్లు చేయడానికి గతంలో ఖలీదా జియా ఏర్పాటు చేసిన స్థావరాలను హసీనా కూకటివేళ్లతో పెకలించి వేశారు. భారత్ తమ ప్రాంతంలో ఆధిపత్యం కోసం ప్రయత్నాలు చేస్తోందని, వీటిని సాగనివ్వకూడదని జియా తరచూ చెబుతుండేవారు. అయితే, భారత్‌తో అభివృద్ధి భాగస్వామ్యం చేపట్టవచ్చని, ఆ దేశం ఇక్కడ ఆధిపత్యం కోసం ప్రయత్నిస్తోందనడంలో వాస్తవం లేదనీ హసీనా నిరూపించారు. తాను 2009లో అధికారం చేపట్టినప్పటి నుంచి భారత్ నుంచి అభివృద్ధే తప్ప ఆధిపత్యం దిగుమతి కావడం లేదని ఆమె తేల్చి చెప్పారు.

## చైనాతో సమస్యలు

హసీనా ఢాకాను న్యూఢిల్లీకి తాకట్టు పెడుతు

# రివ్యూ

- రాజశుక



న్నారంటూ ప్రతిపక్షాలు చేస్తున్న ప్రచారాన్ని ఆమె పట్టించుకోలేదు. అయితే, ఇక్కడ ప్రతిపక్షాలు అధికారంలోకి వస్తే మాత్రం ఈ సత్సంబంధాలకు ఇక అవకాశం ఉండదు. భారత్ వ్యతిరేక ధోరణి ప్రబలుతుంది. భారతదేశ దీర్ఘకాలిక భద్రత, వ్యూహాత్మక ప్రయోజనాలు దెబ్బతింటాయి. ద్వైపాక్షిక సంబంధాలు అడుగంటిపోతాయి. ఇదే గనుక జరిగితే బంగ్లాదేశ్ చైనా వైపు మొగ్గుతుంది. దాంతో దక్షిణాసియాలో ప్రాంతీయ సుస్థిరత ప్రమాదంలో పడుతుంది. ఆర్థిక వనరుల్లో చైనాతో సరితూగని భారత్‌కు బంగ్లాదేశ్‌ను అడ్డం పెట్టుకుని చైనా సాగించే దురాగతాలను అడ్డుకునే అవకాశం ఉండదు. ఏతావాతా చెప్పొచ్చేదేమిటంటే, తీస్తా నదీజలాల విషయంలో భారత్ ఆ దేశంతో సాధ్యమైనంత తక్కువ కాలంలో ఒప్పందం పూర్తి చేసుకోక తప్పదు. హిమాలయాల్లో పుట్టి సిక్కిం, పశ్చిమ బెంగాల్‌ల మీదుగా ప్రవహించి బంగ్లాదేశ్‌కు వెళ్లే తీస్తా నదికి సంబంధించి 83 శాతం పరీవాహక ప్రాంతం భారత్‌లోనే ఉంది. ఈ నదీజలాల్లో కొద్ది భాగం బంగ్లాదేశ్‌కు మళ్లేటట్టు చేయాల్సి ఉంది. అయితే, ఇందుకు పశ్చిమ బెంగాల్ తీవ్రంగా అభ్యంతరం చెబుతోంది.

గత నాలుగేళ్ల కాలంలో బంగ్లాదేశ్‌కు 900 కోట్ల డాలర్లను మాత్రమే భారత్ రుణంగా ఇవ్వగలిగింది. అయితే, 2400 కోట్ల డాలర్ల రుణం ఇవ్వడానికి చైనా ఇప్పటికే ముందుకు వచ్చింది. ప్రైవేట్ రంగం ద్వారా మరో 1300 కోట్ల డాలర్లు ఇవ్వడానికి కూడా అది సంసిద్ధత వ్యక్తం చేసింది. ప్రస్తుతం చైనా, బంగ్లాదేశ్‌ల మధ్య 'సమగ్ర భాగస్వామ్యం' మాత్రమే ఉంది. దీన్ని 'వ్యూహాత్మక భాగస్వామ్యం'గా మార్చడానికి చైనా తహతహలాడుతోంది. వ్యూహాత్మక భాగస్వామ్యం కుదిరితే, ఆసియాలో చైనా ఆధిపత్యం పెరిగిపోతుంది. ఇది భారతదేశానికి ఎన్నో కష్టాలను తెచ్చిపెడుతుంది. దక్షిణాసియాలో వాతావరణాన్ని తనకు అనుకూలంగా మార్చుకోవడానికి గత కొన్నేళ్లుగా ప్రత్యక్ష, పరోక్ష మార్గాలతో కృషి చేస్తున్న చైనా భారత్ పొరుగు దేశాలన్నిటితో ఇటువంటి వ్యూహాత్మక భాగస్వామ్యాల కోసమే ప్రయత్నిస్తోంది. శ్రీలంక, బంగ్లాదేశ్‌లతో ఈ విధమైన భాగస్వామ్యాలు కుదుర్చుకోవడానికి ఈ మధ్య కాలంలో ప్రయత్నాలు ముమ్మరం చేసింది. మరోపక్క భారత్‌ను కూడా నయానా భయానా లొంగదీసుకోవడానికి ప్రయత్నిస్తోంది. అందులో భాగంగానే ఈ మధ్య దలైలామా తవాంగ్ పర్యటనను అడ్డం పెట్టుకుని భారత్ మీద ప్రచార దాడి ప్రారంభించింది.



**తీస్తా నదీజలాలపై బంగ్లాదేశ్ తో ఒప్పందం కుదుర్చుకోవాల్సిన తక్షణావసరం ఇప్పుడు భారత్ ముందుంది. బంగ్లాదేశ్‌లో హసీనా ప్రభుత్వం ఉంటేనే భారత్‌కు ఎంతో మేలు జరుగుతుంది . త్వరలో అక్కడ జరిగే ఎన్నికల్లో హసీనా ఓటమిపాలైతే అది భారత్‌కు పెద్ద దెబ్బే. మరి భారత్‌కు అనుకూలమైన హసీనాను గెలిపించి, చైనా ముప్పు తప్పించాలంటే మన దేశం ఏం చెయ్యాలి?**

స్థూల జాతీయోత్పత్తిలో భారత్ కంటే చైనా అనేక రెట్లు ముందుంది. హిందూ మహాసముద్రంలో సైనిక సామర్థ్యాలు కూడా భారత్‌తో పోలిస్తే చైనాకు ఎక్కువే. భారత్ పొరుగుదేశాలతో సత్సంబంధాలు నెరపడానికి చైనా గట్టి ప్రయత్నాలే సాగిస్తోంది. ఇక భారత్, చైనా సరిహద్దుల్లో ఈశాన్య సరిహద్దులు సమస్యల్లో ఉన్నాయి. ఇటువంటి పరిస్థితిలో చైనాతో భారత్ తగాదా పెట్టుకుని నెగ్గుకు రాగలదా అన్నది ప్రశ్న. వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే, హసీనా పాలనను భారత్ ఏవిధంగానూ బలహీనపరచకూడదు. కానీ, బంగ్లాదేశ్‌తో తీస్తా ఒప్పందాన్ని కుదుర్చుకోవడానికి మొదటి నుంచీ అడ్డుపడుతున్న వ్యక్తి పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి మమతా బెనర్జీ. నిజానికి భారత్, బంగ్లాదేశ్‌ల మధ్య 2011లోనే ఈ ఒప్పందం పూర్తయి ఉండేది. కానీ, అప్పటి నుంచి మమత దీన్ని అడ్డుకుంటూనే ఉన్నారు. నదీజలాలు రాష్ట్ర జాబితాలో ఉన్నాయి. లేకపోతే, మోదీ బంగ్లాదేశ్‌తో తీస్తా నదీజలాల ఒప్పందం కుదుర్చుకునేవారు.

### మమత అడ్డుపుల్ల

మమతా బెనర్జీ అంగీకరిస్తేనే ఈ ఒప్పందం సాధ్యమవుతుంది. అయితే, మోదీ ప్రభుత్వం విషయంలో మమత మొదటి నుంచీ వ్యతిరేకతతోనే ఉన్నారు. తీస్తా నదీజలాల ఒప్పందాన్ని మమత దేశ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని ఆలోచించాల్సి ఉంటుంది. అయితే, ఈ ఒప్పందం మీద సంతకం చేయడానికి మమతకు కొన్ని సామాజిక, ఆర్థిక, రాజకీయ కారణాలు అడ్డువస్తున్నాయి. నిజానికి నదీజలాల పంపకం మీద ఒప్పందం చాలా కష్టమైన వ్యవహారం. అందులోనూ రెండు దేశాల మధ్య ఇటువంటి ఒప్పందం కుదరాల్సి ఉన్నప్పుడు ఇది అనేక సమస్యలు తెచ్చిపెట్టడం సహజం. పాకిస్థాన్, భారత్‌ల మధ్య అనేక నదీజలాల ఒప్పందాలున్నాయి. ఉగ్రవాదాన్ని నిరోధించని పక్షంలో ఈ ఒప్పందాలు రద్దు చేసుకోవాల్సి వస్తుందని ఇటీవల భారత్ బెదిరించినప్పుడు పాకిస్థాన్ హడలిపోయి, అంతర్జాతీయ జోక్యం కోసం పరుగులు పెట్టింది. భారత్, బంగ్లాదేశ్‌ల మధ్య నదీజలాల పంపకానికి సంబంధించి ప్రస్తుతం ఒక్క ఒప్పందమే అమలులో ఉంది.

ఈ శతాబ్దంలో ప్రపంచంలో ఏ రెండు దేశాలకూ మధ్య నదీజలాల ఒప్పందం జరగలేదంటే, నీటి పంపకం ఎంత కఠినంగా మారిందో అర్థం చేసుకోవచ్చు. తీస్తా నదిలో తరచూ నీటి కొరత ఏర్పడుతుండడం కూడా ఈ ఒప్పందం కుదరక పోవడానికి ఓ ప్రధాన కారణంగా కనిపిస్తోంది. ఈ నదిలో పశ్చిమ బెంగాల్‌కు కావాల్సిన నీరు కూడా అందని పరిస్థితి ఒక్కొక్కప్పుడు ఏర్పడుతోంది. నదిలో ఏటా సుమారు 600 కోట్ల ఘనపు మీటర్ల నీరు ఉంటే తప్ప సిక్కిం, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలకు ఉపయోగకరంగా ఉండదు. అటువంటిది 60 కోట్ల ఘనపు మీటర్ల నీరు కూడా ఇందులో ప్రవహించడం లేదు. ఇందులో నుంచి బంగ్లాదేశ్‌కు కూడా నీరు పంచితే, పశ్చిమ బెంగాల్ రైతులు అల్లల్లాడిపోవడం ఖాయం. తీస్తా నది నుంచి కాక ఇతర నదుల నుంచి నీటిని బంగ్లాదేశ్‌కు సరఫరా చేసే విషయం ఆలోచించాలని మమత సూచిస్తున్నారు. ఆ సూచన మోదీ ప్రభుత్వానికే కాక, బంగ్లాదేశ్‌కు కూడా నచ్చలేదు.

కొన్ని సమస్యలున్నప్పటికీ, మమత తీస్తా ఒప్పందం విషయంలో సహకరించాల్సిన అగత్యం ఉంది. లేని పక్షంలో భారత్, బంగ్లాదేశ్ సంబంధాలు ఘోరంగా దెబ్బతింటాయి. ఈ పరిస్థితి భారత్‌కు కూడా తీరని నష్టం కలిగిస్తుంది. ఓ జాతీయవేత్తగా మమత వ్యవహరించాల్సిన సమయం ఆసన్నమైంది.




## రోగనిరోధకశక్తిని పెంచే పెంపుడు జంతువులు!

పెంపుడు జంతువుల కారణంగా పలు రకాల అలర్జీలు వస్తాయన్న అనుమానం చాలా మందిలో ఉంది. కానీ ఇది తప్పు అంటున్నారు కెనడా పరిశోధకులు. పెంపుడు జంతువులు ఉన్న ఇంట్లో పిల్లల్లో రోగనిరోధకశక్తి పెంపొందడంతో పాటు ఆస్తమా, ఊబకాయం వంటి సమస్యలు తలెత్తవు అని వారు చెబుతున్నారు. బిడ్డ తల్లి కడుపులో ఉన్న నాటి నుంచీ ఈ ప్రయోజనం సిద్ధిస్తుందని వారు అంటున్నారు. పెంపుడు జంతువులు ఉన్న ఇంటిలోని పిల్లల్లో Ruminococcus and Oscillospira అనే రెండు రకాల ఉపయోగకర సూక్ష్మజీవులు పెరగడాన్ని పరిశోధకులు గుర్తించారు. ఇవి పెరగడానికి కారణం పెంపుడు జంతువులే అని వారు అంటున్నారు. ఈ రెండు సూక్ష్మజీవులు పిల్లల్లో అలర్జీలను, ఊబకాయాన్ని నిరోధించడానికి దోహదపడతాయట! సుమారు మూడు సంవత్సరాల పాటు అధ్యయనం నిర్వహించిన అనంతరం పరిశోధకులు ఈ విషయం నిర్ధారించారు. గర్భంతో ఉన్న సుమారు 700 మంది తల్లులను వీరు అధ్యయనం చేశారు. వీరందరి ఇళ్ళల్లో పెంపుడు జంతువులు ఉన్నాయి. పిల్లలు పుట్టిన తరువాత వారి ఆరోగ్యపరిస్థితిని సుమారు మూడు నుంచి నాలుగు నెలల పాటు పరిశీలించారు. ఆ వయస్సులో సాధారణంగా కనిపించే అలర్జీలు పిల్లల్లో కనిపించకపోవడాన్ని గుర్తించారు. దీనికి కారణం పై సూక్ష్మజీవులు పిల్లల్లో పెంపొందడమేనని వారు చెబుతున్నారు. పూర్వకాలం తల్లులు పిల్లల్ని మట్టిలోనూ, పెంపుడు జంతువులతోనూ ఆడుకోనిచ్చేవారనీ, అందుకే వారిలో రోగనిరోధకశక్తి ఎక్కువగా ఉండేదనీ, ఇప్పటి తల్లులు పిల్లలను నాలుగు గోడలకే పరిమితం చేయడం వలన పలు ఆరోగ్య సమస్యలకు పిల్లలు గురవుతున్నారని వారు అంటున్నారు.



## ఎముకలకు నష్టం చేసే నిద్రలేమి!

నిద్రలేమి పలు ఆరోగ్య సమస్యలకు కారణం అవుతుందన్న విషయం తెలిసిందే! ఇప్పుడు ఇదే ఎముకలకు నష్టం కలిగిస్తుందన్న విషయం అమెరికాలోని కొలరాడో స్టేట్ యూనివర్సిటీ పరిశోధకులు నిర్వహించిన పరిశోధనలో వెల్లడైంది. ముఖ్యంగా రాత్రి వేళల్లో పనిచేసే ఉద్యోగులలో ఈ సమస్య ఎక్కువగా ఉండడాన్ని వీరు గుర్తించారు. సుమారు 50 మంది వ్యక్తుల నిద్ర సమయాలు, వారి ఆరోగ్య పరిస్థితిని అధ్యయనం చేశారు. వీరిలో 45 మంది 20 నుంచి 27 సంవత్సరాల వయస్సు కల వారు కాగా, మిగతా ఐదుగురు 50 నుంచి 55 సంవత్సరాల వయస్సు ఉన్న వారు. వీరిలో 75 శాతం మంది రాత్రి షిఫ్టుల్లో పనిచేస్తున్న వారే! సుమారు మూడు వారాల పాటు వీరు తీసుకునే ఆహారం, నిద్రపోయే సమయాన్ని రికార్డు చేశారు. అదే సమయంలో వీరికి కొన్ని ఆరోగ్య పరీక్షలను కూడా నిర్వహించారు. మూడువారాల అనంతరం వీరిలో 80 శాతం మందిలో ఎముకల క్షీణతను గమనించారు. దీనికి కారణం వీరి నిద్రలేమి అనే వీరు చెబుతున్నారు. వీరిలో ఎముకల క్షీణతకు నిద్రలేమే కారణమా? మరేదైనా ఉందా? అన్న విషయం మీద ఇంకా పరిశోధనలు నిర్వహించాల్సి ఉందని అంటున్నారు. ఏది ఏమైనా రోజులో ఆరు నుంచి ఎనిమిది గంటల నిద్ర తప్పనిసరి అని, ఇంతకు మించి తగ్గితే ఆరోగ్య సమస్యలు తప్పవని వారు హెచ్చరిస్తున్నారు.



## ఈస్ట్రోజన్‌తోనే అలర్జీ సమస్య!

స్త్రీలు ఎదుర్కొనే అలర్జీలకు ఈస్ట్రోజన్ అనే హార్మోను కారణం కావచ్చని వియన్నా యూనివర్సిటీ పరిశోధకులు అంటున్నారు. ఆడపిల్లలు పది సంవత్సరాల తరువాతే ఎక్కువగా అలర్జీకి గురవుతుంటారనీ, దీనికి కారణం ఆ వయస్సులో వచ్చే హార్మోన్లలో మార్పులే అని వారు చెబుతున్నారు. అదే మగవారిలో ఉత్పత్తి అయ్యే టెస్టోస్టిరోన్ హార్మోను అలర్జీలను సమర్థవంతంగా ఎదుర్కొంటుందనీ, ఈ కారణంగానే స్త్రీలతో పోలిస్తే పురుషులలో అలర్జీ సమస్య ఎక్కువగా ఉండదని వారు చెబుతున్నారు. ఈస్ట్రోజన్ హార్మోన్‌తో పాటు స్త్రీలలో కొన్ని ఆరోగ్య సమస్యల చికిత్స సందర్భంగా ఇచ్చే హార్మోను థెరపీ కూడా అలర్జీలకు కారణమవుతుందని వారు అంటున్నారు. స్త్రీలలో తలెత్తే అలర్జీలకు చికిత్స అందించే సందర్భంగా పై విషయాలను గమనించాలని వైద్యులకు వారు సూచిస్తున్నారు.



## జున్నుతో నాజూకుదనం!

పాలాధారిత ఉత్పత్తులు తీసుకుంటే బరువు పెరుగుతామన్న అభిప్రాయం చాలా మందిలో ఉంటుంది. కానీ ఈ అభిప్రాయం తప్పు అంటున్నారు పరిశోధకులు. పాలాధారిత ఉత్పత్తులు తీసుకున్నంత మాత్రాన బరువు పెరగరు అన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. 18 సంవత్సరాల నుంచి 90 సంవత్సరాల వయస్సు కల సుమారు 1500 మంది ఆహార అలవాట్ల మీద వీరు సుదీర్ఘకాలం అధ్యయనం నిర్వహించారు. వీరందరూ సాధారణ బరువు కన్నా కొద్దిగా ఎక్కువ బరువు కలిగిన వారే! వీరిలో సగం మందికి ప్రతిరోజూ పాలాధారిత ఉత్పత్తులతో పాటు జున్ను కొద్దిగా ఎక్కువ ఇచ్చారు. మిగతా సగం మందికి వారు రోజూ తీసుకునే ఆహారం అందించారు. కొన్ని రోజుల అనంతరం పాలాధారిత ఉత్పత్తులు, జున్ను తీసుకునేవారి బరువునూ, ఆరోగ్యాన్నీ పరిశీలించారు. వీరిలో 75 శాతం మంది బరువు పెరగకపోగా కొద్దిగా బరువు తగ్గిన విషయం గుర్తించారు. అయితే జున్ను తీసుకోవడం వలనే బరువు తగ్గారా? లేదా మరేదైనా కారణం ఉందా? అన్న విషయాన్ని వీరు పరిశీలిస్తున్నారు.



—అవినాష్

# జన్మపత్రిక


రమేశ్చంద్ర మహర్షి
సెల్ : 92 46 58 22 55
040-65 22 55 54
rameschandramaharishi.com




భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచ భూతాలూ, అహంకారం, బుద్ధి, ప్రకృతి, పంచ జ్ఞానేంద్రియాలు, మనసూ అనే పదకొండు ఇంద్రియాలూ, శబ్ద, రూప, స్పర్శ, రసగంధాలనే ఇంద్రియ విషయాలూ కోరిక, ద్వేషం, తెలివి, సుఖం, దుఃఖం, ధైర్యం... వీటి వికారాలూ కలిసి ఏర్పడే క్షేత్రం... మనిషి! ఆ మనిషికి భవిష్యత్తనే దారి చూపే నేత్రం, జ్యోతిశ్శాస్త్రం!!

★ ★ ★

ఎన్ని శతాబ్దాలు గడిచినా మనిషి ఒక కొలిక్కి రాలేని విషయం..

Life is more by accident than design... నిజమా

లేక life is more by design than accident నిజమా ... అన్నది.

గోడ మీద నుండి పతనం కావడం భవిష్యత్తు అని నిర్ధారించబడి ఉంటే "పడడం" accident! "దూకడం" design! భవిష్యత్ ముందే తెలిస్తే పడడాన్ని దూకడంగా మలచుకోవచ్చు.

కృతే కార్యే కింముహూర్త ప్రశ్నేన? పని ముగిసిన పిదప ముహూర్తమడగడం, జరగకూడనిది జరిగిపోయాక పరిహారాలు పాటించడం వలన ఏమిటి ప్రయోజనం?

భవిష్యత్ ముందే తెలిస్తే ముప్పు నుండి తప్పించుకోవడం లేదా తగ్గించుకోవడం సాధ్యమే!

కాలః క్రీడతి గచ్ఛత్యాయుః

కాలం ఆడుకుంటూ ఉంటుంది. ఆయువు గతించిపోతూ ఉంటుంది. రాబోయే మంచి చెడులు తెలిస్తే ఉన్నంతలోనే ఉన్నతంగా జీవించగలుగుతాం!

వయం భగవంతః స్యామ!

| | | | |
|---|---|---|---|
| | | శు కే | ర 23.20 |
| (శ) చం | రాశి | | (బు) 02.20 |
| | | | కు |
| | రా | / | గు |

| | | | |
|---|---|---|---|
| చం | | శు కే | |
| శ | భావ | | ర బు |
| | | | కు |
| | రా | / | గు |

| | | | |
|---|---|---|---|
| శు | గు | ర చం | కే |
| | నవాంశ | | బు |
| | | | కు |
| రా / | శ | | |

❖ ఈ జన్మకుండలి ప్రకారం

నక్షత్రం పూర్వాభాద్ర. కుంభరాశి

**కంట్రోలింగ్ ఫేక్టర్స్** : శనికి కుజ చంద్రులు. అయినా తనకు పూర్తి స్వతంత్రం. కావాలనుకుంటే ఏకపక్షంగా కూడా నిర్ణయాలు తీసుకునే పరిస్థితి.

బుధునికి గురు రవి రాహువులు. 70 శాతం బృహస్పతిదే అదుపు. కేతువుకు చంద్ర బుధులు, శుక్రునికి కేతువు.

ఈ జన్మకుండలి వరకూ రవి కుజునిలా, చంద్రుడు బుధునిలా, కుజుడు రాహువులా, రాహువు బుధునిలా, బృహస్పతి స్వతంత్రంగా, శని కొంచెం చంద్రునిలా, బుధుడు బృహస్పతిలా పనిచేయడం జరుగుతుంది.

ఎన్ని కాంబినేషన్స్ ఎలా ఉన్నా, బలంగా ఉన్నా, స్వక్షేత్రంలో ఉండి కూడా శుక్రుడు సరైన ఫలితాలు ఇవ్వలేకపోవడం ఈ జన్మకుండలిలోని బలరాహిత్యం! ప్రధాన కారణం కేతు సాంగత్యం!!

గత జన్మ శాపానికి ఇక్కడి రూపాంతరం శుక్ర కేతువుల సమాగమం. యోగం పట్టాలన్నా, జీవితం పట్టాల మీదకి రావాలన్నా శాపం కరగాలి. దానికి కేతువు అనుగ్రహం కావాలి. గట్టి పరిహారాలు పాటించాలి.

ప్రస్తుతం నడుస్తున్న దశానాథుడు శనికి పంచమ స్థితీ. కంట్రోలింగ్ ఫేక్టర్ కుజునికి లాభ స్థితి కలిసి ఇక్కడ శాపవిమోచనానికి సహకరిస్తారు. దీనికి ఈ జాతకుడు పరిహారాలతో పాటూ చేయాల్సింది, తనను తాను నిరూపించుకోవడం...ప్రకృతికి!!

నిజాయితీతో, వాచాలత్వం విడనాడీ, అధర్మ కార్యాచరణ చేయకుండా ప్రకృతికి తనను తాను నిరూపించుకోవాలి. మనం చూస్తుంటాం... చాలా చాలా ప్రతిభా సంపన్నులు కూడా జీవితంలో ఏమీ సాధించలేక ఒక మూలకి ఉండిపోవడం! దీనికి ప్రధాన కారణం ప్రకృతి వారిని ఎంచుకోలేదన్న మాట.

ఏది ఏమైనా శని దశ, ఈ జాతకుని పాప పంకిలాలను పటాపంచలు చేయగలదు. కనుక, ఆ కోణంలో కూడా ఇతడు కృషి చేయాల్సి ఉంటుంది.

విద్య సిఏ అవుతుంది. పచ్చ ధరిస్తే ఎంబిఏ కూడా పూర్తయిపోతుంది.

29వ సంవత్సరం నుండి 17 సంవత్సరాలు నడిచే బుధ దశ విపరీతంగా యోగిస్తుంది. బుధాధిత్య యోగం వలన ప్రభుత్వోద్యోగం, అలాగే అది బ్యాంకింగ్ కావడం జరుగుతుంది. బృహస్పతి వలన ఆయా పీరియడ్స్‌లో విదేశ నివాసమూ ఉంటుంది. వృత్తిలో యోగం పట్టడం 2029 జులై మధ్య నుండి. ఆ యోగం 2039 ఏప్రిల్ వరకూ నిరాఘాటంగా నడుస్తుంది.

అలాగే ఈ జన్మకుండలిలోని దురదృష్టకర సమయాలు–

1) తన 50వ సంవత్సరంలో – ఇది లీగల్ సమస్యలు రాకుండా జాగ్రత్త పడాలి.

2) తన 46, 47 సంవత్సరాల్లో – ఇది ఆరోగ్య సమస్యలు సృష్టించకుండా రెమిడీస్ పాటించాలి.

3) తన 63వ ఏట... ఈ పీరియడ్‌లో ఎట్టి పరిస్థితులలో కూడా విదేశాల్లో ఉండకూడదు. ఉంటే అక్కడ చిక్కుపడిపోవడం... లీగల్ కారణాలతో... జరుగుతుంది.

ప్రతి కేతు భుక్తిలో వాహనాలతో జాగ్రత్త పడాలి.

ప్రతి చంద్ర భుక్తిలో మానసిక ఆరోగ్యం సరిచూసుకోవాలి.

తన 24 నుండి 27 వయసు మధ్య నడిచే శనిలో రాహు భుక్తి వృత్తిలో స్థిరత్వాన్నిస్తుంది. దీనిలో రెండు ఉద్యోగాలు లభించడం, రెండో దానిలో స్థిరపడడం జరుగుతుంది. అయితే ఇదే పీరియడ్ వివాహాన్నీ ఇచ్చేందుకు సిద్ధంగా ఉన్నా చేసుకోకపోవడం మంచిది. అవసరం కూడా. మామూలుగానే ఈ జన్మకుండలి వరకూ కుటుంబ జీవితంలో రకరకాల యుద్ధ విన్యాసాలు చేయాల్సి ఉంటుంది. రాహు భుక్తిలో అయితే గయ్యాళి భార్య అనివార్యం! అయితే శని రాహువుల వలనే ఎలాగూ వివాహం ఆలస్యమవుతుంది. ఇక్కడ గురునిది వివాహాన్నిచ్చే పోర్ట్‌ఫోలియో కాకపోయినా చంద్రాత్తూ అభ్యంతరం ఉండదు. ఈ విషయాన్ని పరిహారాలతో ప్రభావితం చేసుకుని బృహస్పతి అంతర్దశలోనే వివాహం కానివ్వాలి. అంటే తన 28వ సంవత్సరంలో.

ఆమె కొండ వాగు! అతడు కోడె నాగు!! అనే పరిస్థితి ఎలాగూ లేకపోయినా కనీస రోజువారీ పోరాటాలు జరగకుండా ఉండేందుకు రాహు శుక్రులకు పరిహారాలు పాటిస్తూనే ఉండాలి!

ఇక 37వ సంవత్సరం నుండి మంచి గృహ యోగం.

**ధరించవలసిన రత్నాలు** : పచ్చ + వజ్రం.

**అదృష్ట దిక్కు:** అస్సలు కూడనిది సౌత్ ఫేసింగ్. మిగిలినవన్నీ బాగుంటాయి.

**ఆరోగ్యం** : శుక్ర దశలో అంటే తన 53వ సంవత్సరం నుండి నోటికి సంబంధించిన అనారోగ్యం ఏర్పడకుండా జాగ్రత్త పడాలి.

**శక్తి యుక్తులు** : ముఖ మస్తీతి న వక్తవ్యమ్

నోరుంది కదా అని జారకూడదు. వాక్కుని బట్టే ధనాదాయం! సముద్రంలో మనకు మొదట కనిపించేది కెరటాలే! లోపల ఏమైనా ఉండనీ... పైకి ప్రదర్శించాల్సింది చిరునవ్వే!!

# పుట్టలోని చెదలు

## పొరుప్పూడి వెంకట సత్యనారాయణ

**ఉదయాన్నే లేచి నిత్యవారీ కార్యక్రమం పూర్తి చేశాను. అంటే అన్ని పనులూ చక్కబెట్టుకుని పిల్లలిద్దరినీ కోచింగ్ సెంటర్ల దగ్గర దింపి వచ్చి స్నానం చేసి కూర్చుని పేపర్‌లో వార్తలు తిరిగేయడం మొదలుపెట్టాను.**

**ఈలోగా శ్రీమతి వంట పూర్తి చేసి పిల్లలకు, మా యిద్దరికి క్యారేజీలు సిద్ధం చేస్తుంది. క్యారేజీలు కోచింగ్ సెంటర్లలోని పిల్లలకి అప్పచెప్పేసి మేమిద్దరం ఆఫీసులకి వెళ్ళిపోతాం.**

ఉదయాన్నే ఏదో అలవాటు చొప్పున పేపరు తిరిగేయడంతప్ప దానిమీద పూర్తిగా దృష్టి పెట్టేం దుకు ఎక్కువ సమయం ఎలాగూ కేటాయించలేను. అయితే హెడ్‌లైన్లు చూస్తుంటే ఎలా పడిందో నాదృష్టి పేపరుకు ఓ మూల ఓ ఫొటోమీద పడింది. ఉలికి పడ్డాను. ఆ ఫొటో పూర్ణమ్మగారిదే. ఫొటో కింద "పూర్ణమ్మగారనే పేరుగల వీరు మృత్యుశయ్యపై ఉన్నారు. ఏదో చెప్పాలని తహతహలాడుతున్నారు. వీరిని ఎరిగినవారెవరైనా ఉంటే తప్పకుండా ఈ దిగువ ఆశ్రమానికి రాగలరు.." అంటూ కింద వృద్ధా శ్రమం చిరునామా ఇచ్చారు.

చిన్నప్పుడు ప్రాజెక్టులు చూస్తుండడం వల్ల ఇంజ నీరుగా పనిచేస్తున్న మానాన్నగారికి తరచు బదిలీ లవుతుండేవి. నా చదువు దెబ్బతినకూడదని, కాస్త ప్రశాంతంగా కూడా ఉంటుందని పల్లెటూరైనా పర వాలేదని అమ్మ, నేను నా బాల్యంలో పూజవరంలో ఉండేవాళ్ళం. అందుచేత నా చిన్నతనమంతా అక్కడే గడిచింది.

నేను ఆ ఊళ్ళో మా ఇంటి పక్కనే పెద్ద పెంకు టింట్లో ఉండే లెక్కల మాస్టారు రామయ్యగారి దగ్గర ప్రైవేటుకు వెళ్ళేవాణ్ణి. పూర్ణమ్మగారు మాస్టారుగారి భార్య. సాక్షాత్తూ అన్నపూర్ణమ్మే. ఆవిడ సంగీత పాఠాలు చెబుతుండడం వల్లనో ఏమోగానీ వాళ్ళిం టికి బంధువుల కంటే కూడా సంగీతం నేర్చుకుంటున్న పిల్లల తల్లిదండ్రులు, అప్పుడపుడు దూరాల్లో సెటిలై పోయిన శిష్యులు ఎవరో ఒకరు వస్తుండేవారు. వచ్చినవాళ్ళెంత పెద్ద ఆఫీసర్లు అయినా పేదవా రైనా గాని ఆవిడ చేతిమీద భోజనమో ఫలహారమో లేక కనీసం పండో అయినా తినకుండా వెళ్ళనిచ్చే వారు కాదావిడ.

మాస్టారి పిల్లల్లో పెద్దవాళ్ళిద్దరూ ఓ మాదిరిగా చదివేవారు. వాళ్ళ మూడో అబ్బాయి వేణుమాధవ్ నాకంటే మూడేళ్ళు పెద్దవాడు. వాడికున్న శ్రద్ధంతా తిరగడంలోనే. అందువల్ల ఎప్పుడూ పరీక్ష తప్పుతూనే ఉండేవాడు.

మా అమ్మ తప్పని సరిగా అమ్మమ్మగా రింటికి వెళ్ళవలిసివచ్చి ఊరెళ్ళినప్పుడు నేను పూర్ణమ్మగారి బలవంతం మీద ఎన్నో సార్లు నాకంటే పెద్దవాళ్ళైన వాళ్ళ పిల్లలతో పాటే భోజనం చేసేవాణ్ణి. దాంతో మా అమ్మకి కూడా ఆవిడతో విడదీయలేని అనుబంధం ఏర్ప డింది.

అమ్మ కూడా సంక్రాంతి పండగ వచ్చినప్పుడు "పూర్ణమ్మగారూ! ఇదివరకు మా పుట్టింటివారికి నాతో ఏ అవసరం వచ్చినా గుమ్మం కదిలే వీలుం డేది కాదు, ఇప్పుడు నాకాబాధ తప్పింది. ఈ పసి వాడి గురించే నాకు బెంగ. ఈ ఊరొచ్చాక మా వాసు గురించి నాకు దిగులు తీరిపోయిందంటే నమ్మండి. మావాణ్ణి మీ పిల్లలకంటే ఎక్కువగా చూసుకుంటున్నారు. మీ ఋణం ఎలా తీరుతుందో?" అంటూ ఆవిడకు పసుపు కుంకాల పేరుతో ఓ మంచి చీర, రవికెలగుడ్డ, గాజులు అవీ నాచేత ఇప్పించి దణ్ణం పెట్టించేది.

నా టెన్త్ క్లాస్ పూర్తయ్యాక ఆ ఊరు వదిలి మేం వెళ్ళిపోతుంటే ఆవిడ కన్నీళ్ళు పెట్టుకుంది.

"నాయనా వాసూ! నీకు గురువు మాస్టారే అయినా పెద్దయ్యాక ఈ పెద్దమ్మను చూసేందుకు కూడా తప్పకుండా వస్తావుగా"

"వస్తాను పెద్దమ్మగారూ!" అంటూ ఆవిడ కాళ్ళకు దణ్ణం పెట్టి వెళ్ళిన నేను ఇంతవరకు మళ్ళీ ఆ ఊరు వెళ్ళే తీరిక చిక్కలేదు.

పై చదువులు..ఆతర్వాత పెళ్ళి, పిల్లలు, అమ్మకి వైద్యం ఇలా సంసార జంఝాటంలో పడిపో యాను. మళ్ళీ ఇదిగో ఇప్పుడే ఆవిడను ఇలా ఫొటోలో చూడడం.

నా మనసు ఏదోలా అయిపోయింది.

నిజానికి అది ఆవిడ వయసులో ఉన్నప్పటి ఫొటో కనుక నేను పూర్ణమ్మగారిని గుర్తించగలి గాను. కాని ఇప్పుడు ఆవిడకు డెబ్బైఏళ్ళకు తక్కు వుండవు. ఆవిడ కొడుకులు, కూతురు ఏమ య్యారు? ఆవిడ వృద్ధాశ్రమంలో ఉండడమేమిటి?

కాలం ఎంతో మారిపోయింది. తరాల తేడావ ల్లనో ఏమో ఈ కాలం కోడళ్ళకు అత్తగారితో కలిసి ఉండడం ఇష్టం లేకపోవడం ఇంటింటి రామాయణమై పోయింది. కాని ఆవిడ ఎంతో సర్దుకుపోయే స్వభావం గల మనిషి. ఆవిడతో కొడుకులకు కూడా పడ లేదా? కూతురు అల్లుడు, మాస్టారు వీళ్ళంతా ఏమయ్యారు? అందరూ ఉండి కూడా ఆవిడ దిక్కులేనిదానిలా మరణావస్థలో ఓ ఆశ్రమంలో తపించిపోతోందనగానే పరిపరివి ధాల ఆలోచనలతో నా మనసు వికలమైపోయింది.



మాస్టారిది రాజమండ్రి దగ్గర పూజవరం అనే పల్లెటూరని తెలుసు. ఈ ఆశ్రమం ఏలూరుకు దగ్గర్లో ఉంది.

ప్రస్తుతం నేనున్నది శ్రీకాకుళంలో. నేనింక నిలవ లేకపోయాను.

అర్జంటు పనిమీద ఊరెళ్లాలని మా ప్రతిమకి చెప్పి నా లీవ్‌లెటర్ కూడా ఆఫీసులో అందించమని వెంటనే ఏలూరు బయలుదేరిపోయాను. ఇరవైనా లుగు గంటల తర్వాత నేను ఆశ్రమంలో ఉన్నాను.

ఆ వృద్ధాశ్రమంలో అన్నీ పాకలే. అయినా విశా లంగా ఎంతో బాగుంది. ఒకవైపు కూరగాయలు పండిస్తున్నారు. మరోవైపు పూల మొక్కలు. ఒక చోట చిన్నపిల్లల్ని ఆడిస్తున్నారు కొందరు వృద్ధులు. సెంటర్లో వృత్తాకారంలోని తోట మధ్య చిన్న మంది రంలో వేణుగోపాలుడు చేతిలో పిల్లన గ్రోవితో చిరు నవ్వులు చిందిస్తున్నాడు.

ఆ మందిరం ఆవరణలోనే ఒక మంచంమీద కళ్ళు మూసుకుని పడుకుని ఉన్న పూర్ణమ్మగారిని చూడగానే నాకు దుఃఖం ఆగలేదు. మనిషి చిక్కి శల్యమై ఉంది. పండిపోయింది జుట్టు. నా చిన్నత నంలో ఆవిడ తలస్నానం చేసి జుట్టు ఆరబెట్టుకుం టూంటే ఆజుట్టు కృష్ణవేణమ్మ పరుగులు తీస్తున్న ట్టుగా వంకీలతో బారెడు పొడవున ఉండేది. పచ్చని ఆవిడ చేతులు ఒరుగైపోయాయి. చేతులకి రెండే రెండు మురుగులు. అవి గిల్టువని తెలుస్తున్నాయి.

‘వీరిని చూడడానికి ఎప్పుడైనా ఎవరైనా వచ్చారేమో గుర్తుతెచ్చుకుని చెప్పగలరా?’ అడిగాను ఆశగా.

“ఈ రోజున మీరుతప్ప ఈవిడకోసం ఇంతవరకు ఎవరూ రాలేదు.’ ‘మీకెవరూ లేరా తల్లీ’ అని మేము ఎన్నిసార్లు అడిగినా ఆవిడ “మీరంతా నావాళ్ళు కాదా” అని నవ్వడం తప్ప ఏమీ చెప్పలేదు బాబూ!”

“ఇంతకీ మీరేమవుతారు బాబూ!” మరొక వృద్ధురాలు కుతూహలంగా అడిగింది.

ఏమవుతానో చెప్పడానికి నేను సిగ్గుపడ్డాను.



కారణాలేమైనాగానీ బాల్యంలో విద్యాభిక్ష పెట్టిన గురువుగారి కుటుంబ కనీస క్షేమ సమాచారాలు ఇన్నేళ్ళూ విచారించలేదు నేను. అందుకని తలవంచుకునే అన్నాను.

“వీరు నా చిన్నతనంలో మా గురువుగారి భార్య. హైస్కూలు వరకు ఆయన దగ్గరే ప్రైవేటుకు కూడా వెళ్ళేవాణ్ణి.”

‘ఏమయితేనేంలే ఈకాలంలో కడుపున పుట్టిన బిడ్డల కన్నా నువ్వే నయం బాబూ! మా బిడ్డలకు మేము ఉన్నా పోయినా కూడా అక్కర్లేదు’ కొంగుతో కళ్ళు అద్దుకుంది ఒక తల్లి.

‘ఎంత మంచి మనిషో ఈవిడ. మాలో ఎవరికి ఒంట్లో బాగా లేకపోయినా స్వంత అప్పచెల్లెల్లా సేవచేసేది. మాకు ఒంట్లో శక్తి నశించింది. ఇక రామనామం చెప్పడం తప్ప ఇప్పుడు ఆవిడకి మేం ఏ రకంగానూ ఉపయోగపడలేకపోతన్నాం.’

ఆవిడ చుట్టూ చేరి రామనామ స్మరణ చేస్తున్న స్త్రీలు ఇలా తలొకమాటా అన్నారు.

ఒక్కక్షణంపాటు నాకేంచెప్పాలో తోచలేదు. ఉన్నారని చెబితే వాళ్ళు ఈమెను పట్టించుకోలేదని నానా మాటలు అంటే పూర్ణమ్మగారి మనసును బాధపెట్టిన

ఆవిడ బంగారు మురుగులని కాలం కరిగించేసి ఉంటుంది.

ఆవిడ అప్పుడప్పుడు మాత్రమే కళ్ళు తెరిచి మాధవా అంటోందిట. నాలుగేళ్ళ క్రితం ఆవిడ దిక్కూదివాణం లేక రోడ్డుమీద గాయాలతో పడిపోయి ఉంటే ఎవరో పుణ్యాత్ముడు ఈ ఆశ్రమానికి తీసుకొచ్చి అప్పచెప్పి వెళ్ళిపోయాడట. ఆశ్రమ ధర్మకర్త జాలిపడి అక్కడ ఉండేందుకు అంగీకరించారట.

‘ఎంత చక్కని కంఠమో బాబూ ఆవిడది. ఆవిడ ఆరోగ్యం కాస్త కుదుటబడ్డాక ఇక్కడ బాల సదన్‌లో చిన్న పిల్లలకు పాటలు నేర్పించేవారు.’ తల బాగా పండిపోయిన ఒక వృద్ధురాలు పూర్ణమ్మగారిని గౌరవంగా చూస్తూ అంది.

‘ఏనాడూ ఎవరిచేతా చేయించుకోలేదు మహాతల్లి. పైగా వంటశాలలో తనకు తోచిన సాయం చేసేది. ఆవిడ చెయ్యి అద్భుతం. వంటకాలు నలభీమపాకమే’ అంది మరొకావిడ.

వాణ్ణవుతాను. అదీగాక అక్కడేం జరిగిందో, ఆమె ఊరు విడిచి ఎందుకు రావలసి వచ్చిందో, అసలు వాళ్ళంతా జీవించి ఉన్నారో లేక ఏదైనా ఉపద్రవం జరిగి... ఆపైన ఆలోచించడానికి మనస్కరించలేదు.

ఉన్నట్టుండి ఆవిడ 'మాధవా' అని కలవరిస్తోం దని వీళ్ళు చెప్పడం గుర్తొచ్చింది. అంటే చిన్నవాడు వేణుమాధవ్ అయివుండాలి. అతని మీద అలిగి ఈవిడ ఊరు వదిలివచ్చి రోడ్డుమీద నడుస్తుంటే ఏదన్నా వాహనం ఢీకొట్టి ఉండాలి. ఇక్కడకు వచ్చాక కూడా వాళ్ళ పేర్లు చెప్పడం పూర్ణమ్మగారికి ఇష్టం లేకపోయి ఉండాలి. ఇప్పుడు మరణావస్థ సమీపించిన దని తెలిసి కొడుకును చూడాలనిపిస్తోందేమో..

'మాధవా!' పూర్ణమ్మగారికి తెలివొచ్చినట్టుంది. కలవరించడం నాకు వినిపించింది. గభాలున లేచి ఆమె దగ్గరకు వెళ్ళి ఆమె చేతిని నాచేతిలోకి తీసుకుని, పెద్దమ్మగారూ అని చెవిలో నెమ్మదిగా పిలిచాను. చిన్నప్పుడు అమ్మ ఆవిణ్ణి అలాగే పిలవమని చెప్పేది.

ఆవిడ 'ఎవరూ..రమణా' అంటూ కళ్ళు తెరిచింది. నూతిలోంచి వస్తోంది ఆ గొంతు. నాకాశ్చర్యం అని పించింది. ఆవిడకు నా పేరు ఎంత జ్ఞాపకం?

చిన్నప్పుడు అమ్మ తాతగారి ఊరు వెళ్ళినప్పు డల్లా ఆవిడతో సంతకి నేను సంచీ పట్టుకుని వెళ్ళే వాణ్ణి. తప్పిపోతానేమోనని నా చెయ్యి పట్టుకుని వదిలేది కాదావిడ. చిన్ననాటి ఆ చేతి స్పర్శ ఆవిడకి ఇంకా గుర్తుందా; లేకపోతే గడ్డాలు మీసాలు వచ్చిన వయసులో ఉన్న నన్ను ఎలా గుర్తుపట్టిందావిడ?

గాజుకాయల్లాంటి కళ్ళల్లో చిన్నసైజు ఆకుప చ్చని గోళీల్లా ఉన్నాయి కనుపాపలు. ఆ కళ్ళల్లో దీన త్వంతో పాటు ఎంతటి వాత్సల్యం! మాటిమాటికీ ఏదో చెప్పాలని ఆరాటంతో నోరు తెరిచినా గొంతు సరిగా రావడంలేదు. కాని నా చేతిని మాత్రం గట్టిగా పట్టుకుని వదలడం లేదావిడ.

'పెద్దమ్మగారూ! మాధవ్ ఎక్కడున్నాడు. వాణ్ణి చూడాలనుకుంటున్నారా?' ఆవిడ గుప్పిట బిగుసు కోవడం నాకు తెలిసింది. ఆవిడ కనుగుడ్లు ఆందోళ నగా అటూఇటూ తిరిగాయి. నాకర్థమైంది. ఆవిడ చిన్నకొడుకును చూడాలనుకుంటోంది.

'మాధవ్ మన ఊళ్ళోనే ఉన్నాడా? ఉండండి నేను వెళ్ళి తీసుకొస్తాను, అనిచెప్పి లేవబోతుంటే మళ్ళీ ఆవిడ గుప్పిట బిగుసుకోవడం నాచేతికి తెలిసింది.

బలవంతాన నోరు తెరిచింది పూర్ణమ్మగారు. గొంతు పెగల్చుకుని ఆవిడ అన్న మాటలు ఆవిడ నోటి దగ్గర చెవినుంచిన నాకు స్పష్టంగా వినిపించాయి.

'నా సంచీ మాధవుడికి..' ఆవిడ గుప్పిట విడిపో యింది. నాకర్థమైపోయింది. ఆవిడ ప్రాణం అనంత వాయువుల్లో కలిసిపోయింది. నాకు కన్నీరాగలేదు. రామనామం జపిస్తూనే ఉన్నా అక్కడున్న వాళ్ళ కళ్ళల్లోనూ కన్నీరు పొంగి పొర్లుతోంది.

'పెద్దయ్యాక ఈ పెద్దమ్మను చూసేందుకు

**యథావిధిగా రాములవారి గుడి అరుగు మీద కూర్చుని ఎదురుచూస్తున్నాడతను. ఓ వ్యక్తి అతని దగ్గరకు వెళ్ళాడు. మొత్తం ఇరవై వేలు ఖర్చవుతుందని లెక్కలు తేల్చి చెప్పాడతను.. కానీ అతడు చెప్పేవన్నీ అబద్ధాలే. ఆ నిజం తెలుసు వెళ్ళిన వ్యక్తికి. అయినాగానీ ఓ చిన్న సంచీ అతని చేతికి ఇచ్చాడు. అది చూసిన తర్వాత కూడా అతనిలో మార్పు వస్తుందనే నమ్మకం లేదు ఆ వ్యక్తికి. ఇంతకీ ఆ వ్యక్తి ఎవరు? అసలు ఆ సంచీలో ఏముంది?**

వస్తావు కదూ' అన్న మాటలు పదేపదే నా చెవుల్లో ప్రతిధ్వనించసాగాయి.

కాని ఆవిడను చివరికి మృత్యుశయ్యమీదనే చూడ్డానికి రావలసివచ్చిన నా దురదృష్టాన్ని నిందించు కున్నాను. ఇన్నేళ్ళలో ఒక్కసారి ఆ ఊరెళ్ళినా, నాకు పూర్ణమ్మగారి పరిస్థితి ఏ మాత్రం తెలిసినా కూడా చేతనైన సాయం చేసేవాణ్ణి లేదా ఆవిడ చివరి రోజులు ప్రశాంతంగా నా ఇంట్లో నా పిల్లల మధ్య ఆప్యాయతానురాగాల మధ్య గడిచేలా చూసే వాణ్ణి.

కాని గురువుగారు వాళ్ళంతా పెద్దవాళ్ళైపోయి ఉంటారు. ఎన్నాళ్ళు బ్రతుకుతారో ఏమో! వృద్ధా ప్యంలో వాళ్ళకి ఇంకేం అవసరాలుంటాయో అనే ఆలోచన నాబోటి శిష్యులకు ఒక్కసారి కూడా రాక పోవడం నిజంగా పాపమే.

చిన్నతనంలో కన్నతల్లికంటే ఎక్కువ ప్రేమగా ఒకసారికాదు రెండుసార్లు కాదు ఎన్నోసార్లు అమ్మ ఊరికెళ్ళినప్పుడల్లా అన్నపూర్ణమ్మగారు స్వయంగా అన్నం తినిపించేది నాకు. అందుకే ఆవిడ ఋణం ఈ రూపేణా అయినా తీర్చుకోవాలనిపించింది.

ఆవిడ దహనకర్మ నేనే స్వయంగా ముగించాను.

నేను వెళ్ళిపోతుంటే అక్కడున్న పెద్దవాళ్ళంతా కృతజ్ఞతతో నా చేతులు పట్టుకుని నన్ను ఆశీర్వదిం చారు.

'భగవంతుడు నిన్ను, నీ కుటుంబాన్ని చల్లగా చూస్తాడు బాబూ!'

'ఎక్కడో పేపర్లో ప్రకటన చూసి నీకు తెలియ నట్టు తప్పించుకోకుండా, గురువుగారి భార్యకు కన్నతల్లిలా అంతిమ సంస్కారం చేశావు.'

'పూర్ణమ్మగారు పుణ్యాత్మురాలు కనుకనే ఆవి డకి ఈ భాగ్యం దక్కింది. మా జీవితాలెలా కడతే రిపోతాయో.'

అపర భీష్మునిలా తెల్లనిగడ్డంతో ఉన్న ఆశ్రమ ధర్మకర్త శివాజీరావుగారు నా చేతికి ఓ మాసిపో యిన సంచీ అందించారు.

'బాబూ! ఇక్కడ వృద్ధులు ఆశ్రమంలో తమకు ఇష్టమైన పనులుచేసి సేవలు అందించినందుకు ప్రతిఫలంగా బ్యాంకు అకౌంటు తెరిచి తృణమో పణమో అందులో వేస్తుంటాం. పిల్లలకు పూర్ణమ్మ గారు సంగీత పాఠాలు చెప్పినందుకు ప్రతినెల మేము అడక్కుండానే వాళ్ళ తల్లిదండ్రులిచ్చే ప్రతిఫలాన్ని అకౌంట్‌లో వేస్తూ వచ్చాను. ఒక్కనాడు కూడా అందులో ఎంత ఉందని ఆవిడ అడగలేదు. ఎప్పు డైనా నేను చెప్పబోయినా వినిపించుకోనూ లేదు. దీనికి వారసులు మీరేననిపిస్తోంది. అందుకే పూర్ణమ్మ గారు ఇక్కడకు వచ్చినప్పుడు తెచ్చుకున్న ఈ సంచీ లోనే ఆ డబ్బంతా ఉంచి మీకు అందజేస్తున్నాను.

నేను కాదనలేదు. పూర్ణమ్మగారు చనిపోతూ నా చెవిలో చెప్పిన మాటలు ఇంకా ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి. అందుకే ఆ సంచీ అందుకొని పూజవరం వెళ్ళాలని నిశ్చయించుకున్నాను.

నాన్నగారు ఇంజనీర్ కావడం మూలాన నా చిన్నతనంలో ఎప్పుడూ ఆయన టూర్లలోనే ఉండే వారు. అందుకని పూజవరం వెళ్ళాలంటే ఓ రోజంతా ప్రయాణమే సరిపోయేది.

వర్షాకాలంలో లాకులెత్తేస్తే కాలువలలోకి గోదా వరి నీరు ప్రవహించేది కనుక అలా నీళ్ళుంటే, రాజ మండ్రిలో లాంచి ఎక్కి డైరెక్టుగా వెళ్ళేవాళ్ళం. కాలు వలో నీళ్ళు లేనప్పుడు నడిచో లేదా గుర్రపు బండెక్కో బొబ్బరలంక చేరుకుని అక్కడ నుంచి ధవళేశ్వరంలో పని ఉంటే ఒక్కోసారి నావలో అక్కడ చుట్టాలింటికి వెళ్ళి ఆ తర్వాత అక్కడ బస్సెక్కి రాజమండ్రిలో పని చూసుకునేవాళ్ళం అమ్మా నేనూను.

రాజమండ్రిలో మా మావయ్యవాళ్ళుండేవారు. తాతయ్య, అమ్మమ్మ మావయ్య దగ్గరే ఉండేవారు గానీ అత్తయ్యలకు అమ్మమ్మకి ఎప్పుడూ తగవులా టలే. సర్దుకోమంటే అమ్మమ్మ కూడా వినేది కాదు. అందుకే ఆవిడ మంచాన పడితే అమ్మే వెళ్ళి చూసు కోవలసి వచ్చేది. అప్పుడప్పుడు పిన్నివెళ్ళినా పని ఒత్తిడి వలన ఒక్కపూట మాత్రమే చూసి వెళ్ళిపోయేది.



ఇవాళ రాజమండ్రిలో బస్సెక్కి బ్యారేజి మీదుగా ఓ గంటలో పూజవరం వెళ్ళేసరికి నాకెంత ఆశ్చర్యంగా అనిపించిందో? మధ్యలో ఈ గట్టుమీంచి ఆ గట్టున ఉన్న పూజవరం వెళ్ళేందుకు కాలువ మీద ఇదివరలో ఉండే యాభై మీటర్ల కర్రవంతెన అలాగే ఉందిగానీ రాకపోకలు లేకనేమో బాగా పాతబడి పోయింది. బస్సు కూడా వెళ్తున్న ఇప్పటి ఈ కొత్త బ్రిడ్జి పటిష్టంగా ఉంది. దానిమీంచి వెళ్తున్నప్పుడు కిందకి చూశాను. వేసవి మూలాన కాలువలో నీళ్ళు లేవు. తెల్లని ఇసుక పరుచుకుని ఉంది. అక్కడ ఆడుకుంటున్న చిన్నపిల్లలను చూసి నా బాల్యం గుర్తుకు వచ్చింది.

నేనూ వేసవికాలంలో సాయంకాలాలు మా అమ్మకి చెప్పకుండా వెళ్ళి నానేస్తాలు గిరి, సుబ్బరాజు, ఉండేలు, వీరభద్రంలతో ఇసుకలో ఆడుకునే వాణ్ణి. ఎప్పుడో చాలా ఏళ్ళక్రితం అలా ఆడుకుంటున్న పిల్లలు సడెన్‌గా వచ్చిన గోదావరి నీటి ఉధృతిలో కొట్టుకుపోయారని ఆ ఊరివాళ్ళు చెప్పడం మూలానో ఏమోగానీ, మా అమ్మకి చెప్తే మాత్రం అక్కడికి వెళ్ళనిచ్చేది కాదు. ఎందుకంటే ఏ క్షణంలో అయినా లాకులు ఎత్తేస్తే గోదావరి నీరు ఉధృతంగా వచ్చేసి నేను కొట్టుకుపోతానని అమ్మకి భయం.

కానీ ఆ తర్వాత నాన్నగారు చెప్పారు అది జరిగి యాభయ్యేళ్ళకు పైనే అయిందిట. కాని వేసవికాలంలో కాదట వర్షాకాలం మొదలయ్యే ముందట. అయినాగానీ అమ్మమాత్రం 'ఏమో ఎవరు చెప్పొచ్చారు..అయినా నీకు ఆడుకోవడానికి చోటే లేదా ఇంత పెద్ద ఊళ్ళో' అనేసేది.

అందుకే దొంగతనంగా అక్కడ కాలవలోని ఇసుకలో నా నేస్తాలతో గూటీబిళ్ల, గాలిపటాలాటలు ఆడుకుని గప్‌చిప్‌గా ఇంటికెళ్ళిపోయేవాళ్ళం. ఒకసారి ఉండేలూ వాళ్ళ మావయ్య పొరుగూరెళ్ళి వస్తూ వాణ్ణి మాతో అక్కడ చూసి ఇంటికెళ్ళాక వీపు చీరేశాడు. అప్పటి నుండి వాడు మాత్రం అప్పుడప్పుడు మాత్రమే వచ్చేవాడు.

ఉండేలు అసలు పేరు రాఘవరావు. మేం ఊరి చివర మామిడి తోటల్లో తిరుగుతున్నప్పుడు చిటారు కొమ్మన ఉన్న మామిడి పిందెలు కోసేందుకు వాడు చెట్టుకొమ్మ ఆకారంలోని చిన్న కర్రముక్కకి సైకిలు టైరులోని మెత్తని ట్యూబు ముక్క కట్టి దానికి రాయికట్టి వెనక్కిలాగి వదిలితే ఆ రాయి తగిలి మామిడికాయలు తెగిపడేవి. అందుకని వాడికి ఉండేలని పేరు పెట్టాం.

ఒకసారి ఉండేలుతో కొట్టిన రాయి దెబ్బ తగిలి ఒక పిచ్చుక కిందపడిపోయింది. దాని బాధ చూసి మేమంతా ఎంతో కంగారు పడిపోయాం. నేను ఆ పిచ్చుకను జాగ్రత్తగా ఓ తాటాకు బుట్టలోకి ఎక్కించి మా ఇంటికి తీసుకెళ్ళి పెరట్లో పెడుతుంటే మా అమ్మ చూసి గట్టిగా తిట్టింది. నేను ఏడవడం చూసి 'పిచ్చి సన్నాసీ! అలా కింద పెట్టేస్తే ఏ పందికొక్కో వచ్చి తినేస్తుందిరా' అంటూ వరండాలోనే భద్రంగా ఓ గాలి తగిలే బుట్టకింద పెట్టించి దానికి తను కూడా రోజూ సేవలు చేసేది. వారమయ్యేసరికి ఆ పిచ్చుక నెమ్మదిగా ఎగరడం మొదలెట్టింది. నేను ఎంతో సంబరపడిపోయేవాణ్ణి. ఇంటికొచ్చాక నాకు రోజూ ఆ పిచ్చుకతోనే కాలక్షేపం.

అది బాగా తేరుకోవడం చూసి ఒకరోజు నేను స్కూలునుంచి ఇంటికి వచ్చేలోగానే దాన్ని చెట్టు మీద వదిలేస్తే అది రివ్వున ఎగిరిపోయిందిట. కానీ నాకు చెప్పకుండా మా అమ్మ అలా పిచ్చుకను వదిలేసిందనే కోపంతో నేను మాత్రం ఓ పూటంతా అన్నం తినకపోవడం నాకింకా గుర్తుంది.

ఇది వరకు వేప, కొబ్బరి చెట్లతో పాటు వీధికో రెండు మామిడిచెట్లైనా కనిపించేవి. కాని ఇవాళ ఎంత నడిచినా నాకు ఊళ్ళో ఏ చెట్టూ కనిపించలేదు. వాటి స్థానంలో బిల్డింగులు వచ్చేశాయి. అయితే అవి సిటీలో కంటే అందంగా చక్కని డిజైన్లతో ఉన్నాయి.

ఊళ్ళోకి అడుగు పెట్టగానే రాములవారి గుడి కనిపించింది. దణ్ణం పెట్టుకున్నాను. అక్కడ శ్రీరామ నవమి ముందు తాటాకు పందిళ్లు వేసి డేరాలు కట్టి చక్కగా ముగ్గులు పెట్టేవారు. పగలు రాముల వారికి పూజలు, వడపప్పు పానకం ప్రసాదం కోసం ఎగబడేవాళ్ళం.

రాత్రిళ్లు ఆ తొమ్మిదిరోజులు పోతులూరి వీరబ్రహ్మంగారి బుర్రకథలు, శ్రీకృష్ణకుచేల హరికథలు, పాండవోద్యోగ విజయాలు, గయోపాఖ్యానం, బాల నాగమ్మ నాటకాలు, ఎంతో కన్నుల పండువగా ప్రదర్శించేవారు. సాయంకాలమయ్యేసరికి నాటకాలు వేసేవాళ్ళు ముఖాలకు రంగులు వేసుకుని, గిల్టునగలు పెట్టుకుని రకరకాల విగ్గులతో తయారవుతుంటే డేరాల కన్నాల చాటు నుంచి పిల్లలమంతా ఎగబడి చూసేవాళ్ళం. తర్వాత ఇళ్ళకు పరుగెత్తుకెళ్ళి పిల్లలమంతా త్వరగా అన్నాలు తినేసి చాపలో, బొంతలో పట్టుకుని వచ్చి ముందే సీట్లు రిజర్వు చేసుకునేవాళ్ళం. పెద్దవాళ్ళు ఇళ్ళల్లో పనులు చక్కబెట్టుకుని తీరుబడిగా వచ్చేవారు. తెల్లవార్లూ నాటకం అవుతూనే ఉండేది.

ఒక్కోసారి హార్మోనియం ధ్వనుల మధ్య ఏ అర్జునుడో కృష్ణుడో పద్యం అందుకుంటే అతగాడు ఎంతసేపు దీర్ఘం తీస్తాడో లెక్క చూడడం కోసం పిల్లలం ఇళ్ళవరకు పరుగెత్తుకెళ్ళి వచ్చేవాళ్ళం. మేం మళ్ళీ తిరిగి వచ్చేవరకు అతగాడి ఆలాపన దీర్ఘంగా అలా కొనసాగుతూనే ఉండేది.

ఇప్పుడు కూడా శ్రీరామనవమి ఉత్సవ సమయమనో ఏమో గుడికి చక్కగా రంగులు వేశారు. అయితే ఇదివరకు గుడిచుట్టూ ఉండే పెద్ద ఖాళీ స్థలం లేదు. ఇప్పుడక్కడ చిన్న చిన్న ఇళ్ళు వెలిశాయి.

అసలు ఆ నాటక ప్రదర్శనలు ఇప్పుడు చేస్తున్నారో? లేదో?

నేను మాస్టారు ఉండే ఇల్లు వెతుక్కుంటూ నడుస్తున్నాను. గుడికి నాలుగువీధుల వెనకే మాస్టారి

## పరిణీతి ప్రేమాయణం!

*అక్క ప్రియాంకాచోప్రా హాలీవుడ్‌ని ఓ వైపునుంచి దున్నేస్తుంటే చెల్లెలు పరిణీతి మాత్రం ఒంటరితనం భరించలేక ఓ అసిస్టెంట్ డైరెక్టర్‌తో ప్రేమలో పడింది. అక్క అండదండలతో బాలీవుడ్‌లోకి ప్రవేశించి స్వయం కృషితో స్టార్ హీరోయిన్ రేంజ్‌కి ఎదిగిన పరిణీతికి అక్క బుద్ధులు అస్సలు రాలేదని బాలీవుడ్ జనాలు అంటున్నారు. అక్క కెరీర్ గురించి ఆలోచిస్తుంటే, చెల్లెలు తోడూ గీడూ అంటూ కెరీర్‌ని అటకెక్కించే పనిలో పడిందంటున్నారు. కొత్తగా ఓ అసిస్టెంట్ డైరెక్టర్‌తో పరిణీతి డేటింగ్ చేస్తోందట! ఈ విషయాన్ని ఆమె స్వయంగా చెప్పడంతో ఇది బాలీవుడ్‌లో హాట్ టాపిక్ అయిపోయింది. అసిస్టెంట్ డైరెక్టర్‌తో సహజీవనం చేస్తున్నానంటూ చెప్పిన పరిణీతి అతగాడి పేరు మాత్రం రహస్యంగానే ఉంచింది. అతగాడు ఎవరా? అన్న విషయాన్ని కూపీలాగే పనిలో కొందరు తెగ బిజీగా ఉన్నారట కూడా!*



## అవి చేయలేక నో అందట!

కలర్స్ స్వాతికి సినీరంగంలో ఓ మంచి ఇమేజ్ ఉంది. చిలిపి అమ్మాయి పాత్రలు, పక్కింటి అమ్మాయి పాత్రలు, నటనకు అవకాశం ఉన్న పాత్రలు అయితే స్వాతి దున్నేస్తుంది అంటారు. అంత టాలెంట్ ఉన్న స్వాతికి ఉన్నట్టుండి అవకాశాలు తగ్గిపోయాయి. కారణాలు ఏమైనా తెర మీద స్వాతిని చూసి చాలా కాలమే అయింది. తిరిగి స్వాతిని తెలుగు తెర మీద చూపించడానికి దర్శకనిర్మాతలు తెగ ఉత్సాహం చూపించారు. వారి ఉత్సాహం చూసి స్వాతి కూడా ఉత్సాహ పడింది. అంతలోనే ఆమె ఉత్సాహం మీద నీళ్ళు చల్లేశారు ఆ దర్శకనిర్మాతలు. ఇంతకీ అసలు సంగతేమిటంటే...ఆ సినిమాలో ఇంటిమేట్ సీన్లు కొద్దిగా ఎక్కువగానే ఉంటాయని చివరికి చెప్పారట! అన్నీ ఓకే అనుకున్న తరువాత ఈ విషయం చెప్పడంతో స్వాతి ఆ సినిమా చేయలేను అని చెప్పేసిందట! స్వాతిని కొత్త తరహాలో చూపిద్దామని ముచ్చట పడిన ఆ దర్శకనిర్మాతలు చివరికి నిరాశతో వెనుతిరగవలసి వచ్చిందట!

పెద్ద పెంకుటిల్లు ఉండేదని జ్ఞాపకం. అయితే ఇప్పుడు నాకు దాని స్థానంలో పెద్ద బిల్డింగ్ కనిపించింది. అందులో వాళ్ళని అడిగితే మాస్టారు చనిపోగానే ఆ ఇల్లు పట్నం వాళ్ళెవరో కొనుక్కున్నారట. దానిని పడగొట్టి ఈ బిల్డింగుకట్టి వాళ్ళు కూడా వేరే వాళ్ళకి అమ్మేశారట. అందుకే మాస్టారి పిల్లల వివరాలు ఆ ఇంట్లో వాళ్ళు చెప్పలేకపోయారు. నేను నిరాశగా రెండు వీధులు దాటగానే ఎవరో పిలుస్తున్నట్టనిపించి వెనక్కి తిరిగి చూశాను. ఓ పదేళ్ళ వయసు పిల్లాడు పరుగెత్తుకొస్తున్నాడు. 'అంకుల్! మీ పేరు వాసుదేవరావేనా?'

'అవును ఏం? నేను నీకెలా తెలుసు?'

'నాకు కాదు, మా పెదనాన్నగారికి తెలుసట.. మీరు ఆ ఎదురింట్లోకి వెళ్ళడం కిటికీలోంచి మా పెద్దనాన్న చూశారట. మిమ్మల్ని తీసుకురమ్మంటున్నారు. నాకాశ్చర్యం కలుగలేదు. బహుశా మాస్టారి గురించి తెలిసినవాళ్ళై ఉంటారు. ఇంకా అక్కడక్కడా ఉన్న పెంకుటిళ్ళను చూస్తుంటే, సిటీ తరహాలో ఈ ఊళ్ళో బిల్డింగులు వెలసినాగానీ అదింకా పల్లెటూరు వాసనలు వదులుకోలేదన్నట్టే అనిపిస్తోంది.

ఆ కుర్రాడు నన్ను మాస్టారి ఎదురింట్లోకి తీసుకెళ్ళాడు. అది కూడా పాతకాలం పెంకుటిల్లే. ఒకప్పుడు అందులో ఆ ఊరి కరణంగారుండేవారు. వాళ్ళిల్లు కూడా సెలవులకి ఎప్పుడూ పట్నం నుంచి వచ్చేపోయే బంధువులతో కళకళ్లాడుతూ ఉండేది. ముందు గది దాటివెళ్ళగానే ఆకాశం కనిపిస్తున్న పెద్ద మండువా, మండువా చుట్టూ గదులూ ఉన్నాయి. మాస్టారిల్లూ ఇలాగే ఉండేది. మండువాలో మాస్టారి పడక్కుర్చీ ఉండేది. అది ఖాళీగా ఉన్నా ఎవరూ కూర్చునేవారు కాదు. సాయంకాలాలు మాకు ప్రైవేట్లు చెబుతున్నప్పుడు మాస్టారు మాత్రమే కూర్చునేవారు. ఉదయం సమయంలో అక్కడే ఉన్న పెద్ద రేడియో పెట్టుకుని ఆయన వినే వార్తలు మా ఇంట్లోకి కూడా వినిపించేవి. అప్పట్లో ఇంట్లో అంత పెద్ద రేడియో ఉండడం హోదాకి చిహ్నం. ఊరంతటికీ కరణంగారింట్లోనూ మాస్టారింట్లోనే రేడియో మోగేది. మండువా చుట్టూ ఉన్న గదిలో అద్దాల చెక్క బీరువాలో ఓ అరలో మందపాటి అట్టతో రామాయణ భారత భాగవతాది గ్రంథాలుండేవి. కింది అరలో చందమామలు, బాలమిత్రలు ఉండేవి. నేను పెద్దమ్మగారిని అడిగి కథల పుస్తకాలు తీసుకెళ్ళి చదువుకునేవాణ్ణి. పుస్తకం మాత్రం అట్టనలగకుండా తెచ్చివ్వాలి. అదీ పెద్దమ్మగారి షరతు. అందుకే ఆ పుస్తకాలన్నీ ఎప్పుడూ కొత్తగానే ఉండేవి.

'అంకుల్, అదిగో పెదనాన్నగారు అక్కడ ఉన్నారు వెళ్ళండి' మండువాను అనుకుని ఉన్న వీధి వైపు గది చూపించి ఆ కుర్రాడు తుర్రుమన్నాడు. అక్కడ కుర్చీలో కూర్చున్న వ్యక్తిని ఎక్కడో చూసినట్టనిపించింది.

'నేను వీరభద్రాన్ని మీరు.. నువ్వు వాసువే కదూ! రా కూర్చో..' ఓ బట్టతల వ్యక్తి తన ఎదురుగా ఉన్న కుర్చీ చూపించాడు.

అతని ముఖంలోని పోలికలను కూడదీసుకుని ఆనందంతో 'నువ్వా వీరభద్రం! ఎన్నాళ్ళైంది నిన్ను చూసి. మనం చదువుకునేప్పుడు నువ్వు గుడి వెనుక వీధిలో ఉండేవాడివి కదూ!'

అప్పుడు గుర్తొచ్చింది నాకు వీరభద్రం నాన్నగారు ఆ ఊళ్ళోనే కిరాణా కొట్టు నడిపేవారు. ఊరంతటికీ అదొక్కటే కొట్టు..

'అవును వాసూ! వ్యాపారం బాగా ఉండడంతో ఈ ఇల్లు పదేళ్ళ క్రితం కొనుక్కున్నాను. కరణం గారు పోయాక వాళ్ళ పిల్లలు అంతా దూరాల్లో సెటిలవడం మూలాన దీన్ని అమ్మేశారు.'

'ఇంత పెద్దైపోయాను కదా... నన్నెలా గుర్తుపట్టావు?" నవ్వుతూ వీరభద్రం చేతులు పట్టుకుని ఆనందంతో అడిగాను.

'నీ నుదుటిమీద ఆ పెద్ద మచ్చ చూసి. అయినా నీలో పెద్ద మార్పేమీ లేదులే' అంటూ నవ్వాడు భద్రం.

మానాన్నగారు ఓ పదిరోజులు క్యాంప్‌కెళ్ళినప్పుడు చిన్నప్పుడు నాకు వాతరోగం వస్తే ఓ నాటు వైద్యుడు నా నుదుటిమీద, పొట్టమీద వాతలు పెట్టారట. మానాన్నగారు ఊరినుంచి వచ్చాక వాణ్ణి జైల్లో పెట్టిస్తానని కొట్టినంత పనిచేశారని మా అమ్మ చెప్పేది. ఆ మచ్చ మాత్రం నా నుదుటిమీద శాశ్వతంగా ఉండిపోయింది.

'నువ్వు మాత్రం బాగా మారావు. ఈ పొట్ట, ఆ ఒళ్లు, బట్టతల నిన్ను వీధిలో చూసి ఉంటే ఏ మాత్రం గుర్తుపట్టలేకపోయేవాణ్ణి.'

'నేను వీధిలోకి  తిరిగే పరిస్థితి లేదులే. కీళ్లవాతంతో నా కాళ్లు చచ్చుబడిపోయాయి. అందుకే రోజంతా నాకు ఇలా కిటికీలోంచి వీధిలో వచ్చేపోయేవాళ్ళను చూడడమే కాలక్షేపం.'

అప్పుడు గమనించాను వీరభద్రం కూర్చున్నది చక్రాల కుర్చీలో అని. నా మనసు నీరైపోయింది. లోపలినుంచి పనిపిల్ల స్టీలు గ్లాసుల్లో కాఫీలు తెచ్చింది.

'తీసుకో, మేమింకా పల్లెటూరి వాళ్ళమే.. పింగాణీ కప్పులు వాడం' నవ్వాడు వీరభద్రం.

కాఫీ తాగుతూ మేమిద్దరమూ తనివితీరా అప్పటి ఆటపాటలు, స్నేహితుల గురించి చిన్ననాటి కబుర్లు చెప్పుకున్నాం. లెక్కలు సరిగ్గా రాని మా నేస్తం సుబ్బరాజు కలకత్తాలో బ్యాంకు ఆఫీసరయ్యాడట.

ఉండేలు వైజాగ్‌లో టీచరుగా పనిచేస్తున్నాడట.

ఆ మాటల్లోనే మాస్టారి గురించి ఎన్నో విష యాలు చెప్పాడు వీరభద్రం.

మాస్టారి పెద్ద కొడుకు పెళ్ళికాకముందే ఏక్సి డెంట్‌లో పోయాడట. రెండో కొడుకు ఆఫీసరే అయినా, ఇల్లరికం వెళ్ళిపోయాడట. ఏనాడూ తల్లి దండ్రులవంక తిరిగి చూడలేదుట. కూతురికి పెళ్ళి చేసిన నాలుగోయేటే వైధవ్యం. ఆవిడ ఇప్పుడు ఇద్దరు పిల్లలతో రాజమండ్రిలో ఉంటోందిట. మాస్టారు పక్షవాతంతో పోయాక అన్నపూర్ణమ్మగారు బాగా డీలా పడిపోయారట.

భోజనం చేస్తుంటే చెప్పాడు భద్రం.

'ఆఖరివాడు మాధవ్‌కి చదువు సరిగ్గా అబ్బ లేదు కదా..ఏదో చిన్న చిన్న వ్యాపారాలు చేసి దెబ్బ తిన్నాడు. మాస్టారు రిటైరయ్యాక వచ్చిన డబ్బు కూడా వ్యాపారంలో తగలేశాడు. దీనికి సాయం చిన్న కోడలు గంపగయ్యాళిరా. పాపం ఓపిక లేక పోయినా వేణ్ణీళ్ళకు చన్నీళ్ళు సాయం అన్నట్టు మాస్టారి భార్య సంగీతం పాఠాలు చెబుతున్నా గానీ కోడలు ఆవిణ్ణి ఎంతో రొస్టు పెట్టేసేది. నాలు గేళ్ళ క్రితం ఇంట్లో మొగుడూ పెళ్ళాలకు ఏం గొడ వయ్యిందో ఏమోగానీ, ఒకరోజు మాధవ్, తన తల్లి కాశీ చూడాలనుకుంటోందని తీసుకెళ్తున్నానని చెప్పాడు. రెండురోజుల్లో తిరిగివచ్చి ఆవిడ అక్కడే శేషజీవితం గడుపుతానని భీష్మించుకుంటే చేసేదిలేక తిరిగి వచ్చానని చెప్పాడు. ఓనెల తర్వాత మళ్ళీ ఊరెళ్ళి తిరిగి వచ్చి ఆవిడ అక్కడే కాలం చేస్తే కర్మ కూడా చేసి వచ్చానని ఊళ్ళో వాళ్ళందరికీ చెప్పాడు. ఏది ఎంతవరకు నిజమో మాకెవరికీ తెలియదు. పోనీలే పాపం బ్రతికి మాత్రం ఆవిడ ఇక్కడ ఏం సుఖ పడిందని.'

వీరభద్రం మాటలకు నాగుండె బరువెక్కి పోయింది. 'తల్లిదండ్రులమీద దయలేని పుత్రుండు/ పుట్టనేమివాడు గిట్టనేమి/పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా/విశ్వదాభిరామ వినురవేమ' అని వేమన అన్నట్టు కలికాలంలో కొడుకులు మరీ ఇంత నిర్ద యగా ఉన్నారా?

ఆవిడ అంతిమ సంస్కారం నేనే చేశానని భద్రా నికి చెప్పి ఊళ్ళో పూర్ణమ్మగారి ఆత్మకు క్షోభ కలిగిం చడం సరికాదనిపించింది.

ఇంతకీ వేణుమాధవ్ ఎక్కడున్నాడు భద్రం!

'రాములవారి గుళ్ళోనే అరుగుమీద ఎవరు ఛస్తారా అని గుంటనక్కలా కూర్చుని ఉంటాడు చూడు. ఎక్కడో వచ్చిరాని నాలుగు సంస్కృతం ముక్కలు ముక్కునబట్టి అపరకర్మలు చేసుకుంటున్నాడులే. వచ్చిన డబ్బు రాత్రికి రాత్రి ఏం చేస్తాడో ఏమో మళ్ళీ మామూలే. పెళ్ళాం మాత్రం పిల్లల్ని తీసు కుని శాశ్వతంగా పుట్టింటికి వెళ్ళిపోయిందని చెప్పు కుంటారు మరి. అయినా నువ్వు వాణ్ణి చూడ కుండా ఉంటేనే మంచిదిరా.' అన్నాడు భద్రం. నేను నవ్వాను.

'మరి నేను వస్తానురా.. మళ్ళీ ఎప్పుడైనా కలుద్దాం'

'ఏమో ఈసారి నువ్వొచ్చేటప్పటికి నేనుంటానో లేదో..?' విచారంగా అన్నాడు వీరభద్రం.

'ఛ అవేం మాటలురా?'

'ఏమోరా ఎప్పుడూ ఇలాగే తిని కూర్చోవడం వల్లనో ఏమో మొన్న ఆరోగ్య పరీక్షలు చేయించుకున్న ప్పుడు గుండెలో బ్లాకులున్నాయన్నారు డాక్టర్లు.

'ఈ కాలంలో అదో పెద్ద జబ్బు కాదులే. బోలెడు మందులొచ్చాయి. భయపడకు.' అంటూ భద్రం భుజం తట్టి బయటికి నడిచాను.

రాములవారి ఆలయంలో పీచులాంటి తల నెరిసిపోయిన వ్యక్తే మాధవ్ అంటే నమ్మలేకపో యాను. నన్నూ అతడు గుర్తుపట్టలేదు.

నేను అపరకర్మలు చేయించుకోవడానికి పట్నం నుంచి తనను వెతుక్కుంటూ వచ్చిన ఎవరో కొత్త వ్యక్తిని అనుకున్నాడు. చనిపోయిన వారి ఆత్మకు శాంతి కలిగించే దానాల చిట్టా విప్పాడు. మా అమ్మానాన్నల కర్మలు చేసిన అనుభవమున్న నాకు, వేణుమాధవ్ చెప్పేదాంట్లో సగం అబద్ధాలే అని అర్థమైపోయింది.

అతగాడు చెప్పినవాటి ఖర్చు ఇరవై వేలు పైచి లుకే. శుద్ధశ్రోత్రియ కుటుంబంలో పుట్టి పదిమందికి అన్నంపెట్టిన తల్లినీడలో పెరిగిన ఒక గణిత పండి తుని కొడుకు ఇలా అబద్ధాలతో బ్రతకడం చూసి నాకు తల తిరిగిపోయింది.

'ఇదిగో ఈ సంచీలో మీరు కర్మ చేయవలసిన వ్యక్తి వివరాలు, డబ్బు ఉన్నాయి' పూర్ణమ్మగారి సంచీ వేణుమాధవ్ చేతిలోపెట్టి వెళ్ళిపోతుంటే, నా వెనక అతని అరుపులు స్పష్టంగా వినిపిస్తున్నాయి.

'ఇదిగో ఏవండోయ్! నేను డబ్బు లెక్క చూసు కోకుండానే మీరు వెళ్ళిపోతే ఎలా?'

అయినా నాకు వెనక్కి తిరగాలనిపించలేదు.

ఎందుకంటే ఆ సంచీలో ఉన్న పూర్ణమ్మగారి ఫోటో, కన్నకొడుక్కి పూర్ణమ్మగారు రాసి పోస్ట్ చెయ్యని ఉత్తరం, ఇరవై వేల రూపాయల డబ్బు చూశాకైనా మాధవ్ మారతాడని నాకు నమ్మకం కలగలేదు.

పూర్ణమ్మగారి ఉత్తరంలోని వాక్యాలు మాత్రం నన్ను మరిగిస్తున్నాయి.

'నాన్నా మాధవ! ఆనాడు స్వయంగా నువ్వే నన్ను ఇక్కడ దిగవిడిచి వెళ్ళిపోయావని నేను ఎవ్వ రికీ చెప్పలేదులే నాన్నా! పోయేలోగా నిన్ను కళ్ళారా చూడాలని నా మనసు తపించిపోతోందిరా. ఇన్నేళ్ళూ ఇక్కడ సంగీతం పాఠాలు చెప్పిన డబ్బు ఇదిగో. నేను పోయాక నా కర్మ చేసేందుకు నీదగ్గర డబ్బు లుంటాయోలేదో అని దాచి ఉంచాను నాన్నా..! ప్రేమతో అమ్మ.

ఎన్ని తప్పులు చేసినా ఉన్న ఊరులాగే కన్న తల్లి కూడా బిడ్డల్ని కడుపులో దాచుకుంటుంది మరి.

ఇలాంటి బిడ్డలుంటారనేమో లక్కలాంటి తల్లి రాయివంటి బిడ్డ అన్నారు మన పెద్దలు.

ఆదిశంకరుల వారి పలుకులు అక్షర సత్యాలు..

'కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి'

ఎందుకంటే తల్లి తన సంతాన సంక్షేమానికీ పురోభివృద్ధికీ తాను చేయగలిగినదంతా చేస్తుంది తాను అశక్తురాలైనా అనుక్షణం వారి అభ్యుదయా నికే భగవంతుణ్ణి ఆరాధిస్తుంది.

సెల్: 94400 55311

## కిమ్‌శర్మ పెళ్ళి పెటాకులైందట!

'ఖడ్గం'లో నటించిన కిమ్ శర్మను మరచి పోవడం అంత ఈజీ కాదు. తన టాలెంట్‌తో టాలీవుడ్, బాలీవుడ్‌లలో మంచి పేరు తెచ్చుకున్న కిమ్ శర్మ తన కెరీర్‌కి హఠాత్తుగా ఫుల్‌స్టాప్ పెట్టే సుకుంది. రెండు సంవత్సరాల క్రితం కెన్యాలోని ఓ వ్యాపారవేత్తను పెళ్ళి చేసుకుని అతగాడితో వెళ్ళి పోయిన కిమ్‌శర్మ ముంబాయిలో దర్శనమిచ్చింది. పాత పరిచయస్థులను కలవడానికి కిమ్‌శర్మ ముంబాయికి వచ్చి ఉంటుంది అనుకున్నారట కానీ...భర్తతో విడాకులు తీసుకుని శాశ్వతంగా ఇండియాకి తిరిగి వచ్చేసిందట కిమ్‌శర్మ. కిమ్ భర్త అక్కడ వేరే స్త్రీతో సంబంధం పెట్టుకోవడంతో కిమ్ అతగాడితో విడిపోయిందట! కిమ్ కావాలనే విడాకులు తీసుకోవడంతో భర్త నుంచి ఎలాంటి భరణం కూడా రాలేదట! ప్రస్తుతానికి చేతిలో డబ్బుల్లేక గత పరిచయస్థుల దగ్గరకి వెళ్ళి వేషాలు ఇమ్మని అడుగుతోందట! ఒకప్పుడు కిమ్ శర్మ డేట్ల కోసం దర్శకనిర్మాతలు ఆమె ఇంటి చుట్టూ ప్రదక్షిణలు చేస్తే ఇప్పుడు ఆమె చేస్తోందనీ, 'బళ్ళు ఓడలు కావడం... ఓడలు బళ్ళు కావడం అంటే ఇదే' అంటున్నారు బాలీవుడ్ జనాలు.









# దుబాయ్ 'అల్లాఉద్దీన్'

**తీవ్రవాదం, గల్ఫ్ యుద్ధం ప్రభావంతో ప్రశ్నార్థకంలో పడిపోయిన దుబాయి ఉనికిని సరికొత్త కోణంలో ప్రపంచానికి చాటిచెప్పే ప్రయత్నం చేస్తున్నాడో కుర్రాడు. మాదక ద్రవ్యాలు, మగువలతో విలాసాల్లో మునిగితేలే దుబాయి రాచరిక జీవన చిత్రాన్ని విభిన్న రంగుల్లో ఆవిష్కరిస్తున్న ఆ నవ యువ రాకుమారుడు... 'హమ్‌దాన్'.**

అరేబియా దేశాల కొత్త తరం యువతకు ప్రతీకగా నిలుస్తూ, ప్రిన్స్ విలియమ్స్, కేట్‌లను మించి మూడున్నర మిలియన్ల ఇన్‌స్టాగ్రామ్ సబ్‌స్క్రైబర్లను సొంతం చేసుకున్న ఈ 33 ఏళ్ళ 'క్రౌన్ ప్రిన్స్' ఫోర్బ్స్ మ్యాగజైన్ 'హాటెస్ట్ యంగ్ రాయల్స్' లిస్ట్‌లో చోటు దక్కించుకున్నాడు. అతని లైఫ్ స్టయిల్, అభిరుచులు, దైనందిన కార్యకలాపాలు...అన్నీ ఉత్సుకతను రేకెత్తించేలా ఉంటాయి.

'హమ్‌దాన్ బిన్ మొహమ్మద్ బిన్ రషీద్ అల్ మక్తూమ్'... ఇంత పొడవాటి పేరు పలకటానికి ఇబ్బంది పడకూడదనేమో తన కలం పేరు 'ఫజా'నే పాపులర్ చేసుకున్నాడు హమ్‌దాన్. తీరిక వేళల్లో కవితలు రాసే ఈ రాకుమారుడికి ప్రకృతన్నా, జంతువులన్నా, బంధువులన్నా మహా ప్రీతి. ప్రయాణాలు, సాహసక్రీడల్ని ఇష్టపడే హమ్‌దాన్ సాహసాలు, శక్తిసామర్థ్యాలతో కూడుకున్న 160 కిలో మీటర్ల 'ఎండ్యురెన్స్ రైడ్'లో 41 దేశాలతో పోటీపడి మొదటి స్థానంలో నిలిచాడు. ఇతని గురించి తెలుసుకోవటానికి ఇంకా చాలా విశేషాలే ఉన్నాయి...



### క్రౌన్ ప్రిన్స్ ఆఫ్ దుబాయ్

దుబాయ్ రూలర్ 'షేక్ మొహమ్మద్ బిన్ రషీద్ అల్ మక్తూమ్, షేక్ హింద్ బింత మక్తూమ్ బిన్ జుమా అల్ మక్తూమ్ దంపతుల 13 మంది పిల్లల్లో హమ్‌దాన్ ఒకడు. రాజుగారి మొత్తం 23 మంది సంతానంలో హమ్‌దాన్ మూడోవాడు. ఇతని అన్న షేక్ రషీద్ బిన్ మొహమ్మద్ 2015, సెప్టెంబరులో గుండెపోటుతో చనిపోవటం, పెద్దన్న రషీద్‌కు పాలనాపరమైన అర్హతలు కొరవడటంతో హమ్‌దాన్ దుబాయి రాజ సింహాసనాన్ని అధిష్ఠించబోయే రాకుమారుడయ్యాడు.

### బ్రిటీష్ రాజ కుటుంబీకులు చదివిన కాలేజిలోనే...

దుబాయి ప్రభుత్వ మగపిల్లల పాఠశాలలో ప్రాథమిక విద్యనభ్యసించిన ఫజా తన తండ్రిలాగే ఇంగ్లండ్‌లోని శాండ్‌హర్స్ట్ మిలిటరీ అకాడమీలో గ్రాడ్యుయేషన్ పూర్తి చేశాడు. తర్వాత లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో ఎకానమీలో స్పెషలైజ్‌డ్ ట్రైనింగ్ కోర్సులు పూర్తి చేశాడు. ఉన్నత చదువులు పూర్తి చేసిన హమ్‌దాన్ చదువు అవసరం, విలువ గురించి చెబుతూ... 'జీవితానికి విద్య ఎంతో అవసరం... జీవితంలోని ప్రతి అంశంతో విద్య ముడిపడి ఉంటుంది. దుబాయిలో, తర్వాత ఇంగ్లండ్‌లో సాగిన నా విద్య ప్రపంచం పట్ల నా దృక్పథాన్ని విస్తృతం చేసింది' అన్నాడు.

### సామాజిక స్పృహ

2009లో దుబాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌కు ఛైర్మన్‌గా నియమితుడయ్యాడు హమ్‌దాన్. ఇతను దుబాయి స్పోర్ట్స్ కౌన్సిల్‌లో మెంబర్ కూడా! యువ వ్యాపారవేత్తల షేక్ మొహమ్మద్ బిన్ రషీద్ ఎస్టాబ్లిష్‌మెంట్‌కు, దుబాయి ఆటిజం సెంటర్‌కు ఇతనే హెడ్. తన బాధ్యతల్లో భాగంగా స్మార్ట్ గవర్నమెంట్ ప్రోగ్రామ్ అనే కొత్త ఇనిషియేటివ్‌కు శ్రీకారం చుట్టాడు. ఈ ప్రోగ్రామ్ ఫలితంగా యుఎఈ ప్రభుత్వానికి ప్రజలకు మధ్య దూరం మరింత తగ్గింది. ఇది హమ్‌దాన్ సాధించిన రాజకీయ విజయాల్లో చెప్పుకోదగినది.

> **హమ్‌దాన్ పెట్ లవర్ కూడా! పిల్లి నుంచి పులిదాకా ఇతని దగ్గర ఎన్నో జంతువులున్నాయి. అవేంటంటే...**
>
> తెల్ల పులి...'ఎల్సా'.
>
> ఏనుగు...'రాజన్'
>
> గుర్రం...'అవ్‌జాన్'.
>
> తెల్ల సింహాలు...'ఘోస్ట్, ఫ్లేమ్'.

### అద్భుతమైన ఫొటోగ్రాఫర్

ఫజాకు ఫొటోగ్రఫీ అంటే ప్రాణం. 2011లో తన పేరుతోనే స్వయంగా 'హమ్‌దాన్ ఇంటర్నేషనల్ ఫొటోగ్రఫీ అవార్డు' అనే పోటీ కూడా మొదలుపెట్టాడు. ఈ పోటీ ప్రైజ్ మనీ 'లక్షా ఇరవై వేల డాలర్లు'. ఈ పోటీ ఐదు వేర్వేరు కేటగిరీల్లో జరుగుతుంది. దీన్లో తనూ పాల్గొంటూ ఉంటాడు. ఫజా ఫొటో పవర్ తెలియాలంటే ఒకసారి అతని ఇన్‌స్టాగ్రామ్‌లోకి తొంగి చూడాలి.

### ఆశ్చర్యపరిచే క్రీడాకారుడు

41 దేశాలు, 227 మంది రైడర్లు, 160 కిలో

మీటర్ల ప్రయాణం...దారి పొడవునా సాహసాలతో నిండిన ఎండ్యురెన్స్ రైడ్‌లో పాల్గొని గోల్డ్ మెడల్ సొంతం చేసుకున్నాడు హమ్‌దాన్. బురదలో పాకటం, గోడలు దూకటం, టైర్లు మోయటం, ఎడారి ఇసుకలో పరుగెత్తటం... ఇలా ఒకటేమిటి? రకరకాల కష్టతరమైన హర్డిల్స్ దాటుకుని మొదటి స్థానంలో నిలిచి ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచెత్తాడు హమ్‌దాన్. నీటి అడుగున ఊపిరి బిగబట్టి ఉండగలిగే సామర్థ్యం ఉన్నవాళ్ళే ఎంచుకునే క్రీడ ఫ్రీడైవింగ్‌లో ఇతను సిద్ధహస్తుడు కూడా! స్విమ్మింగ్, సైక్లింగ్, స్నోబోర్డింగ్, రన్నింగ్, టెన్నిస్... ఇలా చెప్పుకుంటూపోతే హమ్‌దాన్ ఆడని ఆటలకు అంతే లేదు.

### చారిత్రక క్రీడ 'ఫాల్కనీ'కి పూర్వవైభవం

ఎమిరేట్స్ సంప్రదాయ క్రీడ 'ఫాల్కనీ'. అంటే... గద్దల్ని పెంచి కుందేళ్ళు, ఇతర పక్షుల్ని వేటాడేలా శిక్షణ ఇవ్వటం దుబాయి సంస్కృతిలో కీలక భాగం. అయితే పట్టణీకరణ, ఎడారి నేల తగ్గిపోతుండటంతో ఈ క్రీడ మరుగున పడిపోతున్నది. ఇలాగే కొనసాగితే ఈ క్రీడ పూర్తిగా అంతరించిపోయే ప్రమాదం ఉందని గ్రహించిన హమ్‌దాన్ ఫాల్కనీకి పూర్వ వైభవం రప్పించేందుకు కృషి చేస్తున్నాడు. ఇందు కోసం ప్రతి ఏటా డిసెంబరు నుంచి మే నెల మధ్య కాలంలో యువ ఎమిరేట్స్ స్వయంగా పెంచి శిక్షణ ఇచ్చిన గద్దల మధ్య పోటీలు ఏర్పాటు చేస్తూ ఉంటాడు.

### అడ్రినలిన్ స్పోర్ట్స్

సాహస క్రీడల మీద మనసుపడే హమ్‌దాన్ వింగ్ వాకింగ్, ఫ్లై బోర్డింగ్, జిప్‌లైనింగ్, బుర్జ్ ఖలీఫా పైకెక్కి సెల్ఫీ తీసుకోవటం, ఏనుగులతో నీళ్ళ అడుగున డైవింగ్, గ్లేసియర్ల మీద ట్రెక్కింగ్... ఇలా రోమాలు నిక్కబొడుచుకునే క్రీడల్లో పాల్గొనటంతో పాటు, ఒళ్లు గగుర్పొడిచే ఫీట్లు కూడా చేస్తుంటాడు.

### 'ఫజా' కలం పేరుతో కవితలు

అరబిక్ ప్రాంతీయ భాష 'నబాటీ'లో ఫజా అనే పేరుతో హమ్‌దాన్ కవితలు రాస్తాడు. ఫజా అనేది ఓ అరబ్ యోధుడి పేరు. కవితలు రాయటానికి కారణాన్ని ఓ సందర్భంలో హమ్‌దాన్ కవితాత్మకంగా ఇలా చెప్పాడు... 'కవితలతో ప్రజల హృదయాలను కొద్దిసేపటివరకైనా సంతోషపెట్టాలని, వాళ్ళ బాధలు స్వల్పకాలంపాటైనా మర్చిపోయేలా చేయాలనేదే నా ప్రయత్నం. నా ప్రజల ఆశలు, ఆశయాలు నా కవితల్లో ప్రతిబింబింపజేస్తాను'. హమ్‌దాన్ తన తల్లిదండ్రులు, అన్నల కోసం కూడా కవితలు రాశాడు.

### ప్రయాణాలంటే పిచ్చి

ఐరోపా నుంచి అమెరికా, న్యూజిలాండ్...హమ్‌దాన్ అడుగు పెట్టని దేశం లేదు. ఎక్కడికెళ్ళినా ఫొటోలు, స్నాప్‌షాట్స్‌తో ఇన్‌స్టాగ్రామ్ ఫాలోవర్లకు అప్‌డేట్స్ అందిస్తూనే ఉంటాడు. ఈ అప్‌డేట్లకు రెస్పాండ్ అయ్యేవారిలో అమ్మాయిలే ఎక్కువ. అరబిక్, టర్కిష్, ఫ్రెంచ్, స్పానిష్, ఇంగ్లీష్ భాషల్లో ప్రత్యక్షమయ్యే కామెంట్లను బట్టి హమ్‌దాన్‌కు ఎన్ని దేశాల నుంచి ఎంత ఫిమేల్ ఫాలోయింగ్ ఉందో అర్థం చేసుకోవచ్చు. ఇక హమ్‌దాన్ సెల్యూట్ చేసే స్టయిల్ కూడా డిఫెరెంట్. ఇతనిది త్రీ ఫింగర్ సెల్యూట్. ఓ సందర్భంలో సెల్యూట్‌ల అర్థాలను వివరిస్తూ పాశ్చాత్య దేశాల్లో వాడే వి షేప్‌లో వేళ్లుంచే విక్టరీ సైన్‌కంటే బొటన వేలు, చూపుడు వేలు, మధ్యవేలుతో సెల్యూట్ చేయటం బెటర్ అని చెప్పాడు. ఈ మూడు వేళ్లు... విజయం, ఘనత, ప్రేమకు చిహ్నాలని చెప్పుకొచ్చాడు. 'మన అరబ్బులకు ఓ ఘన చరిత్ర ఉన్నప్పుడు ఇంకొకర్ని అనుసరించాల్సిన అవసరం ఏముంది?' అని తన సెల్యూట్ స్టయిల్ గురించి వివరణ కూడా ఇచ్చాడు హమ్‌దాన్.

–గోగుమళ్ల కవిత

## ఔరా! దుబాయ్

దుబాయి అనగానే బంగారం, ఖరీదైన కార్లు, ఆకాశాన్నంటే సౌధాలు గుర్తొస్తాయి. ఇవే కాదు, ఇంతకుమించిన వింతలెన్నో ఉన్నాయి ఆ దేశంలో. సాంకేతికంగా ప్రపంచ దేశాలకంటే రెండడుగులు ముందుండటం కోసం ఆ దేశం చేయని ప్రయత్నం లేదు. తమది ధనిక దేశమని ప్రపంచానికి చాటి చెప్పుకోవటానికి వీలున్న ఏ ఒక్క అవకాశాన్నీ వదులుకోని దుబాయి గురించి ఇంకొన్ని విశేషాలు...

దుబాయిలో నేరాలకు చోటు చాలా తక్కువ. అయినా దుబాయి పోలీసు వ్యవస్థ ఎప్పటికప్పుడు అప్‌డేట్ అవుతూనే ఉంటుంది. నేరస్థుల్ని వెంటాడి పట్టుకోవటం కోసం ప్రపంచంలోనే అత్యంత వేగంగా నడిచే కార్లను ఉపయోగిస్తోంది. గంటకు 253 మైళ్ళ వేగంతో నడిచే 'బుగాటి వేరాన్' కార్లను అక్కడి పోలీసులు వాడతారు. ఈ కారు 2.5 సెకండ్లలో 0 నుంచి 60 మైళ్ల వేగాన్ని అందుకోగలదు. అత్యంత వేగంగా నడిచే పోలీస్ కారుగా ఇది గిన్నిస్ బుక్‌లోకి కూడా ఎక్కేసింది.

భవంతులు, ఇళ్లు, ఆఫీసులు, షాపింగ్ మాల్స్... ఇలా ఒకటేమిటి? దుబాయి అంతటా ఏసీనే! ఆఖరుకు ప్రజల సౌకర్యార్థం బస్‌లతో పాటు, బస్ స్టాప్‌లను కూడా ఏసీ చేసేశారక్కడ.

దుబాయి బంగారం వ్యాపారానికి ప్రసిద్ధి. ఒక్క 2013 సంవత్సరంలోనే ప్రపంచం మొత్తం బంగారంలో 40 శాతం దుబాయిలోనే ట్రేడ్ అయింది. ఈ బంగారం మొత్తం 354 ఏనుగులకు మించిన బరువుంది.

బుర్జ్ ఖలీఫా ఎంత ఎత్తు ఉంటుందంటే దాన్లో ఉండే కొన్ని కుటుంబాలు నమాజ్ ఉపవాసాన్ని విరమించటం కోసం మిగతా ఫ్లోర్లలో వాళ్ళకంటే ఇంకొంత ఎక్కువ సమయం ఆగాల్సి ఉంటుందట. ఎందుకంటే 80 నుంచి ఆ పై అంతస్తుల్లో ఉండే వాళ్ళకు ఆలస్యంగా పొద్దు కుంగుతుంది.

దుబాయిలో ఒంటెల పరుగు పందేలు జరుగుతూ ఉంటాయి. ఈ మల్టీ మిలియన్ డాలర్ ఒంటెల పోటీల్లో ఒంటెల్ని పరిగెత్తించేది మనుషులు కాదు....'రోబో'లు.

దుబాయి ఎకానమీలో ఇంధనం వాటా కేవలం 6 శాతమే! ప్రాంతీయంగా ఎకానమీ మొత్తం రియల్ ఎస్టేట్, టూరిజం నుంచే సమకూరుతుంది.

దుబాయి షాపింగ్ మాల్ ప్రపంచం మొత్తంలోనే అతి పెద్ద షాపింగ్ సెంటర్. దీన్లో మొత్తం 1200 షాపులున్నాయి.

దుబాయి షేక్‌లకు అడవి జంతువులే పెంపుడు జంతువులు. చిరుతలు, తెల్ల పులులు, సింహాలను ఇక్కడ పెంచుకుంటూ ఉంటారు.

2009లో దుబాయిలో ఓ అతి పెద్ద మెట్రో స్టేషన్‌ను ప్రారంభించారు. 42 స్టేషన్లుండే ఈ మెట్రో స్టేషన్‌ను కేవలం 18 నెలల్లో కట్టేశారు.

దుబాయిలో బంగారం కడ్డీలను ఏటిఎమ్‌ల నుంచి విత్‌డ్రా చేసుకోవచ్చు.











# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 29

(గతవారం తరువాయి)

**దర్శకుడు హరీశ్ శంకర్ గబ్బర్‌సింగ్ సినిమాలో 'మందుబాబులం మేము మందుబాబులం. మందుకొడితె మాకు మేమె మహారాజులం అనే పాట నాతో పాడించి ఒక ప్రయోగం చేశారు. దేవిశ్రీ ప్రసాద్ దగ్గరుండి నాతో ఆ పాట పాడించారు. నేనేంటి పాడటమేంటి అనుకుంటూ రికార్డింగ్ థియేటర్ లోంచి బైటకొస్తే కీరవాణిగారు కనిపించారు. ఇదీ విషయం అని ఆయనతో చెప్పా. దేవిశ్రీ ఊరికే ఏదీ చేయడు, చేశాడంటే ఏదో విషయం ఉంటుంది పదండి చూద్దాం అని స్టూడియోలోకి నడిచారు.**

ఆయన్ని చూడగానే దేవిశ్రీప్రసాద్ నమస్కరించి, నేను పాడిన పాట వినిపించారు.

విన్నాక "చాలా బావుంది కోటగారూ.. ప్రజల్లోకి వెళ్తుంది చూడండి" అన్నారు కీరవాణిగారు.

## రాజమౌళికి నచ్చిన హీరో నేనే!

ఆయన సంగీతంలో దిట్ట అయిన కీరవాణిగారు కూడా పాజిటివ్‌గా స్పందించడంతో ఇంకాస్త సౌకర్యంగా అనిపించింది. అసలు మొదటి నుంచీ ఆ పాట విషయంలో నాకు ధైర్యం పవన్‌కల్యాణ్‌గారే. ఆయన నటించిన సినిమా కాబట్టి కొన్ని విషయాలు ఎలా ఉన్నా చెల్లుబాటైపోతాయి. ఎందుకంటే అభిమానులు, ప్రేక్షకుల దృష్టి మొత్తం ఆయనమీదే ఉంటుంది కనుక. ఆ ధైర్యంతోనే, నా పాట కూడా తోసుకుపోతుంది. కామెంట్లు చేసేవారు కూడా పెద్దగా ఉండరని పాడేశా. విడుదలయ్యాక మందు షాపుల్లో నా పాట హిట్ అయి మంచి పేరు తెచ్చిపెట్టిందనుకోండి... అది వేరే విషయం.

ఇక కీరవాణిగారి విషయానికి వస్తే, ఆయనకు నేను పాడిన పాటే కాదు.. నేనన్నా చాలా అభిమానమండీ. ఓ పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఆయనే ఈ విషయం చెప్పారు. మీకు నచ్చిన నటుడెవరు? అని విలేకరి అడిగితే "నాకు వాయిద్యాల్లో వేణువు ఎంత ఇష్టమో, నటుల్లో కోటశ్రీనివాసరావు అంటే అంత ఇష్టం" అని సమాధానమిచ్చారు. నా శ్రేయోభిలాషులు ఎవరో ఆ పత్రిక తెచ్చిస్తే చూసి చదివి ఆనందించి, కీరవాణిగారిని కలిసి మాట్లాడాను. ఆ తర్వాత కూడా ఆయన గురించి నాతో చాలా మంది చాలా విషయాలు చెప్పారు. అందులో ఒకటి ఏంటంటే, ఎప్పుడైనా ప్రివ్యూలకు వెళ్తుంటారు కదా! అలాంటప్పుడు ఆ సినిమాల్లో నా వేషం ఉందనుకోండి. అది స్క్రీన్ మీద వస్తే 'ఏం ఇచ్చారయ్యా ఆయనకి. ఎంతిచ్చారు మీరు' అని అడుగుతారట కీరవాణి. అవతలివాళ్ళు ఏదో సమాధానం చెబుతారు కదా.. అది విని "ఏమివ్వగలరు మీరు ఆయనకి? అలాంటి నటుణ్ణి డబ్బుతో కొనగలరా? కోట తెలుగువాడవడం మన అదృష్టం" అని అంటుంటారట. కీరవాణిగారే కాదు, వాళ్ళ నాన్నగారు, వాళ్ళ ఫ్యామిలీ మొత్తం నాకు బాగా పరిచయం.

రాజమౌళిగారితోనూ రెండు మూడు సినిమాలు చేశాను. ఒకసారి ఒక టీవీ ఛానల్ వాళ్ళు రాజమౌళిగారిని ఇంటర్వ్యూ చేశారట. అందులో 'మీకు ఇష్టమైన హీరో ఎవరండీ' అని అడిగారట. రాజమౌళిగారు చెప్పిన సమాధానం విని నేనే షాక్ అయ్యా. రాజమౌళి అసలేం తడుముకోకుండా 'కోట శ్రీనివాసరావుగారు' అని చెప్పారట. ఈ విషయం నాతో చెప్పింది కూడా రాజమౌళిగారే. ఆ క్షణంలో ఒక రకమైన భావోద్వేగానికి గురయ్యానంటే నమ్మండి. అందగాణ్ణి కాదు, కమర్షియల్ హీరోని కాదు, మరొకటి మరొకటి కాదు.. అయినా 'బాహుబలి'లాంటి సినిమాకు దర్శకత్వం చేసిన వ్యక్తి, ఆయనకు నచ్చిన హీరో అని నా పేరు చెప్పడం మామూలు విషయమా? అలాగని రాజమౌళిగారి ఫ్యామిలీని నేను తరచూ కలుస్తూ ఉంటాననుకుంటే పొరపాటే. కలిసేది తక్కువే కానీ మానసికంగా మాకు ఒకరిపట్ల ఒకరికి ప్రేమ, అభిమానాలు మెండు. ఈ మధ్యనే ఒకసారి కీరవాణిగారితో 'మీ తమ్ముడు రాజమౌళిగారికి ఒకసారి చెప్పండి, నాకు మంచి వేషం ఇవ్వమని' అన్నాను. దానికి ఆయన ఏమన్నారో తెలుసా? 'వాడి బాధేంటో... తాతకి దగ్గనేర్పడానికి వాడికున్న ఇబ్బందులేమిటో' అని. ఆ మాట నాకు వెయ్యి సినిమాల అవకాశం వచ్చినంత బలాన్నిచ్చింది.



### నిరాహార దీక్ష

సత్పురుషుడి నోటి నుంచి వచ్చిన మాట, ఒక సత్సంకల్పంతో చేసే పోరాటం ఎప్పుడైనా మనకు బలాన్నిస్తాయి. ఆ ఉద్దేశంతోనే ఒకసారి నేను కార్మికుల కోసం నిరాహారదీక్ష చేశా. ఇది ఇప్పటి మాట కాదు. పరిశ్రమ చెన్నై నుంచి హైదరాబాద్‌కి తరలి వస్తున్న రోజుల నాటి మాట. మద్రాసులో పెప్సీ విజయన్ మాస్టర్ సారథ్యంలో బాగా హడావిడిగా ఉండేది. వాళ్లేంటంటే హైదరాబాద్‌లో షూటింగులకు

కూడా అక్కడివాళ్ళనే తీసుకురావాలని, లేకుంటే మద్రాసులోనే షూటింగులు పెట్టుకోవాలని... లాంటి రూల్స్ అప్పట్లో చాలా పెట్టారు. దాంతో ఇండస్ట్రీలో ఒకరకమైన అనిశ్చితి ఏర్పడింది. ఎక్కడైనా నలుగురూ బతకాల్సిందే. మద్రాసులో ఉండగా తెలుగువారు తమిళ సినిమాలకు పనిచేసేవారు. పరిశ్రమ హైదరాబాద్ తరలి వచ్చిన తర్వాత ఇక్కడివారికి ఉపాధి కలుగుతుంది. అలా కాకుండా అక్కడివాళ్ళే చేయాలనడం ఏంటి? అందరం కలిసి అన్నిచోట్లా

**కోట శ్రీనివాసరావుగారిది చాలా భిన్నమైన డిక్షన్. విలక్షణమైన, అరుదైన నటుడు. ఆయన్ను ఇష్టపడనివారు ఎవరుంటారు చెప్పండి? ఆయన గొప్ప అందగాడు కాదు, హీరో అసలే కాదు అయినాగానీ గొప్ప గొప్ప దర్శకులు, ప్రముఖులు ఎంతో ఇష్టపడతారు. ఒకసారి ఓ ఇంటర్వ్యూలో రాజమౌళిని మీకిష్టమైన హీరో ఎవరు? అని అడిగితే ఆయన కోట శ్రీనివాసరావుగారి పేరే చెప్పారట!**

పనిచేయాలి. కొన్ని చోట్లే పనిచేస్తామని అనడం మన సినిమా పరిశ్రమకి సరిపోదు. ఇక్కడైనా, ఎక్కడైనా కొత్త కొత్త రూల్స్‌గా కాకుండా, పాత ప్రకారం వెళ్తే బావుంటుందని నా ఉద్దేశం. దానికి ఏదో ఒకటి చేయాలి. అనామకులు చేస్తే ప్రయోజనం ఉండదు. నాకు అప్పటికే అంతోకొంతో పేరుంది. ఆ పేరు జనాలిచ్చిందే. ఆ పేరును నలుగురి కోసం ఉపయోగించాలని నిర్ణయించుకున్నా. నిరాహార దీక్ష చేద్దామనుకున్నా. ఎందుకో ఒకరోజు మధ్యాహ్నం ఆ ఆలోచన వచ్చింది. అటు చూస్తే జగపతి రాజేంద్ర ప్రసాద్‌గారు కనిపించారు. ఆయన కూడా అయ్యప్ప దీక్షలో ఉన్నారు. నేనూ దీక్షలోనే ఉన్నా. సరేనని ఆయన దగ్గరకు వెళ్ళి 'పరిశ్రమ కోసం ఇలా కూర్చుంటున్నానండీ' అన్నా. 'అందరం ఉన్నాం.. మీరు సడెన్‌గా కూర్చుంటానంటే ఎలా.. ఉండండీ! అందరం కలిసి మాట్లాడుకుందాం' అన్నారు. 'అలా కాదులెండి. ఏదో చేయాలనిపిస్తోంది. చేస్తాను. మీతో చెప్పాలనిపించింది' అని ఆయనతో అని వెళ్ళి కూర్చున్నా. నాకు అప్పుడప్పుడే డయాబెటిక్ అటాక్



# మహానుభావులతో పనిచేయడం నా అదృష్టం

అంతో ఇంతో పాత, కొత్త దర్శకులందరితోనూ నాకు పరిచయం ఉందండీ. నాకు తెలిసి పూర్వం దర్శకులందరూ అకౌంటెంటులుగా ఉండేవారు. ఇక్కడ అకౌంటెంట్ అంటే డైలాగ్ అకౌంటెన్సీ, స్క్రీన్‌ప్లే అకౌంటెన్సీ, మ్యూజిక్ అకౌంటెన్సీ అన్నమాట. 24 శాఖల మీదా వాళ్ళకు పట్టు ఉండేది. అన్ని శాఖల్లోనూ ఏది ఎంత ఉండాలో, దేన్ని ఎంత మేర ఉపయోగించుకోవాలో వారికి బాగా తెలిసేది. నేను పరిశ్రమకి వచ్చిన కొత్తలో సి.ఎస్.రావుగారి దగ్గర ఒక సినిమా చేశా. తొలిరోజు సెట్‌లో 13 మంది ఆర్టిస్టులం ఉన్నాం. సత్యనారాయణగారు, నేను, గిరిబాబుగారు, జయలలిత.. ఇలా మొత్తం 13 మంది అన్నమాట. జయలలిత అంటే తమిళనాడు ముఖ్యమంత్రిగా చేసి, ఇటీవల చనిపోయిన ఆవిడ కాదు. మన తెలుగమ్మాయి జయలలిత. ఈ అమ్మాయి చాలా అందంగా ఉండేది. డ్యాన్సులు కూడా బాగా చేసేది. ఇప్పుడు క్యారెక్టర్లు చేస్తోంది కదా.. మేమంతా సెట్‌కి రాగానే సి.ఎస్.రావుగారు అందరినీ కూర్చోబెట్టి 'విత్ ఫుల్ మూడ్‌లో ఒక రిహార్సల్ చేయండి. ఎందుకంటే వి ఆర్ డీలింగ్ విత్ ఫిల్మ్... ఫిల్మ్‌తో ఆడుకోకూడదు' అనేవారు. పూర్వం రచయితలు డైలాగులను ముందే పంపేసేవారు. దాంతో ఎవరి డైలాగులు వాళ్ళకి ముందే ఇచ్చేయడంతో మేమంతా కూడా ప్రిపేర్ అయి వచ్చేవాళ్లం.

ఆ రోజు కూడా సెట్‌కి రాగానే అందరం రిహార్సల్ మొదలుపెట్టాం. ఆఖరు డైలాగ్ నాదే. నా డైలాగ్ నేను చెప్పాక ఎక్కడినుంచో కటక్ కటక్ మని సౌండ్ వచ్చింది. ఏంటా? అని చూస్తే సీఎస్ రావుగారు జేబులో నుంచి స్టాప్ వాచ్ తీసి , 'మ్... 30 సెకన్లు తేడా వచ్చింది. ఎవరో డైలాగు లాగుతున్నారు..' అన్నారు.

సెకన్లకు కూడా ఇంత ప్రాధాన్యమిస్తారా? అని మనసులోనే అనుకున్నా.

అంతలోనే సి.యస్.రావుగారు వచ్చి "సత్యనారాయణ ఫలానా చోట నువ్వు చెప్పింది ఆర్టిఫీషియల్‌గా ఉంది. ఇదిగో శ్రీనివాసరావు పౌరాణికానికి నువ్వింకా అలవాటుపడలేదు. కాస్త పౌరాణికం స్టైల్‌లో చెప్పు డైలాగు.. అబ్బాయ్.. గిరిబాబు నువ్వు కాస్త నిదానంగా చెప్పు" అని మేం చేసిన నటనలో మంచీచెడులు చెప్పారు. ప్రతిరోజూ అలాగే చెప్పేవారు. అప్పట్లో స్క్రిప్ట్ బుక్‌లో రైట్ సైడ్ యాక్టింగ్, లెఫ్ట్‌సైడ్ ఎలా చేయాలి? ఏం చేయాలి? వంటి వివరాలన్నీ రాసుకునేవారు. దానికి తోడు సి.యస్.రావుగారికి అపారమైన జ్ఞాపకశక్తి ఉండేది. సెట్లో ఎంత మంది ఉన్నా అందరి డైలాగులూ ఆయనకి గుర్తుండేవి. అందరికీ ప్రాంప్టింగ్ చెబుతుండేవారు. ఒకవేళ ఏదైనా ఒక డైలాగ్ మిస్ అయిందనుకోండి.. అసిస్టెంట్లను పిలిచి చెక్ చేయమనేవారు. వాళ్ళు పరాపరా పేజీలు తిప్పుతుంటే 'పేజీలు చిరుగుతయిరా.. అంతలా తిప్పడం ఎందుకు.. ఆ 36వ పేజీలో అట్టడుగున ఉంది చూడు ఆ డైలాగ్..' అని పేజీ నెంబర్లతో సహా చెప్పేసేవారు. అలాంటి మహానుభావులతో పనిచేయడం నిజంగా నా అదృష్టం.



అయింది. కానీ దీక్ష ఎలా చేశానో నాకే తెలియదు. అయ్యప్ప దీక్షలో ఉన్నాను కాబట్టి ఆ స్వామి దయతోనే పూర్తిచేయగలిగానేమో అనిపిస్తుంది. రామానాయుడుగారు, కృష్ణంరాజుగారు, జగపతిరాజేంద్ర ప్రసాద్‌గారు, తమ్మారెడ్డి భరద్వాజగారు, కె.ఎస్. రామారావుగారు, సురేశ్‌బాబుగారు, వెంకటేశ్‌గారు, నాగార్జునగారు.. ఇలా అందరూ నాకు బాగా సపోర్ట్ చేశారు. అప్పుడప్పుడే పరిశ్రమ చెన్నై నుంచి తరలి రావడం కదా... జనాల్లో సినిమా వాళ్లంటే విపరీతమైన క్రేజ్ ఉండేది. నేను దీక్ష చేసినన్నాళ్ళూ విపరీతమైన జనం ఉండేవారు చుట్టూ. కృష్ణంరాజుగారు ఒక రోజు దీక్ష దగ్గరకు వచ్చి 'పరిశ్రమ సమస్యలు ఏమో కానీ, నువ్వు మాత్రం జనాల్లో హీరో అయిపోతున్నావు శ్రీనివాసరావూ' అన్నారు. 'ఊరుకోండి సార్.. భలే చెప్పారు. మనకి కొత్తగా రావాల్సిన పేరు ఏముంది? ఏదో నలుగురికోసం కూర్చున్నాను' అన్నా. నాగార్జునగారు, వెంకటేశ్‌గారు తలా ఒకరోజు వచ్చి కూర్చుంటామని కబురు పారు. కానీ నేనే 'వద్దు బాబూ.. ఇప్పటికే జనాలు విపరీతంగా వస్తున్నారు. మీరు కూడా వస్తే వాళ్ళను అదుపుచేయడం కష్టమవుతుంది. మీరు ఆ మాటన్నారు. అదే చాలు' అని చెప్పా. అంటే వాళ్ళు రావడం నాకేమీ ఇష్టం లేకకాదు, కాసేపు నాగార్జునగారు వచ్చి నాకు తోడుగా కూర్చుంటే నాకు బాగానే ఉంటుంది. కానీ పబ్లిక్ కంట్రోల్‌లో ఉంటారా? వెంకటేశ్‌బాబును చూస్తే ఊరకుంటారా? నా అనుమానం అదే. వాళ్ళు కూడా సహృదయంతో అర్థం చేసుకున్నారు.

**(ఇంకా ఉంది)**

**–డా.చల్లా భాగ్యలక్ష్మి**

**సెల్: 88850 55528**



# మనసుగతి ఇంతే!

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**పెద్దపెద్ద కళ్ళు. కాటుకరేఖలు ఆ కళ్ళని ఇంకా పెద్దగా చేస్తున్నాయి. సూర్యరశ్మికి మెరుస్తున్న జంట సరోవరాల్లా ఉన్న కళ్ళ మధ్య, సరిహద్దులా నవ్వు పువ్వులాంటి చక్కటిముక్కు, లిప్‌స్టిక్ పులమకుండానే ఎర్రగా, తడిగా మెరుస్తున్న అందాల పెదవులు. చిరునవ్వు విడదీసిన పెదవుల సందులోంచి తళుక్కుమంటున్న పళ్ళు. చిన్నిగడ్డం. గడ్డం మీద దిష్టిచుక్కలా ఆవగింజంత పుట్టుమచ్చ...**

**అర్ధచంద్రాకారంలో ఉన్న నుదురుమీద వంకీలు తిరిగిన కనుబొమల కింద ఉన్న కళ్ళు, ముక్కు, పెదాలు, చుబుకం వీటన్నింటితో సౌందర్యాన్ని సంతరించుకున్న కోలముఖం. ముఖానికి ఫ్రేములా బాబ్డ్‌హెయిర్. సన్నటి మెడలో చర్మం రంగులో కలిసిపోయిన సన్నటి బంగారు గొలుసు...**

కంప్యూటర్ స్క్రీన్ మీద మౌస్‌పాయింటర్ మెల్లిగా కదిలి క్లిక్ చేసింది. ఇందాక క్లోజప్‌లో కనిపించిన ముఖం, వంపులు తిరిగిన శరీరం మీద ప్రత్యక్షమైంది. గులాబీరంగు చీర. అదే రంగు స్లీవ్‌లెస్ జాకెట్. ఆమె ఎదురుగా వీస్తున్న గాలి చీరను ఆమె శరీరానికి తాపడం చేస్తూ, పైటతో ఆడుకుంటోంది.

ఒకదాని తరువాత ఒకటిగా కంప్యూటర్ స్క్రీన్ మీద ఫోటోలు జరిగిన దానికి రంగురంగుల సాక్ష్యాల్లా ప్రత్యక్షమవుతున్నాయి. అందంగా అలంకరించబడిన పెళ్ళిమండపంలో పీటల మీద పట్టుబట్టల్లో ఇద్దరూ. బంగారం రంగు కంచిపట్టుచీరలో సంధ్య కుందనం బొమ్మలా, కళ్ళు చెదిరేలా ఎదురుగావున్న ఎవరివైపో చూసి నవ్వుతోంది. తలవాల్చిన సంధ్య మెడలో తాళికడుతున్న తను... తలంబ్రాలు పోస్తున్న తను. తన తలమీద తలంబ్రాలు పోస్తున్న చక్కటి భంగిమలో సంధ్య. పెళ్ళికూతురు అందం చూడాలంటే తలంబ్రాలు పోసేటప్పుడే చూడాలి... పెళ్ళి ఫోటోలు ఒకదాన్నొకటి తరుముతూ చకచకా కదుల్తున్నాయి. తిరుమల పాపవినాశనం నేపథ్యంలో ఇద్దరూ, పంజాబీ డ్రెస్సులో సంధ్య అందంగా, శిలాతోరణం ముందు ఒకర్నొకరు ఆనుకుని ఇద్దరూ... తన భుజం మీద సంధ్య తల... ఫోటోలు పరుగెడుతున్నాయి.

వినయ్ కళ్ళముందు మొట్టమొదటి ఫోటోలో సంధ్య ప్రత్యక్షమైంది. అతని వేళ్ళు కదిలాయి. సంధ్య ముఖం క్లోజప్‌లో. సంధ్య విశాలనేత్రాలను మంత్రముగ్ధుళ్ళా చూస్తూ ఉండిపోయాడు వినయ్. అవి మామూలు కళ్ళు కావు; అయస్కాంత నేత్రాలు! మొట్టమొదటిసారి చూసిన క్షణంలోనే ఆ కళ్ళు తన హృదయాన్ని లాగి, తమ యజమానురాలి వశం చేశాయి. తొలిచూపులో ప్రేమ! ఔను... ఆ కాటుకకళ్ళను చూసిన రెప్పపాటు సమయంలోనే తను సంధ్యను ప్రేమించాడు. ఇప్పుడూ ప్రేమిస్తున్నాడు. ముందుముందూ ప్రేమిస్తూనే ఉంటాడు. తనకు తెలుసు. సంధ్య పట్ల తన ప్రేమ

**(కొత్త సీరియల్ ప్రారంభం)**

సాధారణ ప్రేమ కాదు; చావులేని ప్రేమ. సంధ్య తన రక్తంలో ఉంది వైరస్‌లాగా!

వినయ్ అప్రయత్నంగా నిట్టూర్చాడు. తాను ఆరో ప్రాణంలా ప్రేమించి, పెళ్ళాడిన సంధ్య రంగురంగుల బొమ్మల రూపంలో తన కంప్యూటర్లో ఉంది. వైరస్‌లాగా తన రక్తంలో ఉంది. తన గుండెలో ఉంది. ఇక్కడ తన ఇంట్లో లేదు. అమెరికాలో తనతో లేదు. సంధ్య తన ఇంట్లోంచే పుట్టింటికి వెళ్ళిపోయింది శాశ్వతంగా. సంధ్య ఇంక తన జీవితంలోకి రాదు. తన హృదయంలోంచీ పోదు! వినయ్‌లో గతస్మృతులు కదిపిన పుట్టలోంచి కందిరీగల్లా లేస్తున్నాయి. గతం తియ్యటి గతం. చేదును అందించిన తియ్యటిగతం...

***

మొబైల్ శ్రావ్యంగా రాగం తీసింది. వినయ్ నంబరు చూశాడు. తన తండ్రి శ్రీనాథరావు.

"హలో నాన్నా!" వినయ్ మొబైల్ ఆన్‌చేసి, అన్నాడు. "ఎలా ఉన్నారు?"

శ్రీనాథరావు నవ్వు సున్నితంగా వినయ్ చెవిలో దూరింది. 'చదువూసంధ్యాలేని మన వాచ్‌మెన్‌ని ఇంకా స్కూల్‌కే వెళ్ళని వాడి కొడుకు 'డాడీ!' అంటూ ఉంటాడు. నువ్వేమో అమెరికా వెళ్ళాక కూడా 'నాన్నా' అనే అంటున్నావు!"

వినయ్ చిన్నగా నవ్వాడు. "ఎక్కడున్నా మన భాషనూ, సంస్కృతినీ మరిచిపోలేను నాన్నా!"

"బాగా చెప్పావ్. మరిచిపోకూడదు కూడా!" శ్రీనాథరావు అన్నాడు. "ఇదిగో... మీ అమ్మ అర్జెంటుగా నీతో మాట్లాడాలిట!"

"ఒరే నాన్నా, ఎలా ఉన్నావు? వేళకు తిండి తింటున్నావా?" అమ్మలోని ప్రేమ వినయ్‌ని ప్రశ్నించింది.





"తినకుండా ఎలా ఉంటానే అమ్మా!" వినయ్ చిన్నగా నవ్వాడు.

"ఇదిగో... మొన్నీమధ్య ఒక ఫోటో మెయిల్ చేశాం కద! ఆ పిల్ల ఎలా ఉంది నీకు?" శాంతమ్మ ప్రశ్న.

"ఒక్కటి కాదు... వంద ఫోటోలు మెయిల్ చేశారు. ఏ అమ్మాయేమిటి?" వినయ్ నవ్వాడు.

"పేరు సంధ్యరా. అమ్మాయి చదువూ సంధ్యా అన్నీ వివరంగా రాసిందిగా, నీ చెల్లెలు...?"

"ఓ.. ఆ అమ్మాయా? ఫోటో బాగానే ఉంది. అయినా ఇవాళా రేపూ ఫోటోలు చూసి నిర్ణయించలేములే.." వినయ్ అన్నాడు.

మొన్న సుధా, నేనూ శివాలయానికెళ్ళాం. సంబంధం చెప్పిన పేర్రాజుగారు పిల్లా, తల్లీ ఇద్దరూ ఆలయానికి వచ్చే ఏర్పాటు చేశాడు. అమ్మాయి చక్కని చుక్కరా..."

"అన్నాయ్! గ్లామర్క్వీన్ అనుకో! నిజంగా ఎంత బావుందో!" చెల్లాయి సుధ కంచుకంఠం. అమ్మ చేతిలోంచి ఫోన్ లాక్కున్నట్టుంది.

"అంత బావుందా? నీకంటేనా?" వినయ్ నవ్వాడు.

"కరెక్టుగా చెప్పాలంటే... ఎలా చెప్పాలి?.... ఆ కరెక్టుగా చెప్పాలంటే మనం మిస్ ఇండియా...

సంధ్య మిస్ వరల్డ్!

"నిజంగా?"

"నిజమో కాదో వచ్చి, చూసి తేల్చుకో!" సుధ హుషారుగా అంది.

"అమ్మకిస్తున్నా..."

"ఒరేయ్ నాన్నా..."

"చెప్పమ్మా..."

"సరిగ్గా ఇవాళ్టికి పదో రోజు... దశమి, శుక్ర వారం. పిల్లను చూసుకోడానికి వస్తున్నట్టు వాళ్ళకి కబురు చేసేశా... వెంటనే బయల్దేరు!" శాంతమ్మ కంఠంలో నిర్ణయం గంటలా మోగింది.

"పదోరోజా? వెంటనే బయల్దేరాలా? అదెలా వీలవుతుందే? సెలవు దొరకాలి; టికెట్ దొరకాలి..." వినయ్ కంగారుగా అన్నాడు.

"అవన్నీ నాకు తెలీవు. మళ్ళీ ఆషాఢమొచ్చే స్తోంది. సెలవు నీ ఇష్టం. టికెట్ నీ ఇష్టం. వారం తిరిగేలోగా ఇక్కడుంటున్నావ్. అంతే!"

"అది కాదమ్మా... నా మాట విను..." వినయ్ సర్ది చెప్పబోయాడు.

"వినను. విన్రా. నీకు కల్యాణఘడియలొచ్చే స్తున్నాయ్. కక్కొచ్చినా, కల్యాణమొచ్చినా ఆగదు! నువ్వ వస్తున్నావ్. ఇంకేమైనా ఉంటే ఇదిగో మీ నాన్న గారితో మాట్లాడు!" శాంతమ్మ గద్దిస్తున్నట్టు అంది.

"చెప్పబ్బాయ్!" శ్రీనాథరావు కంఠస్వరం.

"అదికాదు నాన్నా... ఉన్నపళాన రెక్కలుకట్టుకు రమ్మంటే ఎలా? అమ్మకు సర్దిచెప్పండి."

"భలే వాడివోయ్! నేను సర్దిచెప్పడం, ఆవిడ సర్దుకుపోవడం అనేవి ఎప్పుడైనా చూశావా? ఆవిడ ఎంతనుకుంటే అంతే! ఏదంటే అదే! అంతే! నాకు వయ సుపోతోంది. బోర్డరు దాటేశాను! ఎలాగో తంటాలు పడు!"

"అదికాదు నాన్నా..."

"ఇదిగో సుధ ఫోన్ లాక్కుంటోంది. దాంతో మాట్లాడు!"

"అన్నాయ్! నో సెకెండ్ థాట్! ఎగిరొచ్చెయ్! చూస్తే వదలవ్... తెల్సిందా? నాకు తెలుసు. ఎలా తెలు సని అడక్కు. సంధ్య నీ కోసం ఎదురు చూస్తోంది!"

"ఊరిస్తున్నావా?" వినయ్ నవ్వుతూ అడిగాడు.

"అలాగే అనుకో... ఇదిగో అమ్మ.." సుధ అంది.

మరుక్షణం శాంతమ్మ కంఠం వినయ్ చెవిలో ప్రతిధ్వనించింది. "వినయ్, రెండు మూడు రోజుల్లో ఫోన్ చెయ్. ఏ ఫ్లయిట్‌కి వస్తున్నావో చెప్పు! శ్రావణ మాసంలో నీ పెళ్ళయిపోవాలంతే!"

"అవకేం జేస్తుందీ? నువ్వనుకుంటే అయిపోవా ల్సిందేగా!" వినయ్ నవ్వాడు.

***

శ్రీనాథరావు సోఫాలోంచి లేచి, గోడ దగ్గరగా వెళ్ళి, ఫోటోల వైపు తదేకంగా చూస్తూ ఉండి పోయాడు. అమెరికా వెళ్ళిన కొత్తల్లో వినయ్ తీసుకుని పంపించిన ఫోటో. 'అంతా అమ్మ పోలికే. అందుకే అందంగా ఉన్నాడు! అదృష్టవంతుడు కూడా! అమ్మను పోలిన కొడుకు అదృష్టవంతుడు!' అన్నారు అనుభ వజ్ఞులు.

శాంతమ్మ చీర కుచ్చెళ్ళు సర్దుకుంటూ వచ్చి, కొడుకు ఫోటో ముందు నిలబడ్డ భర్తను విడ్డూ రంగా చూసింది.

"మీదంతా విచిత్రం!"

శ్రీనాథరావు ఉలికిపడి, వెనక్కి తిరిగి భార్య వైపు అర్థం కానట్టు చూశాడు.

"అయ్యో రామా! అమెరికా నుంచి వచ్చిన కొడుకు కళ్ళముందుంటే, వాణ్ణి చూడకుండా ఫోటోను చూస్తారేమిటీ విచిత్రంగా? పిచ్చా?"

"ఆ! పిచ్చే! నా కొడుకంటే నాకు పిచ్చే... ఇంతకీ ఫోటోలో ఏం చూస్తున్నానో తెలుసా? వాడి ముఖంలో నీ పోలికల్ని!" శ్రీనాథరావు చిరునవ్వుతో అన్నాడు. "ఆ నుదురూ... ఆ కళ్ళూ... ఆ ముక్కూ.."

"రూపురేఖలే కాదు; బుద్ధులు కూడా నావే. అందుకే అమెరికాలో ఉద్యోగం సంపాదించ గలిగాడు!"

"బుద్ధులన్నీ నావే అనుకున్నానే.."

"మీ బుద్ధులూ, మీ పోలికలూ అన్నీ కూతురు అంది పుచ్చుకుందిగా! అందుకే ఆ మొండితనం... ఆ నస... అన్నీ!"

"ఏమిటమ్మా.. పోట్లాడుకుంటున్నారు?" గది లోంచి హాల్లోకి వస్తూ అన్నాడు వినయ్.

శ్రీనాథరావు కొడుకువైపు సగర్వంగా చూశాడు. ఆరడుగుల ఎత్తు. ఎత్తుకు తగ్గ లావు. ఉంగరాల జుత్తు. సన్నటి మీసాలు. తన కొడుకు అందగాడు!

"ఏం లేదబ్బాయ్... మీ అమ్మ పోట్లాడుతోంది. నేను వింటున్నాను."




**ఆమె తన పక్కన లేదు. తన ఇంట్లో లేదు. కేవలం తన కంప్యూటర్లో స్క్రీన్ మీద మాత్రమే దర్శనభాగ్యం. తను ఆమెని ప్రేమించాడు. ప్రేమిస్తున్నాడు. ప్రేమిస్తూనే ఉంటాడు. ఆమె తన రక్తంలోనే ఉంది వైరస్‌లాగా! గతం మరపురానిది. మరువలేనిది. తనది తీయటి గతం అనుకుంటూ జ్ఞాపకాల పందిరిలోంచి తన ఆరాధ్య దేవతను దర్శిస్తున్నాడు. మరి అతడి ఆ తీయటి గతమేమిటో చదవండి.**

"వాడికి తెలుసులెండి. ఒంటి చెయ్యి చప్పుడు చేయదు!" శాంతమ్మ నవ్వింది.

"అమ్మా... నేను రెడీ!" హాల్లోకి వస్తూ చీర కుచ్చెళ్ళు చూసుకుంటూ అంది సుధ.

వినయ్ సుధవైపు చూశాడు. సన్నగా, పొడుగ్గా, నాజూగ్గా ఉంది సుధ. నారింజరంగూ, ఎరుపు రంగూ కలిసిన డిజైనర్ చీర. ఊదారంగు అంచు. దానిపైన గీతలా ఆకుపచ్చ అంచు. చీరంతా అక్క డక్కడా తళుక్కుమంటూ మెరుపులు; నక్షత్రాల్లా.

"ఏంటలా చూస్తున్నావ్?" సుధ నవ్వుతూ వినయ్ వైపు ప్రశ్నను రువ్వింది. "ఎలా ఉన్నాను?"

"పెళ్ళిచూపులు నీక్కాదనుకుంటానే!" వినయ్ చిలిపిగా అన్నాడు.

"పెళ్ళిచూపుల సీన్‌లోనే కాదు; మనమెప్పుడూ ఇలాగే ఉంటాం! ఆ!" సుధ గర్వంగా అంది.

"ఆ. ఉంటావ్! చూస్తున్నాంగా! నెలలో ముప్ఫై రోజులూ, ఏడాదిలో పన్నెండు నెలలూ జీన్సూ, టీ షర్టులూ!" శాంతమ్మ నవ్వింది.

"జీన్సులో కూడా అందంగా ఉంటా! ఏం నాన్నా?" సుధ తండ్రి వైపు కన్ను గీటింది.

"ఎందుకుండవూ అందంగా.. నువ్వంతా నా పోలికే!" శ్రీనాథరావు చిరునవ్వు నవ్వాడు. "ఆ... ఇంక బైల్దేరండి. అమృతయోగం ఘడియలు. ఆనంద రావు ఇప్పటికే మూడుసార్లు ఫోన్ చేశాడు!"

"మీదే ఆలస్యం..." వినయ్ గుమ్మం వైపు నడుస్తూ అన్నాడు.

"అమ్మాయ్ సుధా! నువ్వెళ్ళు. కారుకి ఎదురుగా శకునంరా, శుభంగా!" శాంతమ్మ హెచ్చరించింది.

"ఓ! మనం ఎదురొస్తే ప్రతీదీ సూపర్‌హిట్టే!" సుధ గుమ్మంవైపు వయ్యారంగా నడుస్తూ అంది.

***

"రండి రండి! దయచేయండి!" ఆనందరావు శ్రీనాథరావు కుటుంబాన్ని సాదరంగా ఆహ్వా నించాడు.

శ్రీనాథరావు బృందం లోపలికి వచ్చారు.

"మా ఆవిడ... సుమిత్ర..." ఆనందరావు పరి చయం చేశాడు.

సుమిత్ర చేతులు జోడించి, చిరునవ్వు నవ్వింది.

'మా ఆవిడ శాంత. అమ్మాయి సుధ. ఇంక నా పేరూ, అబ్బాయి పేరూ మీకు తెలుసు" శ్రీనాథ రావు నవ్వుతూ అన్నాడు.

"కూర్చోండి, కూర్చోండి!" ఆనందరావు సోఫాలు చూపిస్తూ అన్నాడు.

అందరూ కూచున్నారు. సుధ వినయ్ పక్కనే సోఫామీద కూచుంది.

సుమిత్ర అందరికీ మంచినీళ్ళు అందించి, భర్త పక్కన కూచుంది.

ఆనందరావు చేతి గడియారం చూసుకుని భార్య వైపు తిరిగాడు. "వెళ్ళు సుమిత్రా, అమ్మాయిని తీసుకురా!"

"అలాగే" అంటూ సుమిత్ర లోపలికి వెళ్ళింది.

"వినయ్... అమెరికా నుండి ప్రయాణం హాయిగా సాగిందిగా?" ఆనందరావు అడిగాడు.

"ఏం హాయిలెండి. ఇరవై నాలుగ్గంటలు ఆకాశం లోనే. అలసిపోతాం. ఇక్కడ దిగ్గానే జెట్‌లాగ్!" వినయ్ నవ్వాడు.

సుమిత్ర హాల్లోకి వచ్చింది. డోర్‌కర్టెన్ వైపు చూస్తూ "సంధ్యా, రామ్మా!" అంది.

అందరూ అటువైపు చూశారు అప్రయత్నంగా.

డోర్ కర్టెన్ తొలగించుకుంటూ సంధ్య ప్రత్యక్షమైంది.

"రా తల్లీ.. అలా కూచో!" ఆనందరావు అన్నాడు.

"సంధ్య వినయ్ ఎదురుగా ఖాళీగా ఉన్న సింగిల్ సోఫావైపు నెమ్మదిగా అడుగులు వేయ సాగింది. వినయ్ మంత్రముగ్ధుడిలా చూస్తూ ఉండిపోయాడు. సంధ్యరాకతో హాల్లోకి ఏదో కొత్త వెలుగు ప్రవేశించినట్టనిపిస్తోందతనికి.

నీలం రంగు చీర. అదే రంగు జాకెట్. జాకెట్ చేతులు పొట్టిగా ఉన్నాయి. ఆమె నడుస్తుంటే అదో వయ్యారం వొలికిపోతోంది. ఆమె వేస్తున్న ప్రతీ అడుగుకీ బాబ్‌హెయిర్ గమ్మత్తుగా కదుల్తోంది. అర్ధచంద్రాకారంలో ఉన్న నుదురుమీద, వంకీలు తిరిగిన కనుబొమల మధ్య నిండు చంద్రుడి ఆకారంలో మెరుస్తున్న తిలకం. చెవులకి వేళ్ళాడుతున్న పెద్దపెద్ద రింగులు కదుల్తూ చెక్కిళ్ళకు బంగారు పూత వేస్తున్నాయి. తడిగా మెరుస్తున్న ఎర్రటి పెదవులు. పెదవుల మీద చిరునవ్వు లేదు. చిరునవ్వుని నునుసిగ్గు తరిమేసినట్టుంది. సన్నగా, నాజూగ్గా ఉన్న నడుం చూపుల్ని లాగుతోంది. సంధ్య శరీరం జామపండు రంగులో మెరుస్తోంది.

"అమ్మాయ్, శ్రీనాథరావుగారు; వారి శ్రీమతి శాంతమ్మగారు... నమస్కారం చెయ్!" ఆనందరావు కూతురితో అన్నాడు.

సంధ్య ఇద్దరికీ నమస్కరించింది. శాంతమ్మ తలపక్కకి వాల్చి, చిరునవ్వు నవ్వింది. శ్రీనాథరావు అరచెయ్యి పైకెత్తి దీవిస్తూ, 'కల్యాణమస్తు!' అనుకున్నాడు మనసులో.

"సంధ్యా మిస్టర్ వినయ్. వినయ్... మా అమ్మాయి సంధ్య..' ఆనందరావు పరిచయం చేశాడు.

"హాయ్!" వినయ్ చిరునవ్వుతో అన్నాడు.

సంధ్య తల పంకిస్తూ చిరునవ్వు నవ్వింది.

"నా చెల్లెలు... సుధ" వినయ్ సంధ్యనే చూస్తూ అన్నాడు.

"హలో!" సుధ హుషారుగా అంది.

సంధ్య చిరునవ్వుతో బదులిచ్చింది.

"అమ్మాయి ఎం.బి.ఏ చేసింది. కాలక్షేపానికి!" ఆనందరావు నవ్వుతూ అన్నాడు. "కొన్నాళ్ళపాటు ఏదో ప్రైవేటు బ్యాంకులో ఉద్యోగం చేసింది. కాలక్షేపం కోసమే! అది మానేసి హాయిగా ఇంటి పట్టున ఉంటోంది."

"అలాగా!" శ్రీనాథరావు అన్నాడు.

"ఔనండి. ఒక్కగానొక్క కూతురు. కొడుకైనా, కూతురైనా అదే! దేవుడు మా నాన్నగారి ద్వారా నాకు పుష్కలంగా ఇచ్చాడు. దానికి నేనూ కొంత జత చేశాను. అమ్మాయి సంపాయించి ఎవరికి పెట్టాలి? ఉన్నదాన్ని చక్కగా అనుభవిస్తే చాలు!"

"బాగా చెప్పారు. మాక్కూడా సంపాదించే కోడలుపిల్ల అవసరం లేదు. అబ్బాయిని చూసుకునే పిల్ల చాలు!" శాంతమ్మ అంది.

"వదినగారు బాగా చెప్పారు!" సుమిత్ర వరస కలుపుతూ మాట కలిపింది.

"ఓ... మరిచేపోయా... అమ్మాయి ఫిల్టర్ కాఫీ చాలా బాగా తయారు చేస్తుంది..." ఆనందరావు అన్నాడు.

"ప్రతీ ఉదయం కూతురిచేతి కాఫీ తాగాల్సిందే ఆయన!" సుమిత్ర నవ్వుతూ అంది.

"వినయ్‌కి మన ఫిల్టర్ కాఫీ అంటే ప్రాణం. అక్కడ బ్లాక్ కాఫీ తాగి తాగి విసిగిపోయాడు!" శ్రీనాథరావు అన్నాడు.

"పాపం..." సుమిత్ర జాలిగా అంది. "అమ్మాయ్... అందరికీ కాఫీలు ఇవ్వు."

"అలాగే..." సంధ్య పైకి లేస్తూ అంది.

సుధ వినయ్‌ని మోచేత్తో పొడిచింది. వినయ్ తల తిప్పి చూశాడు.

"నడక చూడు!" సుధ గుసగుసగా అంది.

వినయ్ అప్రయత్నంగా చూశాడు. సంధ్య వెనక భాగంలో నీలం రంగు చీర, పిల్లగాలికి కదిలే నీలిమేఘంలా స్పందిస్తోంది. సహజమైన సంధ్య అందాన్ని నడక రెట్టింపు చేస్తోంది.

సంధ్యను చూస్తుంటే తన హృదయం కొత్తగా స్పందిస్తోంది ఎందుకో. సంధ్యలో అందం ఉంది. ఆకర్షణ ఉంది. చక్కదనానికి తోడుగా సంస్కారం, సభ్యత ఉండి తీరుతాయి. ఆ పెద్ద పెద్ద కళ్ళల్లో ఏదో వెల్తురు ఉంది. ఆ కళ్ళలో కాంతి.. కాంతికిరణంలా తన కళ్ళగుండా హృదయంలోకి దూసుకుపోయినట్టనిపిస్తోంది వినయ్‌కి. సంధ్య సౌందర్యం తనని తన మౌన భాషతో ఇన్‌ఫ్లుయెన్స్ చేస్తోందా?

గుమ్మం వద్ద చప్పుడైంది. వినయ్‌లో సాగుతున్న ఆలోచనల్ని సంధ్య రాక తెంచేసింది. కాఫీ ట్రేని రెండు చేతుల్తో పట్టుకుని, అడుగులో అడుగు వేస్తూ వస్తోంది సంధ్య. ఇందాక ఆమెతోబాటుగా వెళ్ళిపోయిన వెల్తురు మళ్ళీ వచ్చినట్టనిపిస్తోంది వినయ్‌కి.

"ముందుగా అబ్బాయికి ఇవ్వమ్మా!" సుమిత్ర కూతుర్ని హెచ్చరించింది.

సంధ్య కొద్దిగా ముందుకు వంగి, ట్రేని వినయ్ ముందు పట్టుకుంది. అంతసేపూ ఆమె శరీర వర్ణంలో కలిసిపోయిన సన్నటి బంగారు గొలుసు కిందికి వేళ్ళాడింది. నక్షత్రం ఆకారంలో ఉన్న లాకెట్ కొద్దిగా ఉయ్యాల ఊగింది. కప్పు అందుకుంటున్న వినయ్ ముఖంలోకి ఒకసారి చూసిందామె. పెద్ద

## రెజీనా టైం ఎప్పుడొస్తుందో....?



**కొం**దరికి అంతే! అన్నీ ఉన్నా టైం బాగాలేక తెరమరుగవుతూ ఉంటారు. మరికొందరికి ఏమీ రాదు. అయినా స్టార్ హీరోయిన్ అనిపించేసుకుంటారు. ఏమన్నా అంటే టైం బాబూ... టైం అంటారు. ఇది రెజీనా విషయంలో నూటికి నూరుపాళ్ళు నిజం అయింది. రెజీనాకు అందం లేదా? అంటే కావలసినంత ఉంది. నటన రాదా? అంటే చాలా మంది హీరోయిన్ల కన్నా చాలా బెటర్ అంటారు. ఎక్స్‌పోజింగ్‌కు అభ్యంతరం పెడుతుందా? అంటే అదీ లేదు. అడగాలే కానీ అందాలన్నీ ఆరబోయడానికి సై అంటుంది. మరి ఇన్ని ఉన్నా రెజీనాకు మాత్రం టాలీవుడ్‌లో సరైన గుర్తింపు దక్కలేదు. ప్రస్తుతానికి రెజీనా చేతిలో 'నక్షత్రం' తప్పించి ఒక్కటంటే ఒక్క తెలుగు సినిమా లేదు. ఆ సినిమా కూడా ఎప్పుడు విడుదల అవుతుందో తెలియని అయోమయ స్థితి. ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే రెజీనా పేరును టాలీవుడ్ జనాలు మరిచిపోయే పరిస్థితి వస్తుందని ఆమె అభిమానులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

పెద్ద కాటుక కళ్ళు ఏవో కాంతుల్ని వెదజల్లు తున్నట్టనిపించింది వినయ్‌కి.

సంధ్య అందరికీ కాఫీలు అందించి సోఫాలో కూచుంది. కాఫీ చప్పరిస్తూ, కప్పు అంచుమీంచే ఆమెనే చూస్తున్నాడు వినయ్.

ఆనందరావు దగ్గి గొంతు సవరించుకున్నాడు. "అన్నట్టు చెప్పడం మరిచాను. అమ్మాయి శాస్త్రీయ సంగీతం సాధన చేసింది. ఆ మధ్య తిరుమల తిరుపతి దేవ స్థానం నిర్వహించిన అన్నమయ్య సంకీర్తనల పోటీలో ప్రథమ బహుమతి గెల్చుకుంది..."

"రిమార్కబుల్! కంగ్రాట్స్!" వినయ్ అసంకల్పి తంగా అన్నాడు.

"థాంక్స్..." సంధ్య చిరునవ్వు నవ్వింది.

"సంధ్య చక్కగా పాడుతుంది. వినండి సరదాగా!" అంటూ ఆనందరావు కూతురివైపు తిరిగాడు. "పోటీలో పాడిన సంకీర్తన ఏదమ్మా! ఆధ్యాత్మకీర్తనా? శృంగార కీర్తనా?"

"...శృంగార కీర్తనే నాన్నా".

"ఏదీ పాడమ్మా... విందాం. అన్నమయ్య పాట లంటే నాకెంతో ఇష్టం" శాంతమ్మ అంది. "శ్రీరంగం గోపాలరత్నం అనే గాయని మహావిద్వాంసురాలు. అన్నమయ్య కీర్తనల్లో అద్భుతమైన వాటిని చక్కగా పాడారావిడ!"

"ఔనాంటీ... ఆమె పాడిన రాగంలోనే నేను పోటీలో పాడాను" సంధ్య అంది.

"అలాగా! పాడు... విందాం!" శాంతమ్మ ఉత్సా హంగా అంది.

సంధ్య గొంతు సవరించుకుంది. మరుక్షణం ఆమె కంఠస్వరం కోకిల కంఠాన్ని వెక్కిరిస్తూ హాల్లో ప్రతిధ్వనించింది.

"ఏమని పొగడుదుమే యిక నిన్నును

ఆమని సొబగుల అలమేల్మంగా!" అనే పల్ల వితో ప్రారంభమయ్యే అన్నమయ్య సంకీర్తన సంధ్య గళమాధుర్యంతో ప్రాణం పోసుకుంటోంది. హృదయాన్ని పారవశ్యంలో ఓలలాడించే మృదు మధురమైన రచన. తేనెల తేటల తెలుగులో... మేనును పులకింపజేసే కంఠస్వరం... వినయ్ ఆలో చిస్తూ, ఆలకిస్తూ, రెప్పవేయకుండా సంధ్యనే చూస్తూ ఉండిపోయాడు. కనురెప్పలు ఆమె కళ్ళమీ దికి కొద్దిగా వాలి ఉన్నాయి. కుడిచేతివేళ్ళు తొడ మీద తాళం వేస్తున్నాయి.

"...తావుకొన్న మీ తమకములే కదే

కావించిన మీ కల్యాణములు..." చివరి చర ణంలోని చివరి పంక్తులు. మళ్ళీ ఒకసారి పల్లవిని పాడి, ముగించింది సంధ్య.

"అద్భుతం!" శ్రీనాథరావు ఉద్రేకంతో అన్నాడు. "పాటకు ప్రాణం పోశావమ్మా! ఆ ఏడుకొండల వాడు నీకు చక్కటి సంగీత జ్ఞానం ఇచ్చాడు!"

"ఫస్టు ప్రైజొచ్చిందంటే ఎందుకు రాదూ?" శాంతమ్మ అంది.

"ఎన్‌థ్రాలింగ్! రియల్లీ.. చాలాబావుంది! కంగ్రాట్స్" వినయ్ కంఠంలో ఆవేశం, ఆనందం జమిలిగా పలికాయి.

సంధ్య చిరునవ్వు అతనికి మౌనంగా థాంక్స్ చెప్పింది.

"ఆనందరావుగారూ... అమ్మాయిని చూశాం... మాకు నచ్చింది." శ్రీనాథరావు ప్రారంభించాడు. "మాకు అంటే మా ఇద్దరికీ అన్నమాట. అబ్బాయి అభిప్రాయం అబ్బాయే చెప్పాలి" శాంతమ్మ కల్పించు కుంటూ అంది.

"మా సంగతీ అంతే. మా ఇద్దరికీ అబ్బా యేమో నచ్చాడు. అమ్మాయి సంగతి అమ్మాయి చెప్పాలి!" సుమిత్ర నవ్వుతూ అంది.

"అబ్బాయి అభిప్రాయం తెలుసుకుని ఫోన్ చేయండి శ్రీనాథరావుగారూ" ఆనందరావు అన్నాడు.

"మీరూ మీరూ మాట్లాడుకోవడం, ఆలోచనలు పంచుకోవడం బాగానే ఉంది అంకుల్!" సుధ నవ్వుతూ అంది. "అబ్బాయీ అమ్మాయీ కూడా మాట్లాడుకుని, ఆలోచనలు పంచుకోవాలిగా!" "వెల్‌సెడ్! మీ అమ్మాయి చక్కగా చెప్పింది. ఈ కాలం పిల్ల కదా!" ఆనందరావు శ్రీనాథరావు దంప తుల్ని చూస్తూ అన్నాడు.

"మా అభ్యంతరం ఏమీలేదమ్మా సుధా. మేడ మీద అమ్మాయి గది ఉంది. ఇద్దర్నీ తీసుకెళ్ళు!" సుమిత్ర నవ్వింది.

"సంధ్యా, వెళ్ళు తల్లీ!" ఆనందరావు అన్నాడు అనుమతి ఇస్తున్నట్టు.

సుధ లేచి నిలుచుంది. "రా అన్నాయ్!"

వినయ్ సంధ్య వైపు చూస్తూ నిలుచున్నాడు. సంధ్య లేచి నిలుచుంది.

ముందు సంధ్య, సుధ... ఇద్దరికీ వెనగ్గా వినయ్. ముగ్గురూ మేడమెట్లు ఎక్కసాగారు. వినయ్ కళ్ళు అప్రయత్నంగా సంధ్యనే చూస్తున్నాయి. ఒక్కొక్క మెట్టే ఎక్కుతున్న సంధ్య తీగ శరీరం లోంచి అందం చిందుతోంది. అయస్కాంత సుందరిలా సంధ్య అతని చూపుల్ని అదేపనిగా లాగుతోంది.

ముగ్గురూ గదిలోకి వెళ్ళారు. సంధ్య తలుపు మూసి, ఎయిర్‌కండిషన్ ఆన్ చేసింది. ఒక మూలలో ఎల్.ఇ.డి. టీవి లేటెస్ట్ మోడల్ ఉంది. మరోవైపు గోడకి వెడల్పాటి అర. అరనిండా పుస్తకాలు... మరో గోడకి 'జలపాతం' ఆయిల్ పెయింటింగ్.

"కూర్చోండి..." గదిని కలియజూస్తున్న వినయ్‌ని సంధ్య హెచ్చరించింది.

సుధ కూచుని, వెంటనే పైకిలేచింది. "నా మొబైల్ మోగుతున్నట్టుంది. సోఫా మీదే మరిచి పోయి వచ్చాను. మీరు మాట్లాడుతూ ఉండండి. ఇప్పుడే వస్తా... సారీ.."

వేగంగా వెళ్తున్న సుధని వినయ్ చిరునవ్వుతో చూశాడు. సుధ సెల్ తీసుకురాలేదు. తనకు తెలుసు! తమ ఇద్దరికీ ఏకాంతం కల్పించడం కోసం తెలివిగా జారుకుందనీ తనకు తెలుసు!

వినయ్ పేముకుర్చీలో కూచున్నాడు. ఇంకా నుంచునే ఉన్న సంధ్యను చిరునవ్వుతో చూశాడు.

"ప్లీజ్ సిడౌన్".

సంధ్య కూచుంది. తన ఎదురుగా కుర్చీలో కూచున్న సంధ్యను వినయ్ నిదానించి చూశాడు. "మీతో డైరెక్టుగా మాట్లాడి, అభిప్రాయం తెలుసుకో వాలని నేను అనుకున్నాను. సమయానికి సుధ..."

సుస్మితంగా ధ్వనించిన సంధ్య నవ్వు అతనికి అడ్డు తగిలింది. "సుధ తెలివైన, చలాకీ పిల్ల!"

"యా! కరెక్ట్.. వెరీషార్ప్!" వినయ్ నవ్వాడు. "డైరెక్ట్‌గా అడుగుతున్నందుకు ఏమీ అనుకోకండి. నిస్సంకోచంగా నిజం చెప్పండి. లెటస్ బీ వోపెన్! నేను నచ్చానా... మీకు?"

సంధ్య కనురెప్పలు మెరుస్తున్న కళ్ళమీదికి బరు వుగా వాలాయి. "మీరు అనకండి 'నువ్వు' అనండి.."

వినయ్ కొంచెం ఆశ్చర్యంగా చూశాడు. "ఓహ్... థాంక్యూ.. అదే... నేను నచ్చానా!"

సంధ్య తల సిగ్గు బరువుతో పైకీ, కిందికీ నెమ్మ దిగా కదిలింది.

వినయ్ చిన్నగా నవ్వాడు. "సమాధానం మాటల్లో కావాలి నాకు. కళ్ళతో చూడ్డమొక్కటే చాలదు; చెవుల్తో వినాలి!"

సంధ్య కనురెప్పలు పైకి లేచాయి; దీపాలకు అడ్డుగా ఉండి, తొలగిన అరచేతుల్లా "నచ్చకపోతే మేడమెట్లు ఎక్కేదాన్ని కాను."

"థాంక్యూ! ఇంకొక విషయం నీకు చెప్పాలి. మరో మూడేళ్ళు నేను అమెరికాలోనే ఉంటాను. ఆ తరువాత ఇండియాకి వచ్చేస్తాను. అమ్మనూ, నాన్ననూ చూసుకోవాలి."

సంధ్య అర్థమైనట్టు తల ఊపింది. చెవిరిం గులు గమ్మత్తుగా కదిలాయి.

**(ఇంకా వుంది)**

# హార్మోన్ సమస్యలు

మనిషి జీవించడానికి శ్వాస ఎంత ముఖ్యమో మనిషి ఆరోగ్యంగా ఉండాలంటే శరీరంలో ఉత్పత్తి అయ్యే హార్మోన్లు అంతే ముఖ్యం. గర్భాశయంలో పిండంగా ఏర్పడినప్పటి నుంచి మనిషి కాలం తీరేంతవరకు శరీరము మీద హార్మోన్ల ప్రభావం కలిగి ఉంటుంది. శరీరంలోని ఒక కణము నుండి మరొక కణంకు రసాయనిక సమాచారం అందజేయబడి, సంకేతంను తెలిపే కెమికల్స్‌ను హార్మోన్లు అంటారు. మెదడు భాగంలోని హైపోథలామస్ మరియు పిట్యూటరిగ్రంథి హార్మోన్ల ఉత్పత్తికి దోహదపడి శరీరంలోని కణాల క్రమబద్ధనకు ప్రాముఖ్యత వహించును. ఈ హార్మోన్లు శరీర ఉష్ణోగ్రతను, ఆకలిని, మానసిక స్థితిని, నిద్రను, దాహము, కామక్రోధమును అదుపులో వుంచుతాయి. ఈ మధ్య కాలంలో హైపోథైరాయిడ్, పి.సి.ఒ.డి, సంతానలేమి, డయాబెటీస్ వంటి ధీర్ఘకాలిక జబ్బు లన్ని హార్మోన్ అసమతూల్యత వల్ల వచ్చేవే. చాలా రకాల హార్మోన్లు మన శరీరాన్ని ప్రభావితం చేస్తాయి. హార్మోన్లు పాలిపెప్టైడ్‌తో నిర్మితమైన రసాయన వాహకాలు. ఇవి శరీరంలో ఒక ప్రాంత కణజాలం.. అవయవాల నుంచి ఉత్పత్తిఅయి, వివిధ శరీర భాగాల కు రక్తం ద్వారా ప్రవహించి నిర్దిష్ట అవయవాన్ని ప్రభావితం చేసి జీవప్రక్రియల సమతుల్యతకు తోడ్పడ తాయి. ఈ హార్మోన్ల సమతూల్యం దెబ్బతిన్నప్పుడు దీర్ఘకాలిక వ్యాధులు బారిన పడతారు. ఈ హార్మోన్లు ఎండోక్రైన్, ఎక్సోక్రైన్ గ్రంథుల నుంచి ఉత్పత్తి అవుతాయి. శరీరంలో ఇవి సూక్ష్మమోతాదులో ఉత్పత్తి అయినప్పటికీ ప్రభావం ఎక్కువగా ఉంటుంది. సాధారణ జీవక్రియలైన జీర్ణక్రియ, శారీరక, మానసిక ఎదుగుదల, మానసిక సమతూల్యత జీవక్రియలకు తోడ్పడతాయి. థైరాయిడ్ హార్మోన్లు టీ3, టీ4 ఇవి థైరాయిడ్ గ్రంథి నుంచి ఉత్పన్నమవుతాయి. వీటి అసమతూల్యత వల్ల హైపో థైరాయిడ్, హైపర్ థైరాయిడ్, గాయిటర్ అనే ధీర్ఘకాలిక జబ్బులు వస్తాయి.

**స్త్రీలలో హార్మోన్స్ సమస్యలు:** ఈస్ట్రోజన్, ప్రొజెస్టిరాన్, ప్రోలాక్టిన్, ఆక్సిటోసిన్ హార్మోన్లు స్త్రీలలో నెలసరి, ద్వితీయ లైంగిక లక్షణాలు, సంతానోత్పత్తి, ప్రసవంలో ఉపకరిస్తాయి. ఈ హార్మోన్లు అసమతూల్యత వల్ల స్త్రీలలో నెలసరి సమస్యలు, అవాంఛిత రోమాలు, సంతానలేమి సమస్యలు వస్తాయి. స్త్రీలలో మెనోఫాజ్, నెలసరి వచ్చే సమయంలో హార్మోన్ల హెచ్చు తగ్గుల వల్ల వేడి ఆవిర్లు, మానసిక అశాంతి, నీరసం, కీళ్లనొప్పులు వస్తాయి.

**పురుషుల్లో హార్మోన్స్‌సమస్యలు:** మగవారిలో ముఖ్యంగా టెస్టోస్టిరాన్ అనే హార్మోన్ ఉత్పత్తి అయి ఎముకల సాంద్రతకు, కండరాల పటుత్వానికీ, వీర్య కణాల వృద్ధికి ఉపయోగపడుతుంది. ఈ టెస్టోస్టిరాన్ లోపం వలన సెక్స్‌ప్రాబ్లమ్స్, కండరాల పటుత్వం తగ్గి పోవటం, డిప్రెషన్, టైప్2 డయాబెటీస్ అంతే కాక ఎల్.హెచ్ & ఎఫ్.యస్.హెచ్ డెఫిసియెన్సీ వలన హైపోగోనాడిజమ్ వచ్చేఅవకాశం ఉంది.టెస్టోస్టిరాన్ హార్మోన్ అసమతూల్యత వల్ల శీఘ్రస్కలనం, అంగస్తంభన సమస్యలు, వీర్యకణ లోపాలు, సంతాన లేమి సమస్యలువస్తాయి. పిల్లల్లో బరువు, ఎత్తు, ఎదుగుదల సమస్యలు వస్తాయి.

**హోమియో చికిత్స:** హార్మోన్ల ప్రభావము శరీరము మీద ఎంతో వుంది. థైరాయిడ్ సమస్యలో బాధ పడేవారు జీవితాంతం మందులు వాడాల్సి వస్తుందని వాపోతుం టారు. అంతేకాక మందులు మానేయుట వలన సమస్య పెరిగే అవకాశం ఉంది. థైరాయిడ్ సమస్య కాకుండా ఇతర హార్మోన్ల సమస్య లను తొలగించడానికీ ఇప్పుడు హోమియోపతిలో మంచి మందులు ఉన్నాయి. హోమియోపతిలో రోగి యొక్క శారీరక, మానసిక, అనువంశిక, వంశపారంపర్య తత్వాలనువిశ్లేషించి చికిత్సచేయుటం జరుగుతుంది. ఉదా॥ థైరాయిడ్‌కు కల్కేరియా కార్బ్, థైరాడిసమ్, ఐయోడమ్, బ్రొమియం, సల్ఫర్ మరియు ఇతర సమస్యలకు హోమియోపతిలో మంచి మందులు ఉన్నాయి. వీటిని అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణ లో వాడాలి. తద్వారా వ్యాధిని సమూలంగా నయం చేయువచ్చు.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**



# సయాటికా (గుధ్రసీ వాతము)

ప్రస్తుత పరిస్థితిలో మానవుని జీవితం చాలి యాంత్రికం గా మారిపోయింది. ముఖ్యంగా ఆహారపుఅలవాట్లు, దిన చర్య, స్వప్నవిపర్యయం (పగటినిద్ర, రాత్రి సమయానికి నిద్రపోకపోవటం) లాంటి విషయాలలో అనేక మార్పులు రావటం వలన, ఆందోళన, మానసికఒత్తిడి లాంటి సమస్యల వలన మానవులనేక వ్యాధులబారిన పడుతు న్నారు. అందులో అతి ముఖ్యమైనది (నడుమునొప్పి) కటిశూల. నూటికి 90మంది తమ జీవితకాలంలో ఎప్పుడో ఒకసారి ఈనడుమునొప్పిసమస్యతో బాధ పడుతున్నారు. ఆయుర్వేద శాస్త్రంలో చరక, సుశ్రుత, వాగ్భటులు ఈ సమస్యను గుధ్రసీవాతం(సయాటికా)గా పేర్కొంటూ ఎంతో విపులంగా వివరించారు.

దీనికి సాధారణ కారణాలు పరిశీలించినట్లయితే... ఎక్కువగా ఒకే పొజిషన్‌లో కూర్చోవటం, స్థూల కాయం, అధికశ్రమతో కాడిన పనులు ఎక్కువ సేపు చేయుటం, అధిక బరువులను మోయుటం, ఎక్కువ దూరం ద్విచక్ర వాహనాలు, కార్లలోప్రయాణించటం, కొన్ని దీర్ఘకాలిక వ్యాధులువలన, కొన్ని వంశపారం పర్య వ్యాధులవలన, మరికొన్ని రోడ్డుప్రమాదాల వలన ఈ నడుము నొప్పి సమస్య వస్తుంటుంది. ముఖ్యంగా పైన వివరించిన కారణాలవలన శరీరంలో వాతప్రకోపంజరిగి, ముందుగా పిరుదులకు పైభాగాన స్తబ్ధతను, నొప్పినికలిగించి తరువాత కటి ప్రదేశం (నడుము), తొడలు, మోకాళ్ళు పిక్కలు, పాదాలలో క్రమంగా నొప్పి కలుగుతుంది. దీనినే గుధ్రసీవాతాము (సయాటికా) అని అంటారు. ఈ సమస్య శీతాకాలంలో ఎక్కువ అవుతుంది. ముఖ్యంగా నడుముకు సంబందించిన ఎల్4-ఎల్5, ఎస్1-ఎస్2 వెన్నుపూసల మధ్యగల సయాటికా అనే నరంపై ఒత్తిడి పడటం వల్ల ఈ నొప్పి వస్తుంది.

**డిస్క్‌లో వచ్చేమార్పులు:** ఈ వ్యాధిలో వెన్నుపూసలమధ్య ఉండే డిస్క్‌లో కొన్ని మార్పుల జరుగుతాయి. అవి డిస్క్ మీద ఒత్తిడి పెరగటం, వాపురావటం లేదా డిస్క్‌కి రక్త ప్రసరణ సరిగా లేకపోవటం, అరిగిపోవటం అనే సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది. డిస్క్‌లో వాపు వస్తే దానిలోఉండే చిక్కనిద్రవం బయటకు వచ్చి మేరుదండం లేదా దాన్నుంచి వచ్చే నరాలపై ఒత్తిడి కలిగంచటం వల్ల నొప్పి వస్తుంది.

**లక్షణాలు:** నడుములో నొప్పి కలగటం, వాపు, కొంచెం శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగటం, ఈ నొప్పి సూదులతో గుచ్చినట్లుగా, ఒక్కోసారి తిమ్మిర్లు, మంటలతో కూడి ఉంటుంది. సమస్య తీవ్రమైనది అయితే స్పర్శహాని కూడా కలుగవచ్చు ఒక్కోసారి మల మూత్రాలమీద నియంత్రణకూడా పోయేప్రమాదంఉంది. వెన్ను నొప్పి బాధ అనగానే సాధారణంగా పెయిన్‌కిల్లర్స్ తో కాలయాపన చేస్తుంటారు. దీనివల్ల తాత్కాలిక ఉప శమనం కల్గుతుంది. కాని మలబద్దకం, జీర్ణా శయ సమస్యలు మొదలవుతాయి. కావున ఇలాంటి సమస్యల ను ప్రారంభదశలోనే గుర్తించి, జాగ్రత్త పడటం వల్ల ఈ వ్యాధిని సమూలంగా నయం చేయవచ్చు.

**ఆయుర్వేదచికిత్స:** ఆయుర్వేదంలో ఇలాంటి సమస్యల కు సమగ్రమైన చికిత్సాపద్ధతులుఉన్నాయి. అందులో **శమన చికిత్స:** ఇది దోషాలను బట్టి అభ్యంతరంగా వాడే ఔషధ చికిత్స ఇందులో వేదన, కాయకంగా ఔషదాలు ఉంటాయి. అలాగే వాతహర చికిత్సా పద్ధతులుంటాయి.

**శోధనచికిత్స:** శమన చికిత్స వలన ఒక్కోసారి మళ్ళీ వ్యాధి తిరగబెట్టవచ్చు. అందుకే ఆయుర్వేదంలో పంచకర్మ అనే ఒక ప్రత్యేక చికిత్సా పద్ధతి ఉంది. ఈ చికిత్సా పద్ధతీ ద్వారా ప్రకోపించిన వాతాది దోషాలను సమూలంగా తగ్గించవచ్చు.

**1.స్నేహకర్మ:** ఈ ప్రక్రియ ద్వారా వెన్నెముకలోని వెన్ను పూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపొందించి, తద్వారా జాయింట్స్‌లో కదలికలను తేలికగా చేయువచ్చును.

**2.స్వేదకర్మ:** ఈ పద్ధతిలో గట్టిగా అతుక్కొనిఉండే జాయింట్స్ ను మృదువుగా అయ్యేటట్లు చేయువచ్చును. కటివస్తి, ఈ ప్రక్రియ ద్వారా అరిగిపోయిన మృదులాస్థికి రక్త ప్రసరణను పెంచి తద్వారా నొప్పి తీవ్రతను తగ్గించ వచ్చును. అలాగే సర్వాంగధార, వస్తికర్మ అనే విశిష్ట చికిత్సా పద్ధతుల ద్వారా నాడీ కణాలలో కలిగిన లోపాల ను సరిచేయువచ్చు, అదేవిదంగా ప్రకోపించిన వాతాన్ని సమస్థితికి తీసుకురావచ్చు.

జాగ్రత్తలు:సరిఅయిన పోషకఆహారాలు తీసుకోవడం. నిదాన పరివర్జనం అనగా పైన చెప్పిన ప్రత్యేక వ్యాధి కారణాలను మళ్లీ చేయకుండా జాగ్రత్త పాటించినట్ల యితే ఈ సమస్యనుంచి శాశ్వతవిముక్తి పొందవచ్చును.

**డా. లక్ష్మీ.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

# ఈ భవనాల ఖరీదెంతో తెలుసా?


ద మనార్

**కడుపునిండా తిండి.. కట్టుకోవడానికి బట్ట.. ఉండటానికో గూడు... ఇవీ ప్రతి వ్యక్తికీ కావలసిన కనీస అవసరాలు. నిరుపేద నుంచి కోటీశ్వరుడి వరకూ, ఎవరు ఎంత కష్ట పడినా వీటి కోసమే. కూడు, గుడ్డ విషయాలెలా ఉన్నా ఓ వ్యక్తి స్థాయి ఏమిటో వాళ్లు ఉండే ఇల్లు చూస్తే తెలుస్తుందని వేరుగా చెప్పనక్కర్లేదు. ఎన్ని అంతస్తుల భవనంలో ఉంటు న్నారు? ఇంట్లో ఫర్నీచర్‌ను ఏ దేశాల నుంచి తెప్పించారు? ఇల్లు కట్టేందుకు ఎంత ఖర్చ యింది? అనే దాన్నిబట్టి ప్రస్తుత సమాజం ఓ వ్యక్తికి గౌరవం ఇస్తోందనడంలో ఏమాత్రం సందేహం లేదు. రోడ్డుపై నడుచుకుంటూ వెళ్తున్నప్పుడు ఆకట్టుకునే ఇల్లు కనిపిస్తే, 'ఈ ఇల్లు కట్టేందుకు ఎంత ఖర్చయిందో..' అని మనసులోనే లెక్కలు కట్టుకోని వారు ఉండరు. మహా అయితే పది కోట్ల రూపాయల్లో బంగారంలాంటి భవనాలను చూసే ఉంటారు కానీ.. వందలు, వేల కోట్ల రూపాయలు పెట్టి రాజప్రాసాదాలనే నిర్మించి, వాటిని స్వగృహాలు గానో, వ్యాపారకేంద్రాలుగానో బడా వ్యాపారవేత్తలు ఉపయోగిస్తున్నారు. సామాన్యుడి ఊహకు కూడా అందని రేంజ్‌లో ఈ ప్రపంచంలో అత్యంత ఖరీదైన భవనాలు ఎన్ని ఉన్నాయి? ఒక్కో భవనాన్ని నిర్మించేందుకు ఎంత ఖర్చయింది? అన్న వివరాల సమా హారమే ఈ బంగారంలాంటి భవనాలు..**

## వందేళ్లనాటి భవనం

1902వ సంవత్సరంలో బెల్జియం రాజు లియోపోల్డ్ II పెద్ద రాజప్రాసాదాన్నే కట్టించారు. 50 ఎక రాల విస్తీర్ణంలో 11 బెడ్‌రూమ్‌లు, 14 బాత్రూమ్‌లు, ఔట్‌డోర్ కిచెన్, స్విమ్మింగ్‌పూల్, హెలీపాడ్ వంటి సదుపాయాలకు కొదవేలేదు. ఫ్రాన్స్‌లో 'విల్లా లియోపోల్డా' అని పిలుస్తున్న ఈ మహాసౌధాన్ని లియోపోల్డ్ తన ప్రియురాలికి కానుకగా ఇచ్చారు. 1988వ సంవత్సరంలో ఆమె నుంచి లెబనీస్ బ్యాంకర్ ఎడ్మండ్ సాఫ్రా దీన్ని కొన్నారు. 1999లో ఆయన చనిపోయిన తర్వాత ఈ భవనం యజ మానురాలిగా, ఇప్పటికీ, ఆయన భార్య లిలీ సాఫ్రా కొనసాగుతున్నారు. 2008లో ఈ భవనాన్ని కొనేందుకు రష్యన్ బిలియనీర్ మైఖెల్ ప్రోఖోరోవ్ ప్రయత్నించారు. దాదాపు 750 మిలియన్ డాలర్లు (4881 కోట్ల రూపాయలకు పైగానే) ఖర్చుపెట్టి ఈ భవనాన్ని తన సొంతం చేసుకుం దామనుకున్నారు. కానీ ఆయన ఆశలు ఫలించలేదు. 'ద రెడ్ షూస్, టు క్యాచ్ ఎ థీఫ్' వంటి సినిమాలు ఈ భవనంలోనే రూపుదిద్దుకున్నాయి.


అప్‌డాన్ కోర్ట్

## మొనాకోలో ఆకాశహర్మ్యం

ఒకటి కాదు రెండు కాదు ఏకంగా 560 అడుగుల ఎత్తున్న ఆకాశహర్మ్యం ఒకటి మొనా కోలో ఉంది. 2015లో నిర్మించిన ఈ భవనం విలువ అక్షరాలా 400 మిలియన్ డాలర్లు (2600 కోట్ల రూపాయలు). యూరప్‌లోని మెడిటెర్రేనియన్ సముద్రతీర ప్రాంతాల్లో అత్యంత ఎత్తయిన రెండో భవనంగా పేరొందిన దీనిలో ఎన్నో విశిష్టతలు ఉన్నాయి. మొనాకోలోని మోంటె కార్లోలో నిర్మించిన ఈ భవనానికి 'స్కై పెంట్‌హౌస్' అని పేరుంది. 35 వేల 500 అడుగుల విస్తీర్ణంలో నిర్మించిన ఈ భవనంపై నుంచి చూస్తే, సముద్రాన్ని 360 డిగ్రీల కోణంలో నుంచి చూస్తే ఎలా ఉంటుందో అలా కనిపిస్తుంది. భవనం పై భాగం అంతా గుండ్రంగా ఉండటం దీని విశిష్టత. లోపల ఉండే అత్యాధు నిక సౌకర్యాలకు ఏమాత్రం కొదవ లేదు.

## నింగినంటే భవనం

అమెరికాలోని న్యూయార్క్ నగరం... కోటీశ్వరులకు నిలయమని పేరు. అత్యంత శక్తిమంతమైన పౌరులని వీళ్లకు పేరు. వీళ్లు ఉండే భవంతులను చూసే న్యూయార్క్ నగరానికి ఈ పేరు వచ్చిందంటే అతిశయోక్తి కాదేమో. అమెరికన్ వ్యాపారవేత్త ఇరా రెన్నెర్ట్‌కు కూడా ఓ విలువైన భవనం ఉంది. దీని విలువ అక్షరాలా 170 మిలియన్ డాలర్లు (1103 కోట్ల రూపాయలకు పైగానే). న్యూయార్క్ నగరంలో ఈ నివాసాన్ని తల దన్నే భవనం లేదని అందరూ అంటుంటారు. 63 ఎకరాల విస్తీర్ణంలో ఉండే ఈ భవనం ఎన్నో విశేషాలకు నిలయం. లక్షా యాభై వేల


బెవర్లీ హౌస్

డాలర్లతో ప్రత్యేకంగా ఓ హాట్ టబ్‌ను ఏర్పాటు చేయడం మరీ విశేషం.

## కాలిఫోర్నియాలో కళ్లుచెదిరేలా

ఆంగ్ల అక్షరం 'H' ఆకారంలో భవనం, 50 అడుగుల వైశాల్యంలో హాలు, పెద్ద లైబ్రరీ, భవనం చుట్టూ ప్రహరీ, 400 మంది కూర్చునేలా టెర్రస్, నైట్‌క్లబ్, రెండు థియేటర్లు, స్విమ్మింగ్ పూల్.. వంటి సదుపాయాలతో అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో ఓ కళ్లు చెదిరే భవనం ఉంది. బెవెర్లీ హిల్స్‌లో ఉండే ఈ కళ్ళు చెదిరే భవనానికి 'బెవర్లీ హౌస్' అని పేరు. ఈ భవంతిని కట్టేందుకు ఏకంగా 165 మిలియన్ డాలర్లు (1070 కోట్ల రూపాయల పైగానే) ఖర్చుపెట్టారట. ప్రఖ్యాత ఆర్కిటెక్చర్ గోర్డాన్ కౌఫ్మాన్ ఆధ్వర్యంలో బ్యాంకింగ్ ఎగ్జిక్యూటివ్ మిల్టన్ గెట్జ్ ఈ భవనాన్ని నిర్మించారు. 1946లో నిర్మించిన ఈ భవనంలో 1951 వరకూ మిల్టన్ నివసించారు. ఆయన మరణించిన తర్వాత యూఎస్ న్యూస్‌పేపర్ ఐకాన్ విలియం రాండోల్ఫ్ దీని యజమానిగా మారారు. ఈ భవనాన్ని నివాస స్థలంగానే కాకుండా సినిమాల చిత్రీకరణకు కూడా ఉపయోగిస్తున్నారు. హాలీవుడ్ సినిమాలు 'ద గాడ్‌ఫాదర్, బాడీగార్డ్' ఈ భవనంలోనే రూపొందాయి. లగ్జరీ లైఫ్‌ను కొద్దిరోజులయినా ఎంజాయ్ చేయాలనుకునేవారు ఈ భవనంలో అద్దెకు ఉండొచ్చు. కాకపోతే నెలకు 6 లక్షల డాలర్లు (దాదాపు 4 కోట్ల రూపాయలు) చెల్లించాలి.

## విక్టోరియన్ విల్లా

అయిదంతస్తుల భవనం.. అయితేనేమీ.. అన్నీ అత్యాధునిక హంగులే. స్విమ్మింగ్‌పూల్, రూమ్ థియేటర్, జిమ్.. ఇలా ఎన్నో సదుపాయాలు ఉన్న భవనం లండన్‌లో ఒకటి ఉంది. దాని పేరే 'విక్టోరియన్ విల్లా'. దీని ఖరీదు 161 మిలియన్ డాలర్లు (1044 కోట్ల రూపాయలు). ఉక్రెయిన్ వ్యాపార మహిళ ఎలెనా ఫ్రాంచుక్ దీని యజమాని. లగ్జరీ నివాసంగా దీనికి పేరుంది.

## మనార్ భవనం

123 గదులు, రెండు గదుల్లో లైబ్రరీ, కమర్షియల్ కిచెన్, డాన్సింగ్ రూమ్, స్విమ్మింగ్‌పూల్, టెన్నిస్ కోర్ట్.. వంటి ఎన్నో సదుపాయాలు ఉన్న భవనం ఒకటి లాస్‌ఏంజెల్స్‌లో ప్రజలను ఆకర్షిస్తుంటుంది. కాలిఫోర్నియాలోనే అత్యంత ఖరీదైనదిగా చెప్పుకునే ఈ భవనం పేరు ద మనార్ భవనం. 1991వ సంవత్సరంలో నిర్మించిన ఈ భవనం విలువ 150 మిలియన్ డాలర్లు (953 కోట్ల రూపాయలకు పైగానే). ఫ్రెంచ్ స్టైల్‌లో నిర్మించిన ఈ భవనాన్ని 4.6 హెక్టార్ల విస్తీర్ణంలో నిర్మించారు. తెలుపు రంగులో భవనం, చుట్టూ పచ్చటి తోట.. ఆహ్లాదకరమైన వాతావరణం.. చెప్పలేనన్ని సదుపాయాలు.. ఇలా ఈ భవనంలో ఉంటే ఆ హాయే వేరు.

## ఇంగ్లాండ్‌లో ఇంద్రభవనం

ఇంగ్లాండ్‌లోని సుర్రీలో విండ్లెషామ్ వద్ద ఉండే ఓ భవనం కూడా ప్రపంచంలో అత్యంత ఖరీదైనదే. విభిన్న ఆకృతులతో నిర్మించిన ఈ భవనం విలువ 139 మిలియన్ డాలర్లు (902 కోట్ల రూపాయలు). 58 ఎకరాల విస్తీర్ణంలో నిర్మించిన ఈ భవనం చూడగానే ఎవరినైనా ఆకట్టుకోగలదు. ఈ భవనంలో మొత్తం 103 గదులు ఉన్నాయి. లగ్జరీ సదుపాయాలకు కొదవేలేదు. దీన్ని 1998లో కట్టడం మొదలు పెడితే, 2006లో పూర్తయింది. 'అప్‌డౌన్ కోర్ట్' అని పిలిచే ఈ భవనం ప్రస్తుత యజమాని ప్రముఖ వ్యాపారవేత్త ఎల్లీన్ వెర్కోయ్. ఈ నివాసంలో తన రెండో భార్య జెన్నీతో కలిసి ఉంటున్నారు.

## మ్యూజియంగా మారి ఆకట్టుకుంటోంది

రొమేనియాలోని బ్రాన్‌లో ఓ మ్యూజియం ఉంది. గతంలో దీన్ని నివాస భవనంగా వినియోగించారు. 1980వ సంవత్సరం నుంచి మ్యూజియంగా మారి సందర్శకులను ఆకట్టుకుంటోంది. డ్రాకులా కోట అని పిలిచే ఈ భవనం విలువ 135 మిలియన్ డాలర్లు (876 కోట్ల రూపాయలు). దీనిలో 57 గదులు, 17 బెడ్‌రూమ్‌లు ఉన్నాయి. అత్యాధునిక ఫర్నీచర్ చూపరులను ఇట్టే ఆకట్టుకుంటుంది. సినిమాల్లోని డ్రాకులా పాత్ర నివాస భవనంగా దీన్ని అభివర్ణిస్తుంటారు.

–కె. హసాన్
email:kandula.hassan@gmail.com

## మనోళ్ళూ మొనగాళ్లే

*భారత్‌లో విలాసవంతమైన భవనాలు ఏమీ లేవా..? అనుకుంటున్నారేమో! మనోళ్లు దేనిలోనూ తీసిపోరని వేరుగా చెప్పనక్కర్లేదు. 27 అంతస్తులు, 600 గదులు, భవనం నిర్వహణ బాధ్యతలు చూసుకునేందుకు ఇరవైనాలుగు గంటలూ 600 మంది పనివాళ్లు వెరసి ముంబైలోని ముఖేష్ అంబానీ 'అంటిలియా' భవనం. ఈ మహాసౌధం విలువ అక్షరాలా ఒక బిలియన్ డాలర్లు (6508 కోట్ల రూపాయలు). చికాగో నుంచి నిపుణులను రప్పించి ఈ భవనానికి ప్లాన్ గీయించారు. 168 కార్లు పార్కు చేసుకునేందుకు ఈ భవనంలో సదుపాయం ఉంది. మూడు హెలీప్యాడ్‌లు, గార్డెన్, దేవాలయం, అతిథులకు ప్రత్యేక గదులు, 50 మంది కూర్చునేలా ఒక హోమ్ థియేటర్.. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో విశేషాలు అంబానీ భవనంలో కొలువుతీరి ఉన్నాయి.*



డ్రాకులా క్యాజిల్



విల్లా లియోపోల్డా



స్కై పెంట్‌హౌస్



అంటిలియా




**పట్టుదల తన కాళ్లను కదిలిస్తున్నది! ఆ కదలిక ఎటు అన్నది మనసుకి ఓ మార్గం కనిపించడంలేదు. ఆశ మాత్రం చేతి బిగువులో ఉన్నది!**

**"వెతుకుతున్నదేదో దొరకనివాడిలా, వెతుకుతున్నదేంటో తెలియనివాడిలా ఉంటాడేంట్రా వాడు"**

**"అని నువ్వనుకుంటున్నావు. అసలు వాడి మనసులో ఏముందో ఎవరు చెప్పలేస్తారు".**

# చిత్తచిత్రిక!

దారిలో వినిపించిన ఆ మాటలు ఎవరో, ఎవరి గురించో శబ్దం చేశాయి.

తనని ఉద్దేశించినట్లే అనిపించాయి ఓ క్షణం! ఎందుకంటే తనదీ వెతుకులాటే కాబట్టి. నవ్వుకున్నాడు చిత్తచిత్రం!

ఏదో ఓ వృత్తిలో నిలదొక్కుకోవడం తన ముందున్న లక్ష్యం. తను చేరుకోవాల్సిన గమ్యం!

***

చిత్తచిత్రానికి జీవితకాల కోరిక, విజిటింగ్ కార్డు!

విజిటింగ్ కార్డులు ఇచ్చి పుచ్చుకోవడంలో థ్రిల్లు అంతా ఇంతా కాదనే ఓ నమ్మకం. చిత్తచిత్రం ఓ మానసికవేత్త! చిత్తచిత్రం ఓ మనోవైజ్ఞానిక నిపుణుడు. ఓ మనోవైకల్య పరిశీలకుడు. అలా ఎన్నోరకాలుగా ఆలోచించి చివరికి, చిత్తచిత్రం సైకాలజిస్ట్! అని తనపేరుకి తోక తగిలించుకున్నాడు. డర్బన్ రిటన్డ్ అని తోకకో వెంట్రుకని అంటించాడు. నాలుగువందల కార్డుల్ని ప్రింటు చేయించాడు. తెలిసినవాళ్ళకీ, తెలియనివాళ్ళకీ పంచడం మొదలుపెట్టాడు.

వీడు సైకాలజీ ఎప్పుడు చదివాడు? డిగ్రీ ఎవరిచ్చారు? డర్బన్ ఎక్కడుందో కూడా తెలియదే వీడికి! అని అనుకునే వాళ్ళేగాని తెగించి అడిగినవాళ్ళు లేరు. ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచి మూసుకున్నారే గాని వివరాల్లోకి వెళ్ళే సాహసం ఎవరూ చేయలేదు! "సార్! మీరు ఇప్పటికే పది కార్డులిచ్చారు" అనే వాళ్ళ సంఖ్య మాత్రం దినదిన ప్రవర్ధమానమవుతున్నది.

***

ఓ ఇండిపెండెంట్ ఇంటి ముందుగది తన వ్యాపకానికి వేదిక అయింది.

అంటే 'మెంటల్ క్లినిక్' తెరిచాడన్నమాట. "ఎన్నో ఏళ్ళుగా వేళ్లాడబడిన టులెట్ బోర్డు ఇప్పుడు ఊడి పడినట్లుందే" వీధిలో వెళ్ళే ఓ గొంతు వినిపించింది. అది తనకనవసరం.

అధికారదర్పం ఒళ్ళు విడిచిన ఓ విశ్రాంత అధికారి ఆ ఇంటి ఓనరు. పేరు కందర్పదర్ప. కందప్పగానే చాలామందికి తెలుసు. ఆయన నేమ్‌ప్లేట్‌కి పిట్టల రెట్టలు దుప్పటి కప్పాయి. ఆయన భార్యపేరు విదర్భ.

"తోడులేని బీడులా పడున్నవాణ్ణి, నీకు తోచినప్పుడు, తోచినంత ఇవ్వు" అని కందప్ప "ఎప్పుడో ఒకప్పుడు ఎంతో కొంత ఇస్తూనే ఉంటాను" అని చిత్తచిత్రం అద్దెమాటలు పంచుకున్నారు.

చెదరిన మనసులను దారిలో పెడతా, విరిగిన మనసులకు అంటుకడతా అనే అక్షరాలను పెద్దవిచేసి, కిటికీపైన మచ్చలు, మరకలు కనపడకుండా చేశాడు. నా దగ్గరకు వచ్చినప్పుడు అని ఓ వెర్రిమొహం ఫొటో, నా దగ్గర నుంచి వెళ్ళేటప్పుడు అని ఓ వెలుగు మొహం ఫొటో పెట్టాడు. మెదడు, మెదడులో భాగాలతో పాటు ప్రముఖ సైకాలజిస్టుల ఫోటోలు జత చేశాడు. ఓ లావాటి సైకాలజీ పుస్తకం చదువుతూ మధ్యలో ఆపినట్లు ఓ గుర్తుపెట్టాడు. మొత్తానికి ఆ గదికి కావాల్సిన హంగులన్నీ ఏర్పాటుచేశాడు. ఆ ఇంటికివచ్చే పడుచు పనిమనిషి చిటికె. ఊడ్చి తుడిచి, నీళ్ళుపట్టి పెట్టే పనిలో పెట్టాడు. కడు మిత భాష భూషణం చిటికె!

ఇక తనకు ఇష్టమైన అంశం "సంసారాల్లో కలతలెందుకువస్తాయి" అనేది. అయితే చిక్కు ఎక్కడొచ్చిపడిందంటే, తనకు పెళ్ళి కాలేదు. చేసుకోడానికి ఎవరూ ముందుకు రాలేదు, తనూ ముందుకు వెళ్ళలేదు. సంసార రహస్యం తనేం చెప్పలేస్తాడు!

**జీవితంలో ఏదో ఒక వృత్తిలో నిలదొక్కుకోవాలనుకున్నాడు చిత్తచిత్రం. ఇహనేం సైకాలజిస్టైపోయాడు . ఓ శుభ ముహూర్తాన బోర్డు తగిలించేశాడు. విజిటింగ్ కార్డులూ పంచేశాడు. అతడికి ఆశ్రయమిచ్చిన కందప్ప, విదర్భ దంపతులే చిత్తచిత్రానికి మొదటి కేసై కూర్చున్నారు. ఊహించని రీతిలో చిత్తచిత్రం వెంటపడింది విదర్భ! అదెలా సాధ్యమైంది? చివరకు చిత్తచిత్రం ఏం చేశాడు?**

పరకాయ ప్రవేశంచేసి తెలుసుకోడానికి తను ఆదిశంకరాచార్యులు కాదాయె, ఎలా!

అయినా పట్టుదల సడలేట్లు లేదు, చిత్తచిత్రానికి!

***

ఆ రోజు అమావాస్య! అమావాస్య వస్తే చాలు. ఆ ఇంట్లో పగలే చీకటి అన్న సంగతి తెలియదు. చిత్తచిత్రానికి! సాయంత్రం సరిగ్గా నాలుగ్గంటలు. ఆరిన బట్టలు దండాల మీదనుంచి తీసి మడత బెడుతున్నది చిటికె.

పారిపోతున్న దొంగ పరుగాపి, గేటుకు అతుక్కుపోయినట్లున్నాడు కందప్ప.

జనగమనాన్ని చూస్తున్నాడు. వంటిమీదేం లేదు ఓ లుంగీ గుడ్డ తప్ప.

సిగ్నల్స్ దొరక్క చెవికి సెల్లుని వత్తుతూ బయటికి వచ్చాడు చిత్తచిత్రం, విచిత్ర వీక్షణకు!

ఓ పెద్ద బిందె ఘటోత్కచుడి గదలావచ్చి కందప్ప వీపుని గుద్ది కిందపడి ఠంగుమంది. చెవులు పగిలే తిట్లు కేకలై, మైకు లేకుండానే అందరికీ వినిపిస్తున్నాయి. అది విదర్భ కోపాగ్ని!

జలస్తంభనవిద్యతో నీళ్ళల్లో దాక్కున్న దుర్యోధనుడు పరుష వాక్యాలు తట్టుకోలేక బయటకు వచ్చాడుగానీ, కందప్ప మాత్రం గేటు పట్టు వదలి వెనక్కి తిరిగి చూడడం లేదు. ఆఖరుగా, అయిదు గంటలు కొట్టిన గోడ గడియారం ఈసారి అయిదు ముక్కలై చేతులు విరిగి పడింది. కేకలు ఆగిపోయాయి.

తాగి పడేసిన కొబ్బరి బోండాల్లా, వాకిట్లో నిండిపోయిన బిందెల్నీ, చెంబుల్నీ గ్లాసుల్నీ, బకెట్లనీ, ఒక్కొక్కటీ తీసి ఇంట్లో పెడుతున్నాడు వాచిన వీపుతో ఉన్న కందప్ప. తన పని చేసుకుని ఇంటికి వెళుతున్న చిటికెను చూసి చిరునవ్వు నవ్వి లోపలికి వెళ్ళాడు పరిసరాలతో పట్టింపు లేకుండా!

***

భార్యలు భర్తల్ని కొట్టడం విన్నాడుగాని, చూడడం అదే మొదటిసారి! మొదలు మొదలే ఇంత తీవ్రమైన కేసా! తనకి. కలత కాదు, కలహం కాదు, ఏకంగా యుద్ధం. ఏకపక్ష ఆయుధ ప్రయోగం!

బెంబేలెత్తిన చిత్తచిత్రం అలా మూడు అమావాస్యలు చూశాడు. యుద్ధరీతిలో మార్పులేదు. కాకపోతే మూడో పోరులో పిండ్లూ, పండ్లూ నిండిన డబ్బాలతో విదర్భ విరాట్రూపం, కందప్ప రూపు కోల్పోయిన రూపం. దారినపోయే దానయ్యకు చెంబు కొట్టుకుంటే, కందప్పను బయటకులాగి పిడిగుద్దులు తినిపిస్తూ, కందప్ప లుంగీ గట్టిగా పట్టుకోవడం చూసి జాలి పడిన దానయ్య తన దారిన తాను వెళ్ళిపోయాడు!

***

తల్లి చనిపోయిందని తెలిసినా చలించని కందప్పని నలుగురు పట్టి లాక్కుపోయారు. గది వదిలేద్దామని నిర్ణయం తీసుకున్న చిత్తచిత్రం, అమావాస్యలో ఆ గంటసేపు ఏంటో ఎందుకో తెలుసుకోవాలనుకున్నాడు.

తన వయసులో సగానికి మించిన చిన్నదైన విదర్భకి ఉద్యోగం ఇచ్చి, భార్యగా మార్చి, ఉద్యోగం పీకేశాడు! అది తన పీకమీదకి వస్తుందనుకోని కందప్ప. చిటికెతల్లి, తల్లికాక ముందు ఇలాగే బలైంది.

కాకపోతే పెళ్ళి చేసుకోలేదు. ఉద్యోగం పీకేయలేదు. బంధువులకు దూరంగా ఉంచాడు. తాను దూరమయ్యాడు. ఆ ప్రక్రియ విదర్భ విషయంలో వికటించింది. ఇల్లు విదర్భ పేరుమీద రాయాల్సి వచ్చింది. అప్పటినుంచీ కందప్పకు సంసారసుఖం లేని శిక్షే అమలులో ఉంది.

***

ఓ రోజు అమావాస్య సాయంత్రం వేళైనా, ప్రత్యర్థి లేని ప్రశాంతత ఉంది. విదర్భతో మాట కలిపాడు.

"ఎందుకు ఎదురు తిరగడు!?" అది చిత్తచిత్రం మొదటి సందేహం.

"తిరిగాడు, విరిగాడు! నన్ను కాపాడే గంధర్వులు నాకు అయిదుగురున్నారు. సైరంధ్రికి భర్తలైతే, నాకేమో నా అన్నయ్యలు!"

"ముగింపు పలికేదెప్పుడు?"

"ముగింపు పలికినప్పుడే!"

"నీ వాంఛాత్యాగం సంగతేంటి" వద్దనుకుంటూనే అడిగాడు.

"అది నీకు చెప్పేదికాదు. నన్నిష్టపడితే చెప్పు నీదాన్నవుతా" అంది. ఖంగుతిన్నాడు చిత్తచిత్రం! అందం ఆకర్షణ లేందేం కాదు విదర్భ.

***

చిత్తచిత్రం విజిటింగు కార్డులన్నీ కాల్చి బూడిద చేశాడు. మకాం మహానగరానికి మార్చాల్సిందే! మూటాముల్లెతో రైలు స్టేషన్లో ఓ మూల బల్లమీద కూర్చున్నాడు.

"కుర్రోకురుకుర్రే" కేక చెవిలో మోగింది.

ఓ కోయవచ్చి పక్కనే కూర్చుని తదేకంగా తననే చూస్తున్నాడు.

ఓ అయిదు రూపాయలబిళ్ళ కోయ చేతిలో పెట్టబోయాడు.

"వొద్దొద్దెహె! నా మాట నీవు మనసుపెట్టి వినాలి. విన్నది మనసులోనే పెట్టాలి" అన్నాడు కోయ ఇంకాస్త దగ్గరగా జరుగుతూ.

"సరే, చెప్పు"

"నీవు సముద్రాలు దాటతావు కుర్రా!"

"నాకు ఈతరాదే!"

"ఎకసెకం చేయకు! నువ్వు అమెరిక వెళ్తావు"

"వెళ్ళాలంటే చాలాకావాలే! నా దగ్గరేం లేవే"

"అన్నీ వస్తాయి"

"సరే, నీకేం కావాలో చెప్పు"

"ఏమీ వద్దు! ఏది ముట్టినా మాట పట్టు తప్పుతుంది."

"ఏదో ఒకటి ఇవ్వకపోతే నా పట్టు తప్పుతుందే."

"తప్పనీయకులే! కురుకుర్రే కొనిపెట్టు."

"నువ్వు బిస్కట్లు తింటావా!"

"బుల్లి కోయకు ఇవ్వడానికి."

"మంచిది, నాకో సంగతిచెప్పు, నీవు మనసుల్ని ఎలా పసిగడతావు" ఉత్సుకతగా అడిగాడు చిత్తచిత్రం.

"సైకోయాలజీ!" చెప్పాడు కోయ.

***

మహానగరం చేరుకున్నాడు చిత్తచిత్రం!

కౌన్సెలింగ్ వృత్తిగా పెట్టుకున్న ఓ డాక్టరు దగ్గర రిసెప్షనిస్టుగా చేరాడు.



ఎందరో, ఎన్నిరకాల సమస్యలు, అనుభవాన్ని పెంచుతున్నాయి.

ఓ రోజు వెయింటింగ్‌హాలు ముందు వరసలో విదర్భ కూర్చుని ఉంది, మాటలేని చూపుతో! అక్కడ మాయమై ఇంకోచోట తేలాడు.

***

అది ఓ పెద్ద రచయిత వ్యక్తిత్వవికాసం పుస్తకాల ఆఫీసు. ప్రెస్సు, ప్రింటింగు పనులు చూస్తున్నాడు. అక్కడికీ వచ్చింది విదర్భ మూగచూపు. అక్కడ మాయమై ఓ ప్రసిద్ధ సైకాలజిస్టు దగ్గర చేరాడు! తనకు ఇష్టమైన పని. సమస్యలు వినడం. తనైతే ఏం చేసేవాడోనని ఆలోచించడం భలేగా ఉంది.

"ప్రేమించుకున్నాం. పెళ్ళిచేసుకున్నాం. పదహారు రోజులైన మర్నాడునుంచే ఒకళ్లంటే ఒకళ్లకు అసహ్యం పుట్టడం మొదలైంది. చిన్న స్పర్శతోనే ఆకాశాన్ని అందుకున్నంత ఆనందం ఎటు పోయిందో తెలియడం లేదు" అన్న జంటను ఓ ప్రత్యేక గదిలోకి తీసికెళ్ళాడు సైకాలజిస్ట్. చెప్పాడు,

"పవిత్రసంసారం అంటే సుఖసమయంలో అందాల్ని ఆనందించాలేగానీ అసహ్యాల్లో అందాల్ని వెతక్కూడదు. విభేదాలు మొదలయ్యేది అక్కడనుంచే!" తలుపు వేస్తుంటే ఆ మాటలు వినిపించాయి చిత్తచిత్రానికి. అదేంటో అర్థం కాక ఆలోచిస్తున్న చిత్తచిత్రానికి విదర్భ అందం మూగ నవ్వులో కనిపించింది.

***

అన్యధా శరణం నాస్తి అని భగవంతుడి ధ్యానం చేస్తూ ఓ గుడిమెట్లు తుడిచే సేవలో చేరాడు. మాధవసేవ, మానవసేవలో లీనమై ఉన్న చిత్తచిత్రం, పక్కనే మెట్లు తుడుస్తున్న విదర్భను చూశాడు! ఇక సంగతేంటో తెలుసుకోక తప్పింది కాదు.

"ఏమిటీ, మౌనవేట" అడిగాడు.

"నిన్ను గెలుచుకోడానికే!" ముక్తసరిగా అంది విదర్భ.

"అసలు నీ సైకాలజీ ఏంటి?"

"గొప్ప సైకాలజిస్టువి నీకే తెలియాలి!"

గావుకేక పెట్టాడు చిత్తచిత్రం.

"నాన్నా! నేను ఓడిపోయాను, నాన్నో!"

పెద్దగా నవ్వింది విదర్భ. ఆ నవ్వెందుకో అర్థం కాలేదు. చిత్తచిత్రానికి!

***

కోట్ల కోటీశ్వరుడి మూడో ముద్దులకొడుకు చిత్తచిత్రం!

నా గొడుగులోనే నా వెలుగుని చూసుకుంటానని తండ్రితో పంతమాడాడు.

"సరే చూసుకో" అన్నాడు తండ్రి. కానీ అడుగడుగునా తండ్రి నీడ తనమీద ఉంటుందనుకోలేదు. తన అనుభవక్షణాలన్నీ తండ్రి నోట విని ఆశ్చర్యపోయాడు.

"విదర్భకు విడాకులిచ్చి చిటికెతల్లిని పెళ్ళిచేసుకున్నాడు కందప్ప. ఆదర్శంగా ముందుకువచ్చే వాడికోసం ఎదురు చూస్తున్నది విదర్భ" చెప్పాడు తండ్రి.

"విదర్భ నా వెంట ఎందుకు పడింది?"

"నీ మనోనిగ్రహానికి నేనుపెట్టిన పరీక్ష. ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడవయ్యావు. ఆ ఆదర్శవంతుడివి నువ్వే అయితే నాకు సంతోషమే. అదేదైనా, నువ్వు అమెరికా వెళ్ళాలి, సైకాలజీలో పట్టా పుచ్చుకోవాల్సిందే" అన్నాడు తండ్రి.

***

విమానాశ్రయంలో తనను పంపించడానికి వచ్చిన వాళ్ళలో, ప్యాంటూ, చొక్కా వేసుకుని కోయ ఉన్నాడు. కుర్‌కురే బిస్కటు తింటూ.

"నాన్నా!"

కేకపెట్టి చెకిన్‌లోకి వెళ్ళాడు చిత్తచిత్రం!

# తినడానికీ ఓ డైరీ కావాలి!

**ఉదయంపూట టిఫిన్‌తో మొదలై , మధ్యాహ్నం భోజనం, సాయంత్రం స్నాక్స్ , రాత్రి మళ్లీ భోజనంతో రోజు ముగుస్తుంది. ఎక్కువ మంది అనుసరించే భోజన విధానం ఇదే. కానీ కొందరు తమకు నచ్చినట్టు ఎప్పుడు పడితే అప్పుడు, ఏదిపడితే అది ఆహారంగా తింటారు. కానీ అన్న పానీయాల విషయంలో సమయనియమాలు ఉన్నాయి. వాటిని పాటించడం తప్పనిసరి అంటున్నారు ఆరోగ్య నిపుణులు. అవేంటీ, ఎందుకూ అన్నది తెలుసు కోండి!**

నిజానికి మనం తిన్న ఆహారం జీర్ణం కావడానికి ఎన్నో అంశాలు ముఖ్య పాత్ర పోషిస్తాయి. తినే ఆహారపదార్థాల్లోని గుణాలు, పోషకాలు, కారణంగా శరీరంలో జీర్ణవ్యవస్థలో మార్పులు సంభవిస్తాయి. అంటే ఆహారం తినే విషయంలో కూడా మనం సమయాసమయాలు పాటించాలి. అందుకే ఏ సమయంలో ఏమి తినాలో పోషకాహార నిపుణులు, అధ్యయనవేత్తలు తెలియజేస్తున్నారు.

## అరటిపండ్లు

పేదవాడి నుంచి సంపన్నుల వరకు అందరూ ఇష్టపడే అరటి పండులో పొటాషియం అధికంగా ఉంటుంది. రోగనిరోధక వ్యవస్థను బలోపేతం చేయడంలో ఈ పండు కీలక పాత్ర పోషిస్తుంది. ఇందులో ఉండే ఫైబర్ జీర్ణవ్యవస్థకు మేలు కలిగిస్తుంది. ఇది సహజసిద్ధమైన యాంటాసిడ్‌గా పనిచేస్తుంది. కడుపులో మంట తగ్గాలంటే బాగా పండిన ఒక అరటిపండు తినాలి. చాలామంది భోజనం తర్వాత అరటిపండు తింటారు. కానీ రాత్రి భోజనం తర్వాత అరటి పండు తింటే ఊపిరితిత్తుల్లో మ్యూకస్ ఏర్పడడానికి, జలుబుకు దారితీస్తుంది. అందుకే ఎట్టి పరిస్థితుల్లోనూ రాత్రిళ్ళు అరటిపండు తినకూడదు. మధ్యాహ్న సమయంలో తింటే మంచి ఫలితం ఉంటుంది. ఖాళీ కడుపుతో అరటిపండు తింటే అసౌకర్యానికి కారణమవుతుంది.

## యాపిల్

రోజుకో యాపిల్ తింటే డాక్టర్‌తో పని లేదని చాలామంది అంటుంటారు. ఎందుకంటే యాపిల్ లో ఉండేవన్నీ మన ఆరోగ్యానికి ఎంతో మేలు చేసేవి. మరీ ముఖ్యంగా ఇందులో పెక్టిన్ అనే ఫైబర్ సమృద్ధిగా ఉంటుంది. ఇది రక్తంలో కొలెస్ట్రాల్‌ని, చక్కెర స్థాయిని నియంత్రిస్తుంది. రోజుకో యాపిల్ తింటే ఊపిరితిత్తుల పనితీరు చక్కగా ఉంటుంది. మలబద్ధక సమస్యను దూరం చేస్తుంది. అందుకే ఆరోగ్య ప్రదాతల్లో ఈ పండు కూడా ఒకటి. అయితే రాత్రి వేళల్లో యాపిల్ తినకపోవడమే మంచిది. యాపిల్‌లో ఉండే యాసిడ్స్ కడుపులో యాసిడ్ స్థాయిలను పెంచుతాయి. అంతేకాదు, పెక్టిన్ వల్ల రాత్రివేళ జీర్ణ వ్యవస్థపై భారం పడుతుంది. పెక్టిన్ కారణంగా ఎసిడిటీ మొదలవుతుంది. ఉదయం బ్రేక్‌ఫాస్ట్‌లో యాపిల్ తీసుకోవడంవల్ల తేలిగ్గా జీర్ణమవుతుంది.

## అన్నం

మన దేశంలో మరీ ముఖ్యంగా దక్షిణాది వారికి అన్నం ప్రధానాహారం. మధ్యాహ్నం, రాత్రి భోజనంలో భాగంగా అన్నం తప్పకుండా తింటారు. బియ్యంలో ఉండే కార్బోహైడ్రేట్లు తక్షణ శక్తినిస్తాయి. కార్బోహైడ్రేట్లు మనశరీరానికి అవసరమే కానీ అన్నం రూపంలోనే దాన్ని తీసుకోవాల్సిన అవసరం లేదు. కార్బోహైడ్రేట్లు ఎక్కువ అయితే అవి కొవ్వు రూపంలోకి మారుతాయి. దాంతో బరువు పెరుగుతారు. అందుకే జీవక్రియలు అధికంగా ఉండే పగటిపూట రైస్ తీసుకోవాలి. రాత్రి సమయంలో అన్నానికి బదులు వేరే పదార్థాలు తినాలి. బరువు తగ్గాలనుకునేవారు కచ్చితంగా రోజులో ఒక పూట అన్నం పరిమితంగానే తీసుకుంటే ఫలితం ఉంటుందని నిపుణులు చెబుతున్నారు.

## మాంసం

మాంసం ప్రోటీన్ల సమాహారం. ఇది జీర్ణం అయ్యేందుకు కనీసం నాలుగు నుంచి ఆరు గంటల సమయం పడుతుంది. అందుకే రాత్రివేళ మాంసాహారం తీసుకోరాదు. ఎందుకంటే మాంసం ద్వారా



వచ్చే అధిక కేలరీలు ఖర్చు కావు. దాంతో అవి కొవ్వుగా మారిపోతాయి. మాంసాన్ని ఉదయం, మధ్యాహ్నం వేళల్లో తినడమే నయం. గ్రిల్డ్, బేక్డ్ వైట్, లీన్ మీట్ అయితే తేలిగ్గా జీర్ణమవుతాయి.

### డ్రైఫ్రూట్స్

బాదం, పిస్తా, వాల్‌నట్స్ రక్తపోటును నియంత్ర ణలో ఉంచుతాయి. ఇవి గుండె, మెదడు ఆరోగ్యానికి మంచివి. కానీ, వీటిలో అధిక ఫ్యాట్, కేలరీలు ఉంటాయి. కనుక డిన్నర్ తర్వాత తీసుకుంటే బరువు పెరగ డానికి కారణమవుతాయి. అందుకే సాయంత్రం వేళలో రోజుకు ఐదారు నట్స్‌కు మించకుండా తినాల న్నది పోషకాహార నిపుణుల సూచన. ఇక అంజీర (ఫిగ్స్), ఆప్రికాట్స్ ఎర్లీ మార్నింగ్ తినడం మంచిది. దీనివల్ల జీవ క్రియలను ప్రేరేపించినట్టు అవుతుంది. రాత్రి పూట తీసు కుంటే అజీర్ణం, గ్యాస్కు కారణమవుతాయి.

### డార్క్ చాక్లెట్

డార్క్ చాక్లెట్లో యాంటీ ఆక్సిడెంట్లు అధికంగా ఉంటాయి. వయసు మీదపడుతున్న సమయంలో కనిపించే లక్షణాలను ఇవి నియంత్రించి యవ్వ నంగా కనిపించేలా చేయగలవు. గుండె జబ్బుల నియంత్రణలో యాంటీ ఆక్సిడెంట్లదే కీలకపాత్ర. అయితే నచ్చినప్పుడల్లా డార్క్ చాక్లెట్ తినకూడదు. అలా చేస్తే బరువు పెరుగుతారు. అందుకే రోజుకు రెండు.. అది కూడా ఉదయం మాత్రమే తినాలి.

### పెరుగు

జీర్ణ ప్రక్రియ సాఫీగా జరిగేందుకు పెరుగు సాయపడుతుంది. సాధారణంగా పగటిపూట పెరుగు తీసుకోవడం మంచిది. రాత్రిపూట తిన కుండా ఉంటే బెటర్. ఆయుర్వేదం కూడా పెరుగును రాత్రి తీసుకోవద్దనే చెబుతోంది. ముఖ్యంగా జలుబు, దగ్గు వంటి వాటికి తరచుగా గురయ్యేవారు, అలర్జీ సమస్యలు ఉన్నవారు రాత్రుళ్లు పెరుగు తీసుకోరాదు. ఎందుకంటే ఊపిరితిత్తుల్లో మ్యూకస్ ఏర్పడేందుకు ఇది కారణమవుతుంది. దాంతో దగ్గు, జలుబు సమస్యలు పెరిగిపోతాయి.

### తీపి పదార్థాలు

సాయంత్రం తర్వాత తీపి పదార్థాల జోలికి అస్సలు పోవద్దు. ఉదయమే అనుకూలం. ఉదయం వేళల్లో మన శరీరంలోని ఇన్సులిన్ చక్కెరపై పోరాడే విషయంలో చాలా చురుగ్గా ఉంటుంది. పైగా పగటిపూట పడే శ్రమవల్ల శరీరంలోని చక్కెరలు కరిగిపోతుం టాయి. కానీ, రాత్రి పరిస్థితి వేరు. శరీరానికి చక్కెర ఎక్కువ అవసరం లేదు. మరి ఈ సమయంలో ఎక్కువ చక్కెర పదార్థాలను తీసుకోవడం వల్ల అవి పూర్తిగా ఖర్చు కావు. దాంతో కొవ్వుగా మారి శరీర బరువు పెరుగుతుంది. జీర్ణ వ్యవస్థకు కూడా ఆటంకం.

### వ్యాయామం తర్వాత

వ్యాయామం ఏదైనా కండరాలకు శ్రమే. వ్యాయామం వల్ల కండరాలు బలపడతాయి. అదే సమయంలో కండర నిర్మాణం సరిగా జరగాలంటే సరైన పోషకాలు అవసరం. అందుకే వ్యాయామం అనంతరం తీసుకునే అల్పాహారంలో కార్బోహైడ్రేట్లు, ప్రొటీన్ రేషియో 2:1గా ఉండాలి. ఇది స్వల్ప వ్యాయా మాలు, మధ్యస్థంగా చేసేవారికి, ఎక్కువ సమయం అధిక శ్రమతో కూడిన వ్యాయామాలు చేసేవారికి ఈ రేషియో 3:1గా ఉండాలి. ఎందుకంటే కార్బోహైడ్రేట్లు గ్లైకోజన్‌ను తిరిగి భర్తీ చేస్తాయి. గ్లైకోజన్ అనేది శక్తినిచ్చేందుకు వీలుగా నిల్వ ఉన్న గ్లూకోజ్. కండరా లను తిరిగి నిర్మించడంలో ప్రొటీన్లది కీలకపాత్ర.

### సుదీర్ఘ సమావేశం తర్వాత

ముఖ్య సమావేశం... ఎప్పుడో పొద్దున మొదలైతే సాయంత్రం ఆరింటికి ముగిసింది. దీంతో కళ్ళు బైర్లు కమ్మడం ఖాయం! కానీ, ఇలాంటి సుదీర్ఘ సమావే శాల తర్వాత కొన్ని బాదం గింజలు తినాలి. ఇవి ఆరోగ్యకరమైన కొవ్వులు, కొంత ప్రొటీన్‌ను భర్తీ చేస్తాయి. శరీరంలోని కణాలను ప్రొటీన్లు యాక్టివేట్ చేస్తాయి. అంతేకానీ షుగర్ ఉన్న పదార్థాలను తీసు కోరాదు. కార్బోహైడ్రేట్లు గ్లూకోజ్‌ను అందిస్తాయి. దాంతో మెదడుకు శక్తినిస్తాయి. కానీ, ప్రొటీన్ అన్నది సమావేశంలో ఏం జరిగిందో అది గుర్తుంచు కునేలా చేస్తుంది. ఆసమయంలో అరటిపండు తిన్నా ఫలితం ఉంటుంది.

### ఎప్పుడెప్పుడు ఎలా?

నిజానికి ఉదయం బ్రేక్‌ఫాస్ట్‌లో బాగంగా తీసు కోవాల్సిన దోశ, ఇడ్లీ, పూరీ ఇలాంటి ఐటమ్స్‌ను లంచ్, డిన్నర్‌లలోనూ తీసుకుంటారు కొందరు. కానీ, ఆరోగ్యరీత్యా ఇది మంచిది కాదని నిపుణులు పేర్కొంటున్నారు. బ్రేక్‌ఫాస్ట్ అసలు మిస్ కావద్దు. హార్వర్డ్ స్కూల్ ఆఫ్ పబ్లిక్ హెల్త్ పరిశోధకుల అధ్య యనంలో తేలిందేమంటే బ్రేక్‌ఫాస్ట్ తీసుకోని వారికి గుండెపోటు లేదా ప్రాణాపాయ ముప్పు 27 శాతం ఎక్కువగా ఉందని. బ్రేక్‌ఫాస్ట్ తీసుకోకపోవడం వల్ల ఆకలి బాగా పెరిగిపోతుంది. దీంతో మధ్యాహ్నం లంచ్ పరిమాణం పెరుగుతుంది. ఇది బ్లడ్ షుగర్ పెరగడానికి దారితీస్తుంది. దీనివల్ల డయాబెటిస్, బ్లడ్ ప్రెజర్, అధిక కొలెస్ట్రాల్ వంటి సమస్యలు ఎదు రవుతాయి. మధ్యాహ్నం తీసుకునే ఆహారం శరీ రంలో బ్లడ్ షుగర్ పరిమాణాలు మిగిలిన రోజంతా ఎలా ఉండాలన్నది నిర్ణయిస్తుంది. అధిక తీపి, నూనె పదార్థాలను తీసుకుంటే రక్తంలో చక్కెర స్థాయి ఒక్క సారిగా పెరిగిపోయి, ఆ తర్వాత మరింత తక్కువ స్థాయికి తగ్గిపోతాయి. దాంతో మళ్లీ ఎక్కువ ఆకలి వేస్తుంది. ఫలితంగా జంక్ ఫుడ్ ఎక్కువగా తినే అల వాటుకు దారితీస్తుంది. అందుకే శరీరంలో బ్లడ్ షుగర్ ఒకే రీతిలో ఉండేందుకు వీలుగా ఉదయం ఆహారం తీసుకోవడం మంచిది. సాధారణంగా రోజులో ఉదయం నుంచి మధ్యాహ్నం లోపు దేహా నికి ఎక్కువ కేలరీలు అవసరం అవుతాయి. అందుకే బ్రేక్‌ఫాస్ట్, లంచ్ తగినంత తీసుకోవాలి. రాత్రుళ్లు విశ్రాంతి సమయమే కనుక డిన్నర్ స్వల్పంగా ఉండాలి. ఒకవేళ లంచ్ తక్కువగా, డిన్నర్ ఎక్కు వగా తీసుకోక తప్పని పరిస్థితిలో ఉన్నవారు కనీసం డిన్నర్‌లో తీసుకునే ఆహారం చాలా తక్కువ కేలరీలు ఉండేలా చూసుకోవాలని నిపుణులు సూచిస్తున్నారు. కూరగాయలు, సలాడ్ ఎక్కువ తీసుకోవాలి.

**–విజేత**

## డైటింగ్ మంచిదేనా?

*దేవుడిపై భక్తితో ఉపవాసం కావచ్చు, బరువు తగ్గాలన్న ధ్యాస కావచ్చు... కారణమేదైనా గానీ కడుపు మాడ్చుకోవడం మంచిది కానే కాదు. ఆహారం తీసుకోకపోతే దానికి బదులు ఏదో ఒకటి కొద్దిమొత్తమైనా తీసుకోవాలి. ఏదీ తినకుండా ఉంటే రక్తంలో చక్కెర స్థాయిలు పడి పోతాయి. మరీ ముఖ్యంగా ఉదయం బ్రేక్‌ఫాస్ట్ కూడా మిస్ కావద్దు. దానివల్ల ఆకలి పెరిగి పోయి ఆ తర్వాత ఎక్కువ కేలరీలు తీసుకునేం దుకు దారితీస్తుంది. బరువు తగ్గే ఆలోచనతో డైటింగ్ చేయాలనుకునేవారు, కడుపు మాడ్చటం వంటి పనులను మానుకుని కొంచెం కొంచెం పరి మాణంలో ఆహారాన్ని రోజులో ఆరుసార్లు తీసుకో వాలని నిపుణులు సూచిస్తున్నారు.*






## బ్రేక్‌ఫాస్ట్, లంచ్, డిన్నర్?

*ఈ మూడింటికీ అనువైన వేళల గురించి అందరికీ తెలిసి ఉండకపోవచ్చు. కానీ, ఉదయం నిద్ర లేచిన తర్వాత అరగంటకు అల్పాహారం తీసుకోవడం అనువైనదని పోషకాహార నిపు ణులు చెప్పేమాట. అనువైన సమయం ఏదీ అంటే ఉదయం 7 గంటలు. బ్రేక్‌ఫాస్ట్ ఆలస్యం అయితే ఆరోగ్యానికి మంచిది కాదు. ఉదయం 10 గంటల తర్వాత తీసుకోవడం సముచితమే కాదు. మధ్యాహ్నం 12.45 నుంచి ఒంటి గంట సమయం లంచ్‌కు అనువైనది. ఉదయం బ్రేక్ ఫాస్ట్ తర్వాత, మధ్యాహ్నం లంచ్‌కు మధ్య కనీసం నాలుగు గంటల సమయం ఉండాలి. లంచ్‌ను సాయంత్రం 4 గంటల తర్వాత తీసుకో వడం అంత మంచిదేమీ కాదు. డిన్నర్‌కు అను వైన సమయం అంటే రాత్రి 7 గంటలు. రాత్రి భోజనం తర్వాత నుంచి నిద్ర వరకు మూడు గంటల వ్యవధి ఉండాలి.*




**జరుగుతున్న పరిణామాలతో బుధవారం నుండే చాలా వరకు సినిమాల షూటింగులు ఆపేశారు. శ్రావణి నటిస్తున్న సినిమా షూటింగు కూడా ఆగిపోయింది. మళ్ళీ ఆదివారం నాటి మీటింగ్ తర్వాతే, సోమవారం నాడే షూటింగ్ ఉంటుందని తెలియడంతో, శ్రావణి జైల్లో ఉన్న వాళ్ళ అమ్మను చూడ్డానికి వరంగల్ వెళ్తానంది. నేను కూడా వెళ్తే బాగుణ్ణు కానీ, నేను కన పడకపోతే పారిపోయానని పుకార్లు పుట్టిస్తారు. అందుకే నా కారు, డ్రైవర్‌ను ఇచ్చి, డబ్బులు ఏమైనా కావాలా అని అడిగి, వద్దంటున్నా కొన్ని డబ్బులు, నా ఏటీయం కార్డూ ఇచ్చి పంపాను.**

శ్రావణి తల్లి విడుదల డేటు దగ్గర పడుతోంది. సత్ప్రవర్తనకు గాను శిక్షలో కొంత రెమిషన్ దొరు కుతుంది. కానీ, కొన్ని పైరవీలు చేసి, లాయర్ల ద్వారా కొందరి చేతులు తడిపితే రెండు మూడు నెలల్లో ఆవిడ విడుదలై బయటకొస్తారు.

ఆవిడ బయటకొచ్చిన తరువాతనే మా పెళ్ళి. అందుకనే, శ్రావణి కొన్ని రోజులు ఆగుదామని నాకు చెప్పింది. తను అప్పుడు నాకు కారణం చెప్ప లేదు కానీ తరువాత్తరువాత కొంచెం కొంచెంగా నాకు చెప్పింది. తన తల్లి గురించి నేనేమనుకుంటానో అనే వ్యథ ఆమెను కోసేయసాగింది. నేను 'సరే'ననేసరికి ఊపిరి పీల్చుకుంది. ఇప్పుడు మా మధ్య ఏ రహస్యమూ లేదు.

శ్రావణి తల్లి జైల్లో ఉన్న విషయం చాలామందికి తెలియదు. అందుకే ఆమె వాళ్ళ అమ్మను చూడ్డా నికి వెళ్ళినప్పుడల్లా బట్టలు, మేకప్పు మార్చుకుని తననెవరూ గుర్తుపట్టకుండా జాగ్రత్తలు తీసుకుంటుంది. లాయర్లకు, జైలు సిబ్బందికి హైదరాబాదులో తనో సాఫ్ట్‌వేర్ ఇంజనీరునని చెబుతూ మేనేజ్ చేస్తుంది.

ఇంత గొడవ జరుగుతున్నా నా అదృష్టం కొద్దీ నా సినిమా పోస్ట్ ప్రొడక్షన్ పని మాత్రం సాఫీగా సాగిపోతోంది. కలర్ కరెక్షన్ (DI), రీరికార్డింగు పని అప్రతిహతంగా జరుగుతోంది.

ఎలాగూ శ్రావణి లేదు. దానికి తోడు ఆఫీ సులో కూర్చుంటే రోజంతా మీటింగుకు సంబంధిం చిన ఆలోచనలతో నాకు బుర్ర వేడెక్కిపోతోంది.

నాకు ఏ సమస్య వచ్చినా దాని

తా లూ కు

## జరిగిన కథ

*ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికయిన సందర్భంగా అమెరికా వెళుతూ, గతం గుర్తుచేసుకున్నాడు ఆ తెలుగు దర్శకుడు. డీసీపీ పుష్పాకిరణ్ సహా యంతో సినిమా నిర్మించేందుకు సిద్ధమవుతాడు. హీరోయిన్ శ్రావణిని ప్రేమిస్తాడు. డైరెక్టర్ ఇంట్లో హార్డ్‌డిస్క్ దొంగిలించిందన్న నెపంతో శ్రావణిని అరెస్ట్ చేస్తారు. డీసీపీ మేడం శ్రావణికి బెయిల్ ఇచ్చి, డైరెక్టర్ ఇంటికి తీసుకువస్తుంది. ఆమెని పెళ్ళి చేసుకో వాలనుకుంటాడు దర్శకుడు. తన ఆఫీసుపై ఐటీ రెయిడ్ జరగటంతో, చకచకా ఆర్థిక లావాదేవీలన్నీ చక్కబెట్టేస్తాడు. పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళి హార్డ్‌డిస్క్ చోరీ వెనుక ఉన్నవా రిని కలుసుకుంటాడు. శ్రావణి మోడల్‌గా ఓ జ్యుయలరీ షాపు యాడ్ క్యాంపెయి న్‌కి ఒప్పుకుంటాడు దర్శకుడు. తన తల్లిదండ్రులకు శ్రావణిని కోడలుగా పరిచయం చేస్తాడు. ప్రొడ్యూసర్, అతడి స్నేహితులూ కలిసి దర్శకుల అసోసియేషన్ నుంచి దర్శ కుణ్ణి బహిష్కరించడం ఒక్కటే ఎజెండాగా పావులు కదుపుతుంటారు. ఆదివారం యూనియన్ మీటింగ్ ఉందని మెసేజ్ వస్తుంది దర్శకుడికి. ఆ తర్వాత.....*

**ఆదివారం డైరెక్టర్స్ యూనియన్ మీటింగు... కానీ అతడికేం టెన్షన్‌గా లేదు. ఏంచేస్తారు? మహాఅయితే యూనియన్ నుంచి బహిష్కరిస్తారు, అంతేకదా! అనుకుంటూ నిబ్బరంగా ఉన్నాడు. శనివారం రాత్రి పదిగంటలకి అతడికో ఫోన్ వచ్చింది. ఫోన్లో విషయం విని అమాంతం కుప్పకూలిపోయాడు. అసలేం జరిగింది? ఆ ఫోన్ చేసింది ఎవరు?**

బాధ మరిచిపోవడానికి సినిమా పనిలో మునిగిపోవడమే పరిష్కారం. ఇప్పుడు ఎలాగూ శ్రావణి లేదు కాబట్టి RR స్టూడియోకు అభిషేకం గారితో ఫోన్ చేయించాను. 'ఒక జంబో అయిపో వస్తుంది. ఎక్స్‌పోర్ట్ పెట్టాము. సాయంత్రం రమ్మన్నారు'. సాయంత్రం స్టూడియోకు నేనూ, అభిషేకం గారూ వెళ్ళాము.

నా సకల సమస్యలకు సర్వరోగ నివారిణి సినిమా పనే! అందుకే RR సంగీతం మీద కాన్సన్‌ట్రేట్ చేయాలనుకున్నాను.

నా సినిమాకు రీరికార్డింగ్ సంగీతం విశ్వనాథ్ గారు ఇస్తున్నారు. ఆయన దగ్గరకు కొన్ని లక్షల ప్లగ్‌యిన్స్ ఉన్నాయి. దానికి తోడు ఆయన లండన్‌లోని ఏ.ఆర్. రెహమాన్ గారి స్టూడియోలో శిక్షణ పొందారు. ఈ ప్లగ్‌యిన్స్ మూలంగా మనకు కావలిసిన ఒరిజినల్ సంగీత ధ్వనులు ఖచ్చితమైన 'సుర్'లో దొరుకుతాయి. వాటిని డౌన్‌లోడ్ చేసుకుని సంగీతాన్ని సమకూర్చే వీలుంటుంది.

వీటన్నింటికన్నా నాకు ఆయన యాటిట్యూడ్, క్యారెక్టర్ బాగా నచ్చాయి.

నాకు అంతకు ముందు రెండు సినిమాలకు మ్యూజిక్ డైరెక్టరుతో చాలా బ్యాడ్ ఎక్స్‌పీరియెన్సెస్ ఉన్నాయి. అప్పుడు నేను సినిమా రంగానికి కొత్త కాబట్టి అతను నన్నొక ఆట ఆడుకున్నాడు. సీనుకు సరిపడా బార్‌లు లేవని, RR అంతా ప్యాచ్ ప్యాచులుగా చేసి వదిలేశాడు. "ఇట్లా ఉంది ఏమిటని అడిగితే, బార్లు అయిపోయాయి" అనేవాడు. తరువాత సౌండ్ ఇంజనీర్ చూసి "ఇదేం RR సార్?" అని అంటేగానీ వాడు చేసిన నిర్వాకం బయటపడలేదు. మళ్ళీ వచ్చి తంతామని బెదిరిస్తే ఏదో కొంచెం అడ్జస్ట్ చేశాడు. అయినా, అనుకున్న ఎమోషన్స్ ప్రతిఫలించలేదు.

అందుకే, ఆ దుష్ట అనుభవాల దృష్ట్యా, విశ్వనాథ్ గారితో అగ్రిమెంట్ చేసుకునే ముందే నాకు ప్రతీ జంబో RR కాగానే వినిపించాలని, నాకు నచ్చకపోతే, నాకు నచ్చేవిధంగా నేపథ్య సంగీతం ఇవ్వాలనీ ఖచ్చితంగా చెప్పాను.

ప్రతీ సినిమాను, పోస్ట్ ప్రొడక్షన్‌లో సౌలభ్యం కోసం దాని నిడివిని బట్టి ఏడో, ఎనిమిదో, పదో భాగాలుగా విభజిస్తారు. ఈ విభాగాలను 'జంబో' అంటారు. ఉదాహరణకు నాకు సినిమాలో ఒకచోట ఒక తప్పు కనిపించింది. దాన్ని పిన్‌పాయింట్ చేయడానికి నేను 'మూడో జంబో'లో కొన్ని కరెక్షన్స్ ఉన్నాయని చెప్పడానికి వీలుగా సినిమాను 'జంబో'లుగా విడదీస్తారు.

సినిమా నేపథ్యం మొత్తం ఒక విషాద భావం, ఒక అపరాధ భావం హీరోను వెంటాడుతూనే ఉంటుందనే విషయం సినిమా చూసే ప్రేక్షకుల మనసుల్లో హత్తుకునేలా ఉండాలని ఆయనకు ముందే చెప్పాను. అతనికి కూడా ఆ ఫీల్ కలగడానికి అతనికి కథ మొత్తం వివరంగా సీన్ బై సీన్ వివరించాను. ఎక్కడ ఏ ఎమోషన్‌ను హైలైట్ చేయాలో, హై పాయింట్ ఏదో, లో పాయింట్ ఏదో ముందే విశదీకరించాను.

ఇంత చెప్పిన తర్వాత కూడా మొదటి జంబో RR విన్న తర్వాత ఆయన ఇచ్చిన సంగీతం నాకు అస్సలే నచ్చలేదు. అందులో అన్నీ మోడ్రన్ బీట్స్ ఉన్నాయి. సినిమా కంటెంటుకు, ఇచ్చిన RRకు అసలు సంబంధమే లేదు.

ఒక విషాద సన్నివేశం ఉంటే ఆ సన్నివేశం గాఢతను, ఎమోషన్‌ను పెంచే విధంగా RR ఉండాలి. కేవలం RR అంటే నేపథ్య సంగీతం బాగా లేకపోవడం వల్ల కొన్ని సినిమాలు ఫ్లాప్ అయిన సందర్భాలున్నాయి.

సినిమా అన్నది దృశ్యప్రాధాన్యమే అయినా ఆ దృశ్యానికి తగిన బ్యాక్‌గ్రౌండ్ స్కోర్ ఉంటేనే ఆ సీన్ పండుతుంది. డైరెక్టర్ అనుకున్న ఎమోషన్‌ను క్యారీ చేసి ప్రేక్షకుల మదిలో ఆ భావననే కలగచేస్తుంది. ప్రేక్షకుల చేత కన్నీరు పెట్టించినా, సస్పెన్సుతో రోమాలు నిక్కబొడుచుకునేలా చేసినా, అన్యాయాన్ని తామే ఎదుర్కోవాలని ప్రేక్షకులను ఉద్రేకపరిచి సీటు చివరలో కూర్చోబెట్టి ఉద్విగ్నంగా కూర్చోబెట్టేదేదైనా ఉందంటే అది నేపథ్య సంగీతమే. RRకు అంతటి ప్రాధాన్యం, ఇంపార్టెన్స్ ఉంది.

అందుకే సినిమా షూటింగ్ జరపడంతోనే డైరెక్టర్ పని అయిపోదు. ప్రతీ క్రాఫ్టు పని జరుగుతున్నప్పుడు దగ్గర ఉండి తనకు కావలిసిన విధంగా రూపుదిద్దుకుంటుందా లేదా అని అనుక్షణమూ ఆలోచించేవాడే ఉత్తమ డైరెక్టర్. అందుకే అతన్ని 'కెప్టెన్ ఆఫ్ ది షిప్' అంటారు. సినిమా అనే షిప్పును అనేక ఒడిదుడుకుల నుండి, ఆటుపోట్ల నుండి తప్పించి జాగ్రత్తగా విజయతీరం చేర్చడం అంటే ప్రేక్షకులకు షడ్రసోపేతమైన విందుభోజనం లాంటి సినిమాను అందించడమే మంచి డైరెక్టర్ కర్తవ్యం.

అద్భుతంగా పండిన మీకు నచ్చిన సీన్ చూసి ఆనందించిన తర్వాత అదే సీన్‌ను సౌండ్ లేకుండా మ్యూట్‌లో చూడండి. మీకు బలమైన భావం కలగదు. దటీజ్ ది పవర్ ఆఫ్ RR.

మొదటి జంబో చూసిన తర్వాత స్టూడియో నుండి బయటకు వచ్చి నేనూ, అభిషేకం గారూ విశ్వనాథ్‌గారి ఆఫీసు రూములో కూర్చున్న తర్వాత,

"ఎలా ఉంది సార్?" అని అడిగాడు.

నేను "ప్చ్" అని నిట్టూర్చాను.

అతని ముఖం చిన్నబోయింది.

"ఎందుకు సార్?" అన్నాడు.

"సార్! నాకు ఈ రణగొణ ధ్వనుల హోరు వద్దని ముందే చెప్పాను. నా సినిమా మొత్తంలో అంతర్లీనంగా ఓ అదృశ్య విషాదం ఉంటుంది. హీరో పాయింట్ ఆఫ్ వ్యూలో జరిగే ఈ సినిమాలో హీరో ప్రతీ క్షణం ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుతో, ఓ గిల్టీ పర్సన్ మాదిరిగా ప్రవర్తిస్తుంటాడు. అందుకే సినిమా ఫస్ట్ ఫ్రేమ్ నుండి చివరి ఫ్రేమ్ వరకు ఒక సన్నని దారంలా, థ్రెడ్‌లా నేపథ్య సంగీతం ఉండాలి. ఎక్కడా హై పిచ్ ఉండకూడదు. హై పాయింట్ ఉండాలి. ఎమోషన్ పండించి రక్తి కట్టించేలా మీ RR ఉండాలి. నాకు పెద్దగా శాస్త్రీయ సంగీత పరిజ్ఞానం లేదు. మీరు ఏం ఇన్‌స్ట్రుమెంట్స్ వాడతారో కూడా నాకు తెలియదు. కానీ, నాకు మాత్రం ఒక పిల్లగాలిలా, ఒక వేణుగానంలా సున్నితంగా, స్మూత్‌గా ఉండే RR కావాలి. ప్రేక్షకులు థియేటర్లలో పదేపదే కళ్ళు తుడుచుకోవాలి. అట్లాంటి సీన్లు మన సినిమాలో చాలా ఉన్నాయి. అందుకే సినిమా నిండా విషాదం పొంగి పొర్లాలి. నాకీ కమర్షియల్ సినిమాలకు ఇచ్చే సంగీతం వద్దు సార్! ప్లీజ్!" అన్నాను ఉద్వేగంగా.

నా భావుకతను చూసి ఆయన కూడా చలించిపోయాడు.

"మీక్కావాల్సిన ఔట్‌పుట్ ఏమిటో నాకు అర్థమైంది సార్! కానీ, మీకు కావాల్సిన ఎమోషనల్ ఔట్‌పుట్ రావాలంటే చాలా 'లైవ్స్' కావాలి. వీణ, వయొలిన్, ఫ్లూటు, తబ్లా, మేల్, ఫిమేల్ కోరస్‌లు యూజ్ చేయాలి. చేస్తాను సార్! నాకు వారం రోజులు టైమివ్వండి. మీకు ఒక జంబో చేసి వినిపిస్తాను. ఈసారి మీరు శాటిస్‌ఫై అయి వెళతారు. నాదీ గ్యారంటీ" అన్నాడు.

"థాంక్స్! ఇట్లాంటి సినిమాలు మీ సామర్థ్యానికి పరీక్ష లాంటివి. ఎప్పుడోగానీ రావు. ఇది మీ కెరీర్‌కు కూడా చాలా ఉపయోగపడుతుంది. మీరు ఛాలెంజ్‌లా తీసుకోండి. మీ RR కు జాతీయస్థాయిలో అవార్డు వచ్చేంత గొప్పగా కృషి చేయండి" అని చెప్పి వచ్చాను.

మేమిద్దరం కారులో కూర్చున్న తర్వాత అభిషేకం గారిని పైకి రమ్మని చెప్పాడు బాయ్. ఆయన విశ్వనాథ్ గారిని కలవడానికి వెళ్ళాడు.

సాధారణంగా RRలో రెడీమేడ్‌గా ఉన్న ట్రాక్స్‌తో సరిపుచ్చుతారు. అంటే వయొలిన్ సంగీతం కావాలంటే వయొలిన్, వీణ సంగీతం కావాలంటే వీణ వంటివి రెడీమేడ్‌గా కంప్యూటర్లో నుంచి డౌన్‌లోడ్ చేసుకుని పెట్టేస్తారు. కానీ అవి నిర్జీవంగా ఉంటాయి. లైవ్స్ అంటే ఆ కళాకారులను పిలిపించి మనకు కావాల్సిన ఎమోషనుకు అనుగుణంగా సంగీతం సృష్టించుకోవచ్చు.

నేను ఆలోచనల్లో ఉండగానే అభిషేకం గారు వచ్చారు. కారు ఆఫీసుకు వెళ్తుండగా, "ఏమిటి?" అని ప్రశ్నించాను.

నేను అడిగే వరకు ఎవరైనా సరే నాతో మాట్లాడకూడదన్న విషయం నా ఆఫీసు వాళ్ళందరికీ తెలుసు. ఎందుకంటే నా ఆలోచనలకు భంగం కలిగితే మళ్ళీ ఆ ఆలోచనల స్రవంతిని పట్టుకోవడం నాకు కష్టం.

"అదే సార్! 'లైవ్స్' అంటే ఖర్చుతో కూడుకున్న పనని, కొన్ని డబ్బులు పంపమని అంటున్నారు" అన్నాడు.

నేను 'సరే' అనుకుని తలూపాను.

****

తెలుగు ఫిల్మ్ డైరెక్టర్ల యూనియన్లో సుమారు రెండు వేల మంది సభ్యులున్నారు. ఈ అసాధారణ సమావేశానికి దాదాపు సభ్యులందరూ హాజరయ్యే సూచనలుండడంతో ఈ సమావేశాన్ని ఎక్కడ నిర్వహించాలా అన్న సమస్య మొదలైంది.

శ్రీనగర్ కాలనీలోని సత్యసాయి నిగమ్ ఎదురు సందులో ఉన్న తెలుగు ఫిల్మ్ డైరెక్టర్స్ యూనియన్ ఆఫీసులో ఉన్న సమావేశ మందిరం చాలా చిన్నది. అందుకని దగ్గరలో ఉన్న ఒక ఫంక్షన్ హాల్లో మీటింగ్ ఏర్పాటు చేయాలని నిశ్చయించారు.

చూస్తుండగానే శనివారం వచ్చేసింది.

నాకయితే పెద్ద టెన్షన్‌గా ఏంలేదు. ఈ యూనియన్‌లో మెంబరుగా నన్ను బహిష్కరించినంత మాత్రాన నేను సినిమాలకు దర్శకత్వం వహించడం మానుకోవాలని ఏం లేదు. ఎంతోమంది సభ్యులు కాకుండానే సినిమాలు డైరెక్ట్ చేస్తున్నారు.

కానీ, నన్ను ఓడించి నలుగురిలో నవ్వుల పాలు చేస్తే వాళ్ళ ఈగో శాటిస్‌ఫై అవుతుంది. అయితే నేను అవమానాల పాలు కావాల్సి వస్తుంది. అంతేకానీ, ఈ సమావేశం ఫలితం ఏదయినా జైల్లో ఉన్న డైరెక్టర్ అయితే బయటకు రాడు.

అందుకే నేను నిబ్బరంగా ఉన్నాను. గెలుపు మనదేనని, అభిషేకం గారయితే మహా ఉత్సాహంగా ఉన్నారు.

ఇంతలో, శనివారం రాత్రి పదింటికి నాకు ఒక ఫోన్ వచ్చింది. ఫోన్లో విషయం విన్న నేను మ్రాన్పడిపోయాను. అప్రయత్నంగా కళ్ళల్లో నీళ్ళు నిండాయి. 'హే భగవాన్!' అంటూ కుప్పకూలి పోయాను.

****

ఆదివారం ఉదయం డైరెక్టర్స్ యూనియన్ మీటింగుకు బయల్దేరాను. ఫంక్షన్ హాలు ముందు సభ్యులు గుంపులు గుంపులుగా నిలబడి మాట్లాడుకుంటున్నారు. నన్ను చూడగానే చాలామంది నన్ను చుట్టుముట్టారు. వాళ్ళందరూ చాలా టెన్స్‌గా ఉన్నారు. అందరితో కరచాలనం చేసి, నమస్కారం పెట్టి, అభిషేకం గారు తోడు రాగా లోపలికి నడిచాను. అభిషేకం గారు ముందు వరుసలో కూర్చోమని చెప్తున్నా వినకుండా నేను మూడో వరుసలో కూర్చున్నాను.

నా మనసంతా దుఃఖంతో నిండిపోయింది. అల్లకల్లోలంగా ఉంది. దానికి కారణం ఈ రోజు ఏం నిర్ణయం తీసుకోబోతున్నారన్న దాని గురించి కాదు. ఎందుకంటే, ఈ రోజు ఏం జరుగబోతుందో నాకు ముందే తెలుసు. ఈ రోజుతో ఈ గొడవలు అన్నింటికీ ఫుల్‌స్టాప్ పడబోతుందని కూడా నాకు తెలుసు.

అయినా మనసంతా బాధగా ఉంది.

మెల్లమెల్లగా సభ్యులందరూ లోపలికి వచ్చి కూర్చుంటున్నారు. ముందు లైన్ సీట్లలో ప్రొడ్యూసర్, అతని స్నేహితులు కూర్చున్నారు. వాళ్ళు డైరెక్టర్స్ యూనియన్ మీటింగులోకి రావొచ్చా అన్న అనుమానం చాలా మందికి కలిగింది. ఏదో లిటిగేషన్ ఉండే ఉంటుంది. ప్రాక్సీ ఓటు వేయడానికో లేక వారికే మెంబర్‌షిప్ కూడా ఉన్నందువల్లనో వచ్చి ఉండవచ్చును.

అయినా ఓటింగ్ వరకూ ఈ మీటింగ్ జరిగితే కదా?

ప్రొడ్యూసర్ తాలూకు వ్యక్తులు నా వైపు క్రూరంగా చూస్తూ బూతు సైగలు చేయసాగారు. ఈ ఆర్భాటమంతా కొంతసేపేనని నేను నవ్వుకున్నాను.

అరగంట తర్వాత సమావేశం ప్రారంభించారు. ప్రెసిడెంట్, సెక్రటరీ మొదలైన యూనియన్ పెద్దలను వేదిక మీదకు పిలిచారు. ప్రెసిడెంట్ మైకు తీసుకుని మాట్లాడడానికి గొంతు సవరించుకుంటుండగానే, అప్పుడే జరిగింది ఆ సంఘటన.

ఫంక్షన్ హాలును ఓ యాభై మంది పోలీసులు చుట్టుముట్టారు.

నలుగురు కానిస్టేబుల్స్ చొప్పున ప్రతీ తలుపు దగ్గర, లోపలివాళ్ళు బయటికి పోకుండా కాపలాగా నిలబడ్డారు.

హాల్లో హాహాకారాలు మొదలయ్యాయి. గోల గోలగా తయారయింది. ఇంతలో సర్కిల్ ఇన్‌స్పెక్టర్ వేదిక మీదకు ఎక్కాడు. అది చూసి ప్రెసిడెంట్,

"ఏమిటిది? ఇది ప్రైవేట్ మీటింగ్. పోలీసులకు ఇక్కడేం పని?" అని ఇన్‌స్పెక్టర్ని కోపంగా చూస్తూ అరిచాడు.

ఇన్‌స్పెక్టర్ కూల్‌గా "చెప్తా!" అని అంటూనే అతని దగ్గర నుండి మైకు లాక్కొని నా వైపు చూసి,

"డైరెక్టర్‌గారూ! మీరు డయాస్ మీదకు రండి" అన్నాడు.

అతని సూచనను అనుసరించి, నేను భారంగా మెట్లు ఎక్కసాగాను. కానీ, రాత్రి ఇన్‌స్పెక్టర్‌గారు చెప్పిన వార్తను తలుచుకునే నా మనసంతా దుఃఖిస్తోంది.

జైలుకు తరలించిన తర్వాత నవీన్ జైల్లో కిటికీకి తాడుతో ఉరి వేసుకుని ఆత్మహత్య చేసుకున్నాడని చెప్పినప్పటి నుంచీ అపరాధ భావం లోపల్లోపలే నన్ను తినేయసాగింది. ఒకనాటి నా ప్రియ స్నేహితుడి జీవితం ఇలా, అత్యంత హేయమైన పరిస్థితుల్లో ముగిసిపోవడం, నన్ను రాత్రి నుండి వేధించసాగింది. ఇందులో నా పాత్ర ఏమైనా ఉందా అన్న సంశయం నన్ను తొలిచేస్తోంది.

అయితే, నవీన్ ఆత్మహత్య చేసుకోబోయే ముందు ఐదు పేజీల సూసైడ్ నోట్ రాశాడనీ, దాన్ని ఇవ్వాళ జరిగే యూనియన్ మీటింగ్‌లో నేను చదవాలని తన చివరి కోరికగా రాశాడని నిన్న రాత్రి ఇన్‌స్పెక్టర్ చెప్పాడు. దాన్ని నాకు వాట్సప్‌లో పంపించాడు. అది చదివినప్పటి నుండి నా మనసు మనసులో లేదు.

నేను డయాస్ మీదకు రాగానే అక్కడంతా గోల గోలగా తయారైంది. ఇన్‌స్పెక్టర్ "సైలెన్స్!" అని అరిచాడు.

"నేను మూడో మెట్రోపాలిటన్ కోర్టు హానరబుల్ జడ్జి గారి ఉత్తర్వుల ప్రకారం కొన్ని విషయాలు



## ఎవరేమనుకున్నా భయపడదట!

నయనతారకి పొగరెక్కువన్న సంగతి ఆమె సినిమాల్లో నటించడం మొదలుపెట్టినప్పటి నుంచీ ప్రచారంలో ఉంది. ప్రారంభంలో తెలియక కొన్ని తప్పులు జరిగాయనీ వాటిని సరిదిద్దుకునే క్రమంలో కొద్దిగా కఠినంగా ఉంటున్నాననీ, దానికే తనకు పొగరు ఎక్కువనీ, ఎవరి మాటా విననని తదితర బిరుదులు అంటగడుతున్నారనీ, ఈ విషయంలో ఎవరేమనుకున్నా తను భయపడదనీ, తన రూట్లోనే వెడతాననీ చెప్పుకొచ్చింది. సినిమా ప్రచారాల విషయంలో కూడా తనదైన స్టయిల్లో స్పందించింది. సినిమాలో సత్తా ఉంటే ఆడుతుంది తప్ప హీరోయిన్ ప్రమోషన్‌తో సినిమా ఆడదని అంటోంది.

తన సినిమాలు తను ప్రమోషన్ చేయకపోయినా సూపర్ డూపర్ హిట్ అయినవి ఉన్నాయనీ, మరికొన్ని సినిమాలు బాక్సాఫీసు వద్ద బోల్తాకొట్టాయనీ వీటికి తనని బాధ్యురాలిని చేయడం ఎంత వరకు న్యాయం అని ప్రశ్నిస్తోంది. నిజానిజాలు తెలుసుకోకుండా మాట్లాడే వారి మాటలు పట్టించుకోవలసిన అవసరం తనకు లేదని స్పష్టం చేస్తోంది.



చెప్పబోతున్నాను. దయచేసి నిశ్శబ్దంగా వినండి" అన్నాడు.

సమావేశం సైలెన్స్ కాగానే,

"ఇప్పుడు నేను మీ అందరికీ ఒక సాడ్ న్యూస్ చెప్పబోతున్నాను" అనగానే దాదాపు వెయ్యి మంది ఉన్న ఆ హాల్ పిన్‌డ్రాప్ సైలెన్స్‌గా అయింది.

"మీ యూనియన్ మెంబర్ జె. నవీన్ కుమార్ అనే కో డైరెక్టరును పోలీసులు అరెస్ట్ చేశారని మీ అందరికీ తెలుసు. అతని మీది ఆరోపణలు ప్రైమా ఫేసీ ఋజువు కావడంతో కేసు బుక్ చేసి కోర్టులో ప్రొడ్యూస్ చేశాము. కోర్టు అతనికి పదిహేను రోజుల జ్యుడీషియల్ రిమాండ్ విధించింది. నిన్న సాయంత్రం చంచల్‌గూడా జైలుకు హాండోవర్ చేశాము. కానీ, దురదృష్టవశాత్తు నవీన్ కుమార్ నిన్న రాత్రి ఆత్మహత్య చేసుకున్నాడు."

ఆ మాటలు వినగానే హాలంతా కేకలు, అరుపులతో దద్దరిల్లిపోయింది. వేదిక పైన ఉన్నవారూ, కింద ఉన్నవారూ అందరూ నన్నే దోషిగా చూస్తున్నారు. ఇంతలో ఎవరో నా మీద వాటర్ బాటిల్ విసిరారు. అతణ్ణి చూసి మరో ఇద్దరు ముగ్గురు పేపర్లు, వాటర్ బాటిల్స్ నా మీద విసిరారు. నన్ను "డౌన్ డౌన్, ముర్దాబాద్" అని గేలి చేశారు. "తన్ని తరిమేయండి" అని అరవసాగారు. ఇంతలో ఇన్‌స్పెక్టర్ మైకులో,

"దయచేసి నా మాట వినండి. హింసకు దిగితే మేము కూడా తగిన చర్య తీసుకోవాల్సి ఉంటుంది. నేను చెప్పేది పూర్తిగా ప్రశాంతంగా విన్న తర్వాత మీరే నిర్ణయమైనా తీసుకోండి. అంతవరకు దయచేసి ఎటువంటి చట్టవిరుద్ధమైన పనులకు పూనుకోకండి. మీరంతా ఎడ్యుకేటెడ్ పీపుల్! ప్లీజ్!" అన్నాడు.

కొంచెం సద్దుమణిగింది.

"నవీన్ కుమార్ ఆత్మహత్య చేసుకోబోయే ముందు ఒక సూసైడ్ నోట్ రాశాడు. దానితో పాటూ నాకు మరో లెటర్ రాశాడు. నాకు రాసిన లెటర్ మీకు చదివి వినిపిస్తాను. దయచేసి నిశ్శబ్దంగా వినండి" అని నా వైపు చూసి, ఫైల్ ఓపెన్ చేసి ఓ లెటర్ తీసి పట్టుకున్నాడు.

"ఇన్‌స్పెక్టర్ గారికి,

నేను ఆత్మహత్య చేసుకుంటున్నాను. ఎందుకంటే నాకు జీవితం మీద విరక్తి పుట్టింది. నేను చేసిన తప్పులు నన్ను కాల్చుకు తింటున్నాయి. ఈ పరిస్థితుల్లో నాకు మరణమే శరణ్యం. నేను దీంతో పాటు ఒక మరణ వాఙ్మూలం జత పరుస్తున్నాను. రేపు మా డైరెక్టర్స్ యూనియన్ జనరల్ బాడీ మీటింగ్ ఉంది. మా వాళ్ళందరూ వస్తారు. నేను రాసిన నా మరణ వాఙ్మూలాన్ని మా వాళ్ళందరూ వినాలి. కాబట్టి రేపు నా ఈ మరణ వాఙ్మూలాన్ని నా ప్రియ మిత్రుడే చదివి వినిపించాలి. అప్పుడే నా ఆత్మకు శాంతి కలుగుతుంది. ఇది నా చివరి కోరిక. సెలవ్!" అని చదవడం ఆపేశాడు.

ఇన్‌స్పెక్టర్ చదివిన ఆ ఉత్తరంలోని విషయాన్ని విన్న మా సభ్యులంతా గండ శిలల్లా నిశ్చేష్టులై పోయారు.

చిన్న పిల్లలు ఆడుకునే ఆటలో "స్టాచ్యూ" అనగానే ఆటగాళ్ళందరూ శిలల్లా నిలబడిపోతారు. అలాగే, పై నుంచి నవీన్ "స్టాచ్యూ" అని అరిచినట్టుగా, హాల్లో ఉన్నవాళ్ళందరూ ఎక్కడి వాళ్ళక్కడే శిలల్లా నిలబడిపోయారు.

ఇన్‌స్పెక్టర్ ఫైల్‌లో నుంచి ఐదు పేజీల బొత్తి తీసి నాకు ఇచ్చాడు. నేను కన్నీళ్ళు తుడుచుకుంటూ ఆ లెటరును అందుకున్నాను.

గద్గదికమైన గొంతుతో చదవడం ప్రారంభించాను.

"తెలుగు ఫిల్మ్ డైరెక్టర్స్ యూనియన్ సభ్యులందరికీ నా అంతిమ నమస్కారం! ఈ ఉత్తరం మీకు నా ప్రియ మిత్రుడు చదివి వినిపించే సమయానికి నేను ఆత్మహత్య చేసుకున్నానన్న వార్త మీకు తెలిసే ఉంటుంది. మీరందరూ ఈ రోజు నా మిత్రుణ్ణి యూనియన్ నుండి బహిష్కరించాలనే ఎజెండాతో సమావేశమవుతున్నారని కూడా నాకు తెలుసు. నా ఉత్తరం చదివి వినిపించిన తర్వాత మీ నిర్ణయం మీరు తీసుకోండి. న్యాయం పక్షాన నిలబడి నిర్ణయం తీసుకోండి.

నా మిత్రుడూ నేనూ, మా చేతిలో సినిమా లేనప్పుడు కూడా కలిసి మెలిసి తిరిగాము. నా మిత్రుడు, ఈ రంగంలోకి రావాల్సినవాడు కాదు. వాడు కల్మషం అంటని తామరపువ్వు లాంటివాడు. స్వచ్ఛమైన మల్లెపూవు లాంటివాడు. కొన్ని ఆదర్శాలు, ఆశయాలతో సినిమాలు తీయాలని యంటెక్ చదువును మధ్యలో ఆపి ఈ రంగానికొచ్చాడు. తన ఆశయాలకు అనుగుణంగా రెండు సినిమాలు తీశాడు. అవి ఫ్లాప్ అయినందుకు ఏనాడూ బాధ పడలేదు. ఎప్పటికైనా టాలీవుడ్ గర్వపడే సినిమాలు తీస్తాననే ఆశతోనే అడ్డమైనవాళ్ళ కాళ్ళు పట్టుకున్నాడు. వాడికి ఒక ప్రొడ్యూసర్ దొరికాడు. ఆ బ్యానర్లో నన్ను తనతో సమానంగా దర్జా ఇచ్చి గౌరవించాడు. కానీ నేనే ఒక ఘోరమైన తప్పు చేశాను. వాడు ఒక్క మాట కూడా అనలేదు. పనిలో నుంచి తీసేశాడు, అంతే. కానీ, నా మీద ఏ శనిదేవత నాట్యమాడిందో గానీ వాడిమీద నేను కక్ష కట్టాను. వాణ్ణి నాశనం చేయాలని కంకణం కట్టుకున్నాను. వాడికి

**సినీవాలి**
**కూపన్ నెం.26 విజేత**

**కె. పుష్పమ్మ**
మహబూబ్‌నగర్

సినిమా అంటే ప్రాణం.

నేను వాడిని, వాడి ఆ ప్రాణం నుండి వేరు చేయాలని, ఒకే దెబ్బతో వాణ్ణి నాశనం చేయాలని, వాడికి వాడి సినిమా దక్కకూడదని అదను కోసం ఎదురు చూస్తున్న సమయంలో, ఇప్పుడు నాతో పాటే జైల్లో ఉన్న డైరెక్టర్ కలిశాడు. అతను నన్నడిగాడో లేక నేనే అతనికి చెప్పానో గానీ, డైరెక్టర్ సినిమాకు నా మిత్రుడి సినిమా పోటీగా నిలుస్తుందనే భయాన్ని కలిగించాను. నా మిత్రుడి సినిమాకు అవార్డు గ్యారంటీ అని చెప్పి దాన్ని నాశనం చేస్తేనే గానీ, డైరెక్టర్ సినిమాకు అవార్డు గ్యారంటీగా వచ్చే అవకాశం ఉండదని చెప్పి పురెక్కించాను. దాంతో మేమిద్దరమూ కలిసి నా మిత్రుడి సినిమాను నాశనం చేసే ప్లాన్ వేశాము. పనిలో పనిగా నా వ్యక్తిగత కసిని తీర్చుకునే ప్లాన్ కూడా జోడించాను. ఎంత డబ్బైనా పెట్టడానికి డైరెక్టర్ సిద్ధపడ్డాడు. అందుకే ఒక ముఠాకు సుపారీ ఇచ్చాము. వాళ్ళు హార్డ్ డిస్కు ఎత్తుకొచ్చారు. కానీ, అది మా చేతిలో పడేలోగానే పోలీసులు మమ్మల్ని పట్టుకున్నారు.

పోలీస్ స్టేషన్‌లో ఉన్న నన్ను చూడడానికి నా మిత్రుడు స్టేషన్‌కు వచ్చాడు. వాడు అక్కడ నన్ను చూసిన చూపును జన్మలో మర్చిపోలేను. ఓ పేడ పురుగును, ఓ నికృష్టుణ్ణి, ఓ కుష్ఠు రోగిని చూసినట్టు వాడు నన్ను ఏహ్యాభావంతో చూడగానే నేను చచ్చిపోయాను.

అప్పుడే, ఆ క్షణమే నాకు బతికుండే హక్కు లేదనిపించింది.

నా మిత్రుణ్ణి కొంతమంది ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు చాలా బాధ పెట్టారు. ఐటీ రెయిడ్ చేయించారు. బ్యాంక్ అకౌంట్లు సీజ్ చేయించారు. అవేవీ అనుకున్న ఫలితం ఇవ్వకపోవడంతో ఇప్పుడు యూనియన్లోని కొంతమంది పెద్దలను అడ్డం పెట్టుకుని వాణ్ణి బహిష్కరించాలని కుట్ర పన్నుతున్నారు.

తప్పు నాదీ, డైరెక్టరుదీ. నా మిత్రుడికి నష్టం కలిగించాలనే దురుద్దేశంతో నేను కొన్ని చేయకూడని ఘోరమైన పాపపు పనులు చేశాను. వాటికి నిష్కృతి లేదు. ఆ పాపభారంతో నేను జీవించలేను. కాబట్టే ఆత్మహత్య చేసుకుంటున్నాను.

మీరందరూ ఒక్క నిమిషం ఆలోచించండి! ఈ సంఘటనలో తప్పు చేసిందెవరు? మనం ఎవరిని శిక్షించబోతున్నాము? ఒక గొప్ప వ్యక్తిని, విజనరీని, తెలుగు సినిమా ఖ్యాతిని ప్రపంచానికి పరిచయం చేయాలని తహతహలాడే ఒక అమాయకుణ్ణి శిక్షించడం న్యాయమేనా? ఒక్కసారి ఆలోచించండి! నా కోసం ఆలోచించండి!

ఉత్తరం ముగియలేదు. కానీ, నేను చదవలేక పోతున్నాను. నేను మైకు కింద పడేసి, ఏడుస్తూ కూలబడిపోయాను.

ఫ్యాన్లు తిరుగుతున్న చప్పుడు తప్ప హాలంతా శ్మశాన నిశ్శబ్దం ఆవరించి ఉంది.

నేను చదివింది విని చాలామంది కళ్ళు చెమర్చాయి. ఏదో తెలియని ఒక సామూహిక నిట్టూర్పు వెలువడింది. ఇనీషియల్ బాధ కరిగిపోయిన తర్వాత అక్కడ కూర్చున్న వాళ్ళల్లో కొంతమంది లేచి వేదిక మీద ఉన్న ప్రతినిధులను చూస్తూ అరవసాగారు.

"దొంగలు, దొంగలు" అన్న కేకలు సన్నగా మొదలై రెండు నిమిషాల్లో హాలంతా మారుమోగాయి. దాంతో వేదిక మీది పెద్దలు మెల్లిగా అక్కడి నుంచి జారుకున్నారు. నేను డయాస్ మీద కిందనే కూర్చుండి పోయాను. ఇన్‌స్పెక్టర్, అభిషేకం గారు నన్ను లేపారు.

అలా నన్ను బహిష్కరించే ప్రణాళిక ఫ్లాప్ అయింది. ప్రొడ్యూసర్లతో పాటు అతని బ్యాచ్, గొడవ మొదలు కాగానే, ముఖం చాటేశారు. ఇక ఆనాటి నుండి నా జోలికి ఎవరూ రాలేదు.

**(ఇంకా వుంది)**

## సినిమాలకు శ్రుతి గుడ్ బై?

*ఫ్లాప్ హీరోయిన్ అపవాదు నుంచి త్వరగానే బయటపడి స్టార్ హీరోయిన్ రేంజ్‌కి చేరుకుంది శ్రుతి హాసన్. లోకనాయకుడి కూతురిగా సినీరంగ ప్రవేశం చేసినా కసి, పట్టుదలతో కెరీర్‌లో పైకి వచ్చింది. ఇప్పుడు ఆ కసి, పట్టుదల శ్రుతిలో కొరవడ్డాయి అంటున్నారు సినీ జనాలు. టాలీవుడ్‌లో ఆమె సినిమాలు ఇటీవలి కాలంలో ఘోరంగా దెబ్బతింటున్నాయి. దానికి కారణం శ్రుతి అందాలు ఒక కారణం అన్న ఆరోపణ వినిపిస్తోంది. ఎవరేమనుకున్నా శ్రుతి మాత్రం వాటిని అస్సలు పట్టించుకోవడం లేదట! తన విదేశీ ప్రియుడితో కలిసి టైం స్పెండ్ చేయడానికి ఇష్టపడుతోందే తప్ప తన అందచందాల మీద వస్తున్న వార్తలను లైట్‌గా తీసుకుంటోందట! గతంలో సన్నగా, నాజుగ్గా సన్నజాజి తీగలా ఉండే శ్రుతి ఇటీవలి కాలంలో బొద్దుగా తయారైంది. దాని ఫలితం 'కాటమరాయుడు' సినిమాలో బాగానే కనిపించింది. ఆ సినిమా విడుదల తరువాత శ్రుతి అందచందాల మీద రోజుకొక విమర్శ వినిపిస్తూనే ఉంది. వాటిని పట్టించుకుని ఉంటే ఈ పాటికి జిమ్‌లో చెమటలు పట్టే విధంగా కష్టపడేదే కానీ వాటిని అస్సలు కేర్ చేయడం లేదట! కారణం... త్వరలో పెళ్ళి చేసుకుని జీవితంలో సెటిల్ అయ్యే ఆలోచనలో శ్రుతి ఉంది అంటున్నారు. దీని మీద శ్రుతి నోరు విప్పితే తప్ప ఈ ఊహాగానాలకు తెరపడదు.*



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## అటోపిక్ డెర్మటైటిస్‌కు సరైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రస్తుత అభివృద్ధి చెందిన దేశాలలో మరియు పట్టణ ప్రాంతాలలో నివసించే జనాభా పరంగా – ఎక్కువ మందిలో కనిపించే చర్మసమస్య ఎగ్జిమా. ఎగ్జిమాలో ఎన్నో రకాలు ఉన్నప్పటికీ, వాటిలో సర్వసాధారణంగా ఎక్కువ మందిని వేధించే వ్యాధి అటోపిక్ డెర్మటైటిస్. ఇది ఏ వయస్సు వారిలోనైనా ఏర్పడుతుంది. ముఖ్యంగా శిశువులలో 65% మరియు 5 సం॥ల వయస్సులోపు చిన్న పిల్లలలో 85% వరకు కనిపిస్తుంది. కొంతమందిలో చిన్న వయస్సు వరకే పరిమితమయ్యే ఈ సమస్య మరికొందరిలో జీవితకాలం కొనసాగుతుంది. పొడి చర్మం గల వారిలో మరియు చల్లని వాతావరణంలో ఇది మరింత అధికంగా కనిపించే అవకాశం ఉంటుంది.

అటోపిక్ డెర్మటైటిస్ అనేది దీర్ఘకాలికంగా కొనసాగే ఒక చర్మసమస్య. దీని వలన చర్మపు వెలుపలి పొరలు శోథమునకు గురికావడం జరుగుతుంది. తద్వారా ఆ ప్రాంతమంతా ఎర్రగా మారి, దురద–వాపుతో కూడిన విధంగా పొక్కులు రావటం, అవి నీటి బుడగల మాదిరిగా మారి రసికారడం, తదుపరి మచ్చలా ఏర్పడటం ఒకదాని వెంట ఒకటిగా జరుగుతాయి.



సహజంగా శరీరంలో ఎక్కడైనా ఏర్పడే దీని లక్షణాలు – ఎక్కువగా మోకాలు వెనుక భాగం, మోచేయి, మణికట్టు మడతల ప్రాంతం, మెడపై, కాలి మడమలు మరియు పాదాలపై కనిపిస్తాయి.

**కారణాలు:** అటోపిక్ డెర్మటైటిస్ వ్యాధికి గల ఖచ్చితమైన కారణాలు తెలియరాలేదు. కానీ శరీర రోగనిరోధక వ్యవస్థ సాధారణ స్థితికి మించిన ప్రతిక్రియ జరపడంతో డెర్మటైటిస్ లక్షణాలు ఏర్పడతాయి. వ్యక్తిగత చరిత్ర మేరకు ఉబ్బసం, తీవ్ర జ్వరానికి గురి కావటం మరియు శ్వాస సంబంధిత అలర్జీ, అలర్జీ కలిగించే కొన్ని ఆహారాలు, రోగనిరోధక శక్తి లోపం మరియు కుటుంబ చరిత్ర కలిగి ఉండటం మొ॥వి.

**ప్రేరేపితాలు:** ముఖ్యంగా పొడి చర్మం ఉన్నవారిలో ఈ వ్యాధి ఎక్కువగా కలుగుతుంది. దుమ్ము–ధూళి, పుప్పొడి రేణువులు, జంతు కేశాలు, సబ్బులు, డిటర్జెంట్‌లు, షాంపూలు, కొన్ని ఆహార పదార్థాలు (ఉదా:- పాలు, గుడ్లు, సోయా), కొన్ని రసాయనాలు, సౌందర్య సాధన సామాగ్రి, వాతావరణ మార్పులు, ఉన్ని వస్త్రాలు, కొన్ని బ్యాక్టీరియా ఇన్‌ఫెక్షన్‌ల వలన మరియు మానసిక ఒత్తిడి వలన కూడా ఈ వ్యాధి ప్రేరేపించబడుతుంది.

**లక్షణాలు:** ఈ వ్యాధి లక్షణాలు ఒక వ్యక్తి నుండి మరొక వ్యక్తికి వేరుగా ఉంటాయి. ఈ వ్యాధిలో కనిపించే ముఖ్య లక్షణం దురద. ఆ తరువాత చర్మం ఎరుపు రంగులోకి మారి, వాపుతో కూడిన పొక్కులు ఏర్పడతాయి. క్రమేణా ఇవి నీటి బుడగల మాదిరిగా మారి, వాటి నుండి రసి కారడం, కొంత కాలానికి చర్మం దళసరిగా మరియు నల్లగా మారిపోవడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. • చర్మంపై ఎక్కడైనా ఏర్పడే ఈ వ్యాధి ఎక్కువగా ముఖంపైన, తలలో, మోకాలు వెనుక భాగంలో, మెడపై, మోచేయి భాగంలో, మణికట్టు చర్మపు మడతలలో, చెవి వెనుక భాగంలో, కాలి మడమలు మరియు పాదాలపై కనిపిస్తాయి. • శిశువులలో మొదట బుగ్గలపై దద్దుర్లుగా ఇది కనిపిస్తుంది. కొన్ని నెలలకు ఈ దద్దుర్లు చేతులు, కాళ్ళతో పాటు ఇతర శరీర భాగాలకు వ్యాపించటం జరుగుతుంది. 80% వరకు ఈ వ్యాధితో బాధపడే చిన్న పిల్లలు, హే ఫీవర్ లేదా ఆస్థమాకు గురయ్యే అవకాశం ఉంది.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** వ్యాధి లక్షణాలతో పాటుగా కుటుంబ ఆరోగ్య చరిత్ర మరియు వ్యక్తిగత ఆరోగ్య చరిత్ర తెలుసుకుని ఈ వ్యాధిని నిర్ధారించటం జరుగుతుంది. బాహ్యపరీక్ష, అవసరమైతే రక్త పరీక్ష (ఈ వ్యాధి ఉన్నవారిలో తెల్లరక్తకణాలు (Eosinophils), సీరమ్ IgE మరియు A.E.C స్థాయిలు ఎక్కువగా ఉంటాయి) మరియు కొన్ని సందర్భాలలో చర్మపు మచ్చల నిర్ధారణకై బయాప్సీ చేయించవలసి ఉంటుంది.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** కాన్స్టిట్యూషనల్ హోమియోపతిలో భాగంగా సూక్ష్మీకరణ పద్ధతిలో తయారైన హోమియో మందులతో, రోగి శరీర రోగనిరోధక కణాలకు పునరుజ్జీవం కల్పించి, ఎటువంటి దుష్ఫలితాలు లేకుండా అటోపిక్ డెర్మటైటిస్‌ను పూర్తిగా నయం చేస్తారు.
ఈ పద్ధతిలో ఉబ్బసం–డెర్మటైటిస్ బాధితులకు, మొదటగా ఉబ్బసం, అనంతరం డెర్మటైటిస్ తగ్గుతుంది. ఈ విధంగా శరీర అంతర్గత అవయవాలు మొదలుకొని, బాహ్య అవయవాల వైపుకు వ్యాధి నివారణ ప్రక్రియ కొనసాగుతుంది. కేవలం హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే లభించే ఈ విశిష్ట వైద్య రీతిలో, రోగి శరీర నిర్మాణంతో పాటు, వ్యాధి రీత్యా రోగి వ్యక్తిగత, మానసిక లక్షణాల పరిశీలన తదుపరి మాత్రమే అందించబడే చికిత్సతో ఈ వ్యాధిని పూర్తిగా నయం చేయవచ్చు.




# పెన్‌డ్రైవ్

**ఆ వీడియో చూసి స్థాణువైపోయాడు డిటెక్టివ్ శరత్.**

**చాలాసేపు గదిలో నిశ్శబ్దం తాండవించింది.**

**'ఎలా వచ్చింది మీకీ వీడియో?' అతికష్టం మీద గొంతు పెగల్చుకుని అడిగాడు శరత్.**

**'పాలవాడు పాల పాకెట్లు వేసేందుకు మా ఇంటి గేటుకి సంచీ కట్టి ఉంటుంది. దాంట్లో ఎవరో ప్యాకెట్ ఉంచారు. ఏమిటా అని తీసి చూస్తే పెన్‌డ్రైవ్ ఉంది.**

ఏముందో, అని పెట్టిచూస్తే' ఇది ఉంది. చెప్పాడాయన. ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి.

'పోలీసులకి చెప్పారా?'

'లేదు. ఇది చూడగానే తిన్నగా మీ దగ్గరకే వచ్చాను.'

ఇన్‌స్పెక్టర్ విజయ్‌కి ఫోన్ చేశాడు శరత్. విజయ్‌తో మాట్లాడి ఫోన్ పెట్టేస్తుండగా ఎదురుగా ఉన్నాయన ఫోను మోగింది.

ఫోను ఎత్తి 'హలో' అన్నాడాయన. ఆయననే గమనిస్తున్న శరత్ ఆయన ముఖం భయంతో నిండటం చూశాడు.

ఫోను పెట్టేసి ఏడవటం మొదలు పెట్టాడాయన.

శరత్ మౌనంగా ఉన్నాడు. ఆయన ఏడుపు ఉధృతి తగ్గనిచ్చాడు.

ఇంతలో విజయ్ గదిలోకి వచ్చాడు. 'ఏమిటీ అర్జంటుగా రమ్మన్నావు?' అంటూ.

'ఈయన పేరు విజ్ఞానేశ్వరరావు. ప్రముఖ వ్యాపారి. ఆయనకు ఎవరో ఓ పెన్‌డ్రైవ్ పంపించారు. దాన్లో ఓ అమ్మాయిని కిరాతకంగా చంపిన వీడియోక్లిప్, ఒకటిన్నర నిముషానిది ఉంది. అదేమిటో తెలుసుకోవాలని నా దగ్గరకు వచ్చాడు. హత్యకు సంబంధించింది కాబట్టి నిన్ను పిలిచాను'.

కన్నీళ్ళు తుడుచుకుని గద్గదస్వరంతో చెప్పాడు విజ్ఞానేశ్వరరావు.

'ఆ వీడియో నాకు ఎందుకు పంపించాడో నాకు అర్థం కాలేదు. కానీ ఇప్పుడు వచ్చిన ఫోను వల్ల తెలిసింది. వాడికి నా కూతురు నచ్చిందట. ఆమెను ఎత్తుకు వెళ్తాడట. ఆమెను ఏం చేస్తాడో నాకు ఆ వీడియో ద్వారా తెలిపాడట' మళ్ళీ ఏడవటం ఆరంభించాడు.

'ఇప్పుడు మీ కూతురు ఎక్కడ ఉంది?' అడిగాడు శరత్.

'కాలేజీలో'

అసిస్టెంట్ రామువైపు తిరిగాడు శరత్. 'రామూ, ఆ కాలేజీకి దగ్గరలో ఉన్న నీ అసిస్టెంట్లను వెంటనే కాలేజీకి వెళ్ళి అమ్మాయికి రక్షణగా ఉండమను. కాలేజీ అవగానే ఇంట్లో దింపి, కాపలాగా ఉండమను. ఇరవై నాలుగు గంటలూ' అని విజ్ఞానేశ్వరరావువైపు తిరిగాడు. 'మీ అమ్మాయికి ఫోను చేసి చెప్పండి మనవాళ్ళు వస్తారని' అన్నాడు.

ఆయన ఫోను చేసిన తరువాత 'ఇందాక ఏ నెంబరు నుంచి ఫోను వచ్చింది?' అడిగాడు.

ఆయన నెంబరు ఇచ్చాడు. 'రాము.. ఈ నెంబరు వివరాలు కనుక్కో' అన్నాడు.

ఆ తరువాత ఆయన వైపు తిరిగాడు. 'ఇప్పుడు చెప్పండి. మీకు శత్రువులు ఎవరైనా ఉన్నారా? మీ అమ్మాయిని కిడ్నాప్‌చేసి మిమ్మల్ని బాధించేంత శత్రుత్వం మీ బంధువుల్లోగానీ, వ్యాపారంలోగానీ ఉందా?'

ఆయన తల అడ్డంగా తిప్పాడు. 'నాకు తెలియదు. లోపల ఎవరికి ఎంత కోపం ఉన్నా, పైకి అందరూ బాగానే ఉంటారు'.

'మీ దగ్గర పని చేసే వారెవరైనా, కారు డ్రైవరు, కుక్, లేక మీ ఆఫీసులో వాళ్ళు... ఎవరినయినా అకారణంగా ఉద్యోగంలోంచి తీసేశారా? లేక మీ వ్యాపారం వల్ల నష్టపోయిన చిన్న వ్యాపారులు ఎవరైనా..?'

ఆయన తల అడ్డంగా ఊపాడు. 'నాకు తెలియదు. నేను మీ దగ్గరకు వచ్చినప్పుడు, వేరే ఏదో హత్యకేసు... మీరు పరిష్కరిస్తారనుకున్నాను. కానీ నా కూతురిని రక్షించమని ఇప్పుడు మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను' శరత్ చేతులు పట్టుకున్నాడాయన.

శరత్ ఏదో అనబోయాడు. ఇంతలో రాము అన్నాడు.

'బాస్.. నా అసిస్టెంట్లు కాలేజీకి వెళ్ళారు, కానీ వీళ్ళు వెళ్ళేలోపే ఎవరోవచ్చి అమ్మాయిని తీసుకెళ్ళారట".

రాము మాటలు పూర్తవుతూనే ఆయన పెద్దగా ఏడుపు ప్రారంభించాడు.

శరత్ లేచి నిలబడ్డాడు. 'రాము... నువ్వు ఈయన వ్యాపారం, కుటుంబ నేపథ్యం పరిశీలించు. నేను కాలేజీకి వెళ్తాను' అంటూ విజయ్‌వైపు చూశాడు శరత్.

***

'వాళ్ళ నాన్న నుంచి ఫోను వచ్చిందని చెప్పిందండి. ఆమె ఫోనులో మాట్లాడేసరికి ఎవరో ఒకాయన వచ్చాడు. వాళ్ళ నాన్న పంపించాడు, అమ్మాయిని తీసుకురమ్మన్నాడని అన్నాడు. అమ్మాయి కూడా అదే చెప్పింది. మేం పంపించాం' చెప్పాడు ప్రిన్సిపాల్.

'ఆ వచ్చినతను ఎలా ఉన్నాడు?' అతడిని వర్ణించగలరా?'

ప్రిన్సిపాల్ బుర్ర గోక్కున్నాడు. 'నేను సరిగా గమనించలేదు. మా ప్యూన్ శంకర్‌ని అడుగుతాను' అంటూ శంకర్‌ని పిలిచాడు.

'సార్.. అతడు ఆరడుగులు ఉంటాడనుకుంటాను. నల్లగా ఉన్నాడు. టోపీ పెట్టుకున్నాడు. అయితే, అతడు కారు డ్రైవర్ సార్. ఎందుకంటే, అమ్మాయి వెళ్ళి కారులో కూర్చున్నప్పుడు, కారులో వేరే మనిషి ఉన్నాడు. ఇతడు డ్రైవ్ చేశాడు' చెప్పాడు శంకర్.

'కారు ఎలాంటిదో చెప్పగలవా?'

'అది... సరిగ్గా చూడలేదు కానీ క్యాబ్ అండి. స్వంత కారు కాదు'.

'ఇంకెవరైనా ఇంకేమైనా సమాచారం ఇవ్వగలరా?' విద్యార్థులను అడిగాడు.

***

'బాస్... శత్రుత్వం అంటే కోపాలు తాపాలు ఉన్నాయిగానీ అమ్మాయిని ఎత్తుకు పోయేంత లేదు. నేను అందరి కదలికలు, కాల్‌డేటా పరిశీలించాను. అనుమానాస్పదంగా ఏదీ లేదు' గబగబా చెప్పాడు రాము.

'మళ్ళీ మీకు ఏమైనా ఫోను వచ్చిందా?' అడిగాడు శరత్.

ఆయన తల అడ్డంగా తిప్పాడు. 'అమ్మాయి కనిపించకుండాపోయి ఇప్పటికే గంట దాటింది. వాడు అమ్మాయిని ఏం చేస్తున్నాడో' ఏడవటం ఆరంభించాడు.

'మీరు సెక్రటరీ సుధ దగ్గర కూర్చోండి' ఆజ్ఞాపించినట్టు అన్నాడు శరత్.

ఆయన వెళ్ళగానే రాముతో అన్నాడు. 'రామూ, అన్ని క్యాబ్ కంపెనీలలో అడుగు. ఆ కాలేజీ వరకూ ఎవరైనా క్యాబ్ బుక్ చేశారేమో! సమయం తెలుసుగా. ముందు ఆ పనిలో ఉండు' అన్నాడు.

తరువాత ఆలోచిస్తూ కూర్చున్నాడు.

'ఇంతకీ వీడియో చూపించలేదు' నవ్వుతూ అడిగాడు విజయ్.

'ఓ సారీ...' అంటూ పెన్‌డ్రైవ్ ల్యాప్‌టాప్‌లో పెట్టాడు శరత్.

**ఎవరు పంపించారు మీకీ వీడియో? అడిగాడు డిటెక్టివ్ శరత్. చెప్పాడతను. అంతలోనే అతనికి ఫోన్ వచ్చింది. ఆ కాల్ మాట్లాడుతుంటే అతడి ముఖంలో రంగులు మారాయి. అతనికి ఫోన్‌చేసిన వాడు చెప్పిందేమిటో తెలుసుకున్న శరత్ అలర్టైపోయాడు. వెంటనే తన మనుషుల్ని పంపించాడు. కానీ సవాలు చేసిన వ్యక్తి చాలా అడ్వాన్స్‌డ్‌గా ఉన్నాడు. శరత్ మనుషులు వెళ్ళేలోపే జరగాల్సిందంతా జరిగిపోయింది!**

కాస్సేపటికి వీడియో ఆరంభమైంది.

దానిలో మగవాడి శరీరం కనిపిస్తోంది తప్ప ముఖం కనిపించటం లేదు.

కెమెరా దృష్టి అమ్మాయి శరీరం మీదే ఉంది.

వీడియో 'ఆన్' అయింది చివరి దశలో. అప్పటికే అమ్మాయి ఒళ్ళంతా రక్తం..

వీడియోలో అతడు షూ లేసుతో అమ్మాయి మెడపై పట్టు బిగిస్తున్నాడు.

'నిట్టూర్చాడు విజయ్. 'ముందు ఆ అమ్మాయి గురించి కనుక్కోవాలి' కానీ వీడియో ఎక్కడ తీసిందో, ఎప్పుడు తీసిందో తెలియదు కదా. ఆ అమ్మాయి గురించి తెలుసుకోటానికి. వీడియో ఆన్ చేశాడు శరత్.

జాగ్రత్తగా వీడియో చూడటం ఆరంభించాడు.

'ఇంతవరకూ అతడి దృష్టి తెరపై జరుగుతున్న దానిపై ఉంది. మిగతావి గమనించలేదు. ఇప్పుడు గమనించటం ఆరంభించాడు.

'ఇది హోటల్ గది' అన్నాడు శరత్.

తల ఊపాడు విజయ్. 'ఏ హోటల్?' అడిగాడు.

శరత్ మాట్లాడలేదు. మళ్ళీ ఆరంభంనుంచీ చూశాడు.

'చాలా కాస్ట్లీ గది బహుశా సూట్ అయి ఉంటుంది'.

గదిలో ఓ మూల అద్దం ఉంది. అక్కడ పలు రకాల అలంకరణ సామగ్రి ఉంది.

పదేపదే రివైండ్ చేసి చూస్తున్నాడు శరత్. స్లోమోషన్‌లో చూశాడు.

వీడియో ఎనలిస్ట్ వీణకు ఫోను చేశాడు కాస్సేపటికి.

***

'నా దగ్గర ప్రత్యేకమైన సాఫ్ట్‌వేర్ ఉంది. దానితో కెమెరా కన్ను పడిన ప్రతి అంగుళాన్ని పెద్దదిగా చేసి పరిశీలించవచ్చు' అంది వీణ వీడియోని కాపీ చేస్తూ. శరత్ మాట్లాడలేదు.

'మనకున్నది ఇదొక్కటే ఆధారం. క్యాబ్ కంపెనీల వాళ్ళు కూడా ఏమీ చెప్పలేదు. అలా ఎవ్వరూ బుక్ చేసుకోలేదన్నారు. ఏదైనా ఆధారం దొరికితే వీడియో ద్వారానే దొరకాలి' చెప్పాడు విజయ్.

మళ్ళీ వీడియో ప్లే చేశారు. ఒకో ప్రాంతాన్ని ఎంచుకుని దాని పరిమాణం పెంచి పరిశీలనగా చూస్తున్నారు.

ఓ ప్రాంతాన్ని చూస్తుంటే హఠాత్తుగా అన్నాడు శరత్. 'ఒక్క నిముషం ఆపు. ఇక్కడ రంగు మారినట్టుంది' అన్నాడు.

వీణ ఆ భాగాన్ని ఫ్రీజ్ చేసింది. తెరను నాలుగు భాగాలుగా విభజించి ఇతర భాగాలు కూడా కనబడేటట్టు చేసింది. కాస్సేపు పరిశీలించిన తరువాత 'అవును' అంది.

మళ్ళీ మొదటి నుంచి జాగ్రత్తగా చూడటం ఆరంభించారు.

కాస్సేపటికి అంది వీణ. 'టీవీ ఆన్ చేసినట్టున్నాడు. టీవీ కెమెరా పరిధిలో లేదు. కానీ అది ఆన్ అయినప్పటి వెలుతురు వల్ల రంగు మారినట్టు తోస్తోంది'.

'అంటే, వాడు ఆమెని హత్యచేసి టీవీ ఆన్‌చేసి, వీడియో ఆపేశాడన్నమాట' అనుకున్నాడు శరత్.



'ఓసారి కెమెరా పరిధి అంచువరకూ వెళ్ళి చూద్దాం' అన్నాడు.

మళ్ళీ ఆరంభించి అణువణువు జాగ్రత్తగా పరిశీలించటం ఆరంభించారు. చివరికి వస్తుండగా 'ఆపు' అని అరిచాడు శరత్.

ఆపి అతడి వైపు చూసింది వీణ.

'టీవీ కెమెరా పరిధి బయట ఉందిగానీ, టీవీ తెర అద్దంలో ప్రతిఫలిస్తోంది. అందుకే మనకు అంత వెలుతురు కనిపించింది' చెప్పాడు శరత్.

ఈసారి అద్దాన్ని మాత్రమే తెరపై పెద్దగాచేసి గమనించసాగారు. చివరికి ఒక్కసారిగా అద్దంలో వెలుతురు వెలిగింది, నీలి రంగులో. టీవీ తెర కనిపించింది. వీడియో ఆగిపోయింది.

శరత్ వైపు ప్రశ్నార్థకంగా చూసింది వీణ.

శరత్ నవ్వాడు. 'టీవీ తెర కనిపించిన భాగాన్ని పెద్దగా చెయ్యి. సాధారణంగా హోటళ్ళలో టీవీ ఆన్ కాగానే వెల్ కమ్ టు సో అండ్ సో హోటల్ అని వస్తుంది. అది చాలు హోటల్ అడ్రస్ తెలుసుకోవటానికి అన్నాడు'

వీణ అతడు చెప్పినట్టు చేయసాగింది.

***

హోటల్‌వాళ్ళు వీడియో ద్వారా మనిషిని గుర్తించారు.

'ఇతడికి క్రిమినల్ రికార్డు ఉంది. పేరు కిరణ్. వారం క్రితం జైలు నుండి విడుదలయ్యాడు. అమ్మాయిలను హింసిస్తున్న నేరానికి పదేళ్ళు జైలుశిక్ష అనుభవించాడు. విడుదల కాగానే మళ్ళీ మొదలు పెట్టాడు'. డేటాబేస్‌లో చూసి చెప్పాడు విజయ్.

'ఇతడి అడ్రసు'

చెప్పాడు విజయ్. 'కానీ అక్కడే ఉండాలని లేదు' అన్నాడు.

'ఇప్పటికే రాము అన్ని పెద్ద హోటళ్ళలో సూట్ బుకింగ్‌ల గురించి ప్రశ్నిస్తున్నాడు.

నా అనుమానం వాడు అమ్మాయిని ఏదో హోటల్‌లో సూట్‌కి తీసుకెళ్ళి ఉండాలి' శరత్ మాట పూర్తవుతుంటేనే రాము నుంచి ఫోను వచ్చింది.

ఫోనులో మాట విని విజయ్‌తో చెప్పాడు శరత్ 'గ్రాండెస్ట్ గ్రాండ్' హోటల్.

***

'తలుపు బద్దలు కొట్టడం తప్ప మరో మార్గం లేదు' విజయ్ అన్నాడు గుసగుసగా.

లోపల బోల్టు వేసి ఉంది. రిసెప్షన్ నుంచి ఫోను చేస్తే ఎత్తటం లేదు.

'పోలీసులు.. తలుపు తియ్' అరిచాడు విజయ్.

లోపలి నుంచి సమాధానం లేదు.

'ఓకే..' అన్నాడు శరత్.

హోటల్ స్టాఫ్ తలుపు బద్దలు కొట్టారు.

వెంటనే తుపాకులు సిద్ధంగా పట్టుకుని పోలీసులు, విజయ్, శరత్ లోపలకు వెళ్ళారు.

లోపల కనిపించిన దృశ్యం వాళ్ళని నిర్ఘాంత పరిచింది.

అమ్మాయి మంచానికి కట్టేసి ఉంది.

అమ్మాయి పక్కన పడి ఉన్నాడు కిరణ్. బహుశా పోలీసులు హెచ్చరించగానే తన గొంతు కోసుకున్నట్టున్నాడు. రక్తం బొటాబొటా కారుతోంది.

'ఇంకా ప్రాణం ఉంది' చెప్పాడు శరత్.

వెంటనే అతణ్ణి ఆంబులెన్స్‌లో పంపించారు. అమ్మాయి స్పృహలో లేదు.

'వాడు బ్రతుకుతాడా?' అడిగాడు రాము.

'చెప్పలేం. బ్రతికితే వాడి చర్యలకు కారణం తెలుస్తుంది. లేకపోతే, ఇన్నాళ్ళు జైలులో ఉన్న కసిని, కనబడిన అమ్మాయిల మీద తీర్చుకుంటున్నాడని అనుకోవాలి' అన్నాడు శరత్.

**–కస్తూరి మురళీకృష్ణ**
*సెల్: 98496 17392*



# నిమజ్జనం

-మన్నెం శారద

**సూర్యుడు అస్తమిస్తున్న వేళ!**

**ఆకాశం ఎర్రగా కందిపోతున్నది.**

**గోదావరి ఉరుకులూ పరుగులూ తగ్గించి నిదానంగా సాగర ప్రవేశం చేయడానికి ఆయత్తమవుతున్న ప్రదేశం అది!**

**నదంతా ఎర్రదనం పులుముకుంది.**

**జాలరి విసిరిన వలలా చీకటి మరోవైపు నుండి నదిమీద పాకుతున్నది.**

నదికి ఎదురుగా ఉన్న గుడిమెట్ల మీద కూర్చున్నాడు హర్ష.

అతని చూపు ప్రవహిస్తున్న గోదావరి మీదనే ఉంది.

ఇందాకనే తాను నిమజ్జనం చేసిన తనతల్లి తాలూకా చితాభస్మం, అస్థికలు ఆ నదితో పాటే దూరంగా సాగిపోవడం అతను భరించలేక పోతున్నాడు.

'అమ్మ వెళ్ళిపోతోంది! ఇక ఏ రూపంలోనూ కనబడదు' అనే విషయం అతన్ని కుదిపేస్తోంది.

అప్పుడొచ్చిందతనికి చెప్పలేని దుఃఖం!

అమ్మ తనని అపురూపంగా పెంచింది.

తల్లులందరూ తమ పిల్లల్ని అపురూపంగానే పెంచుతారు. ఎన్నో త్యాగాలు చేస్తారు. కానీ అమ్మ తనని ఒక స్నేహితుడిలా చూసేది. అమ్మకి తాను చేసిన తప్పుల్ని కూడా చెప్పగల ధైర్యాన్నిచ్చింది. ఎప్పుడూ కోపం ప్రదర్శించేది కాదు.

అమ్మ ఇప్పుడు వెళ్ళిపోతోంది, అనంత సాగరంలోకి! అమ్మ లేదంటే.. వెలుగు లేనట్లే!

హర్ష కళ్ళు అవిరామంగా వర్షిస్తూనే ఉన్నాయి.

"చీకటైపోయింది. పడుకోండి" తనలాగే తండ్రి అస్థికలు నిమజ్జనం చెయ్యడానికొచ్చిన వ్యక్తి శ్రీహర్షని పలుకరించాడు.

శ్రీహర్ష లేచి గుడిలో ఓ పక్కగా దుప్పటి పరుచుకున్నాడు.

అప్పుడు గుర్తొచ్చిందతనికి, తాను వస్తుండగా సుశీల ఇచ్చిన ఉత్తరం సంగతి.

"ఏంటిది?" అడిగాడు హర్ష భార్యని.

"అత్తయ్య మీకు రాసిన ఉత్తరం!"

హర్షకి అర్థం కాలేదు. "ఉత్తరమా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"అవును. అత్తయ్య తాను చనిపోయాక మీకిమ్మని చెప్పారు!"

హర్ష సంశయంగా చూశాడు.

సుశీల నవ్వింది. "ఏం లేదు, ఏవిటో అత్తయ్య పిచ్చి. నా చేతనే రాయించింది. ఆ రోజు అసలు బాగోలేదావిడకి" అంది.

"మరి ఇదివరకే చెప్పలేదు?"

"అత్తయ్య చెప్పొద్దంది. అందుకే చెప్పలేదు" అంది సుశీల.

హర్ష ఆ కవరు తెరిచి చిన్నగా దీపం దగ్గరకెళ్ళి చదివాడు.

నాన్నా,

ఇక నేనుండనని నాకు తెలుసు. మీకు తెలుసు. పోతానని తెలిసిన దగ్గర్నుండి నన్నో బాధ వెంటాడి తినేస్తున్నది. చనిపోతున్నానని కాదు. ఎలా చెప్పాలో కూడా నాకు తెలియడంలేదు. మీ నాన్న గురించే నా బాధ. పెళ్ళికి ముందు ఏమోగానీ పెళ్ళయ్యాక మీ నాన్నని నేనొక పిల్లవాడిలానే చూశాను. ఆయనెప్పుడూ నోరు తెరచి ఇది కావాలని అడిగి ఎరుగరు. ఆయన తత్త్వం చూసి నేనే అన్నీ అమర్చిపెట్టేదాన్ని. ఎన్నడూ నన్నో మాట అని బాధ పెట్టిన మనిషి కాదు. ఇప్పుడు నేను వెళ్ళిపోతే ఆయన్ని మీరెలా చూసుకుంటారోనని నా బాధ. నేను సుశీలనుగానీ, నిన్నుగానీ అనుమానించడం లేదు. సుశీల నేను పెంచిన పిల్ల. కోడలయినా కూతురయినా అదే! నేనంటే మిమ్మల్ని కలుపుకుని చనువుగా తిరిగేదాన్ని. ఆయన మౌనంగా ఉంటారు. ఏదో టైముకింత పెట్టమని కాకుండా కాసేపు ఆయన దగ్గర కూర్చుని పలుకరిస్తూ ఉండండి. ఆయన ఉనికిని గౌరవించండి. నేను లేనని ఆయన బాధపడే క్షణాలు

రానియ్యకండి. ఇదే నా కోరిక. – ఇట్లు ఆశీస్సులతో అమ్మ.

ఆ ఉత్తరం పూర్తి చేసేసరికి హర్ష కళ్ళు మళ్ళీ చెమర్చాయి. "పిచ్చి అమ్మ! పోతూ కూడా నాన్న గురించి ఎంత ఆరాటం!" అనుకున్నాడు బాధగా.

శ్రీహర్ష ఆలోచిస్తూ దుప్పటిమీద కొరిగాడు.

ఆ నీరవ నిశీధిలో గోదావరి ప్రవాహశబ్దం వింతగా వినిపిస్తున్నది.

"తన తండ్రి ముకుందరావు నిజంగానే సాత్వికుడు. ఎన్నడూ ఏదీ కావాలని అడగని మనిషి. అమ్మే అన్నీ చూసుకునేది. జీతంతెచ్చి అమ్మకివ్వడమే ఆయన పని!

అలా అని ఇంటిని పట్టించుకోని మనిషేం కాదు. తన చదువు సంధ్యలకి చెప్పలేని ప్రాధాన్యం ఇచ్చేవారు. తనని ప్రొద్దుటే లేపి సైకిల్ నేర్పించేవారు. ట్యూషన్‌కి తీసుకెళ్ళేవారు. తను రావటం ఆలస్యమైతే స్కూలు దాకా వచ్చేవారు. తను ఏది కావాలని అడిగినా కొనిచ్చేవారు. ఎటొచ్చీ ఆయన అమ్మలా మాటకారి కాదు. మనుషుల్ని కలుపుకునిపోయే చాకచక్యం లేదు. అందువలన ఇంటా బయటా భారం అమ్మ మీదే పడింది. తనుకూడా నాన్నతో ఫ్రీగా చనువుగా మాట్లాడలేకపోయేవాడు. తమ ఇద్దరికీ మధ్య అమ్మే వారధి! ఆ వారధి ఇప్పుడు కూలిపోయింది. కేన్సర్ రూపంలో అమ్మని మరణం బలి తీసుకుంది. తను లేకపోతే నాన్ననెలా చూస్తానో అని అమ్మ భయపడింది. అమ్మ ఇలా హెచ్చరించటం కూడా మంచిదేనేమో!"

ఆలోచిస్తూ ఆలోచిస్తూ చిన్నగా నిద్రలోకి జారుకున్నాడు శ్రీహర్ష.

***

సుశీలకి చాలా వెలితిగా ఉంది.

అత్తగారు లేని ఇల్లు చాలా శూన్యంగా ఉంది.

ఇంచుమించు ఇంటిని దోచుకెళ్ళి పోయిందావిడ. తనకి బాగా గుర్తు.

తన ఏడవ సంవత్సరంలో తల్లి చనిపోయింది.

తండ్రి మూడో నెలలోనే మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు.

సవతి తల్లి శకుంతల తనని భరించలేకపోతుంటే అత్త వచ్చి తనని తీసుకెళ్ళిపోయింది. నిజానికి తను మామయ్య చెల్లెలి కూతురు. కాని అత్త తనని కూతురిలా ప్రేమించింది. చదివించింది. మంచీ చెడూ నేర్పించింది. తనకి తల్లిలేదన్న బాధ మరచిపోయేలా చేసింది. మావయ్య సరేసరి, ఒకమాట అని ఎరుగడు.

చివరికి శ్రీహర్షకే ఇచ్చి పెళ్ళిచేసి తనని కోడలుగా చేసుకుంది. పొందికగా ఒక బొమ్మరిల్లులా అందంగా సాగుతున్న తమ లోగిలిలో కేన్సర్‌వ్యాధి సోకి అత్తగారిని తీసుకెళ్ళిపోయింది.

సుశీల తలగడలో తల దూర్చి వెక్కెక్కి ఏడ్చింది.

**అప్పటివరకు ఇంటి పెత్తనం సాగించిన అత్తగారు పోయింది. ఇల్లంతా ఒక్కసారిగా బోసిపోయింది. ఆ కోడలికి మనసు ఎంతో వెలితిగా మారింది. అత్తగారు పోయేముందు ఒక ఉత్తరం కోడలిచేత రాయించింది. మరో ఉత్తరం ఆవిడే రాసి సీల్‌చేసింది. తాను పోయాక ఆ ఉత్తరాలు కన్నకొడుక్కి ఇచ్చే బాధ్యత కోడలికే అప్పగించింది. మరి ఆ ఉత్తరాలు ఆమె తన భర్తకు ఇచ్చిందా? ఇంతకీ ఆ ఉత్తరాల్లో అత్తగారు ఏం రాసింది?**

## తాప్సీకి గండి కొట్టిన కృతి కర్బందా!



*ఈ ఇద్దరు ముద్దు గుమ్మలు దక్షిణాది నుంచి ఉత్తరాదికి వెళ్ళినవారే! కాకపోతే సక్సెస్ మత్తు తాప్సీ తల కెక్కింది. కృతి ఇంకా అంతదాకా రాలేదు. నిన్న మొన్నటి దాకా తాప్సీ దక్షిణాది వారిని తెగ దుమ్మెత్తిపోసి ఉత్తరాదిన వారిని ఆకాశానికి ఎత్తేసింది. అయితే ఉత్తరాది వారిని తాప్సీ ఎంత కాకాపట్టినా ఫలితం ఉండదు అన్న విషయం తాజాగా బయటపడింది. తాప్సీ కొత్తగా హిందీ సినిమా ఒప్పుకుందన్న వార్తలు బాగా హల్‌చల్ చేశాయి. ఆ సినిమా దర్శకనిర్మాతలు తాప్సీ దగ్గరకు వెళ్లారే తప్ప ఆమెను తీసుకుంటున్నట్టు అధికారికంగా ప్రకటించలేదు. అయినా తాప్సీ ఆ సినిమా చేస్తోందన్న ప్రచారం జరిగింది. అయితే ఇప్పుడు ఆ సినిమా తాప్సీ చేతి నుంచి జారిపోయింది. తాప్సీ స్థానంలో కృతి కర్బందాను తీసుకున్నారట! అంతే కాకుండా షూటింగ్ కూడా మొదలెట్టేశారట! ఈ దెబ్బకు తాప్సీ కళ్ళు తిరిగి కింద పడినట్టయింది అంటున్నారు బాలీవుడ్ జనాలు.*

నిజానికి ఆమె మరణం ఎక్కువగా సుశీలకే లోటు!

"అమ్మా తలుపేసుకో! నేనలా వెళ్ళొస్తాను" అన్నాడు ముకుందరావు సుశీల గది దగ్గరకొచ్చి.

సుశీల దిగ్గున మంచమ్మీద నుండి లేచి, ఒక్క క్షణం మావయ్యా" అంది బీరువా దగ్గరకెళ్తూ.

ముకుందరావు ఏవిటన్నట్లుగా నిలబడ్డాడు.

సుశీల ఒక కవరు తీసి ముకుందరావు చేతికిచ్చింది.

"ఏంటిది?" అనడిగాడు ముకుందరావు.

"ఇది అత్తయ్య రాసిన ఉత్తరం" అంది సుశీల.

"ఉత్తరమా?" ఆశ్చర్యపోతూ చూశాడాయన.

"అవును. నిజానికి అది మీకు రాసిన ఉత్తరం కాదు. బావకి రాసింది. తను చనిపోయాక ఆయనకు ఇమ్మనిచెప్పింది అత్తయ్య".

అర్థం కానట్లు చూశారాయన.

"ఆ రోజు అత్తయ్య చాలా ఎమోషనల్‌గా ఉంది. మాటిమాటికి ఏడుస్తూ 'ఛీ నేను ఆనాడే వదిలేయాల్సింది. ఎందుకంత మాట భరించాను. ఇదిగో వీడి మొహం చూసి! అని రోషపడుతూనే ఉంది. నేనెంత అడిగినా చెప్పలేదు. అనారోగ్యంవల్లనే ఆమె అలా విసుక్కుంటున్నదేమో అనుకున్నాను. కాసేపటికి "ఏవే, సుశీలా ఓ కాగితం, కలం తెచ్చిపెట్టవే!" అంది. నేను తీసుకెళ్ళి ఇచ్చాను. ఆవిడ ఏడుస్తూనే ఏంటో రాసుకుంది. తర్వాత కవరులో పెట్టి అంటించి, "ఇది వాడికివ్వు! ఇప్పుడు కాదు, నేను పోయాక! దీన్ని నువ్వు తెరచి చూసినా నా మీదొట్టే" అన్నారు.

నేను ఆ కవరు భద్రంగా దాచిపెట్టాను. మొన్న అత్తయ్య పోయాక ఆయనకు ఇద్దాం అనుకుంటుండగా నేను సందిగ్ధంలో పడ్డాను. ఆరోజు అత్తయ్య చాలా ఎమోషన్‌లో రాసిన ఉత్తరమది. ఆనాడు నేను వదిలేయాల్సింది అన్నమాట నా చెవిలో గింగురుమంటోంది. అంతే అందులో మీ గురించే ఏదో ఉండి ఉంటుందన్న ఆలోచన వచ్చింది" అని ఆగింది సుశీల ముకుందరావు మొహంలోకి చూస్తూ.

ముకుందరావు అలానే చూస్తున్నాడు మేనకోడలి వైపు. "నేను బాగా ఆలోచించాను. మీ ఇద్దరి మధ్య ఏదైనా ఉండి ఉండొచ్చు. ఇప్పుడావిడ వెళ్ళిపోయింది. ఈ ఉత్తరం బావచేతికిచ్చి మీ మీద ఒక కొత్త భావన కల్గించాల్సిన అవసరం లేదనిపించింది. ఆయనకి మీరు తండ్రి. మీ ఇద్దరి బంధం చివరి వరకూ అలానే ఉండాలని ఈ ఉత్తరం ఆయనకివ్వలేదు మామయ్య" అంది సుశీల.

ముకుందరావుకి ఇంకా ఆశ్చర్యంగానే ఉంది శాంత ఏమి రాసి ఉంటుందా అని.

"ఇప్పుడీ ఉత్తరం మీకు కూడా తెలియకుండా నేను చింపేసి ఉండొచ్చు. కానీ ఆవిడ పడిన వేదన ఏమిటో మీకన్నా తెలియాలి కదా! అది తెలుసుకుని పశ్చాత్తాపపడితే అత్తయ్య ఆత్మ శాంతిస్తుందని మీకు ఇస్తున్నాను. చదవండి మావయ్యా! అత్తయ్య బాధేంటో తెలుసుకో" అంది సుశీల.

ముకుందరావు కవరు తీసుకుని వెళ్తుంటే "మావయ్యా, నేను కూడా ఆ ఉత్తరం చూడలేదు" అంది సుశీల నెమ్మదిగా.

***

పార్కులో ఓమూల బెంచీమీద కూర్చున్నాడు ముకుందరావు.

అతని ఆలోచనలు పరిపరివిధాల పోతున్నాయి.

ఆ ఉత్తరం మడత విప్పాలంటేనే జంకుగా ఉందతనికి.

పెళ్ళయ్యాక శాంత ఎప్పుడూ తనపట్ల కోపం గానీ, అసహ్యంగానీ ఎన్నడూ ప్రదర్శించి ఎరుగదు. ఇంటిని తను అంతగా పట్టించుకోకపోయినా అన్నీ తానే చూసుకునేది. తాను అనేకసార్లు అనారోగ్యం పాలయినా చాలా శ్రద్ధగా ఆమె నాకు సేవలు చేసేది. ముఖ్యంగా తనవాళ్ళని చాలా ప్రేమగా ఆదరించేది. ఆడపడుచు కూతురయినా సుశీలని ఎంతో వాత్సల్యంగా అక్కున చేర్చుకుని కన్నకూతురులా పెంచింది. ఎక్కడ పరాయి సంబంధంచేస్తే కష్టాల పాలవుతుందోనని శ్రీహర్షకిచ్చి వివాహం జరిపించింది. తను కూడా ఆమె పనులకెప్పుడూ అడ్డం పడింది లేదు. అందరూ తనని శాంతా విధేయుడని గేలిచేసినా తానేం అది అగౌరవంగానో, నామోషీగానో భావించలేదు.

మరెందుకిలా కొడుక్కి తనగురించి ఉత్తరం రాయడం! అసలిదంతా తన గురించేనా! సుశీల ఆ రోజు ఏడ్చిందంటుందేవిటి! ఛీ! ఆ రోజే వదిలేసి ఉండాల్సిందన్నదట! అది తననేనా!

ఆలోచించేకొలదీ అతని మెదడులో నరాలు చిట్లి

పోయేటట్లున్నాయి.

అసలే శాంతలేని లోటు భయంకరంగా కనిపిస్తున్నది. అందరికీ సంధానకర్తలా మెలిగేది. మౌనంగా కూర్చున్నా కదిలించి మాట్లాడించేది. తన ఆకలి, అవసరాలు తెలుసుకుని ఎప్పటికప్పుడు కావాల్సిన ఏర్పాట్లు చేసేది.

'చాలా వెలితిగా ఉంది ఆమె మరణం!' అనుకున్నాడు ముకుందరావు బాధగా.

చాలాసేపు ఆ ఉత్తరాన్ని అలానే పట్టుకుని కూర్చున్నాడతను ఒక రకమైన భయానికి గురవుతూ.

చీకటి పడుతోంది.

పార్కులో లైట్లు వెలిగాయి.

ఇక తప్పదన్నట్లుగా కవరులోంచి ఉత్తరం తీశాడు.

కళ్ళద్దాలు సవరించుకుని ఉత్తరం చదవసాగాడు మెల్లిగా.

'ప్రియమైన నాన్నా!

నేనిక వెళ్ళిపోతానని నాకు తెలుసు. ఈ బాధ సహించి బ్రతకాలని కూడా నాకు లేదు. ఇంతకంటే బాధని నేను నా జీవితకాలం మనసులో దాచుకుని బ్రతికాను. నువ్వు పెద్దవాడవు అయ్యావు. మనమిద్దరమూ తల్లీ బిడ్డల్లా కాకుండా మంచి స్నేహితుల్లా మసలేం.

నీ పెళ్ళి విషయంలో కూడా నువ్వు మీ కొలీగ్ శ్రీలతని పెళ్ళి చేసుకుంటానని చెప్పినప్పుడు నేను




ఆమెను వెళ్ళిచూశాను. ఆకర్షణగా బాగానే ఉన్నా ఆమె మనతో కలిసి ఉండలేదన్న విషయం గ్రహించి నీకన్నీ వివరంగా చెప్పాను. ఆమె జీవన విధానం వేరు! బాహ్యాకర్షణలు కొంతకాలానికి సూర్యరశ్మి తగిలిన పొగమంచులా విడిపోతాయని నేను చెప్పింది నువ్వు విన్నావు. ఆ విషయం ఇప్పటికీ నేను మీ నాన్నకిగానీ, సుశీలకిగానీ తెలియనివ్వలేదు. సుశీలలాంటి ఉత్తమురాలు దొరకటం నీ అదృష్టం.

ఇక ఇప్పుడు చెప్పబోయేది మీ నాన్న గురించి'.

ముకుందరావు హృదయం గబగబా కొట్టుకుంది.

క్షణం ఆగి అతను మళ్ళీ చదవడం ప్రారంభించాడు.

నా పెళ్ళి కాకుండానే మా నాన్న చనిపోయారు. మంచి ఆస్తి మాది. నాలుగు స్తంభాల్లాంటి నలుగురు అన్నయ్యలు మంచి స్థాయిలో ఉండి కూడా నన్ను పట్టించుకోలేదు. అసలు నా పెళ్ళి చెయ్యాలన్న ఆలోచనకూడా వాళ్ళకున్నట్టుగా ప్రవర్తించలేదు. ఆస్తి వాటాలేసుకుని వెళ్ళిపోయారు. అమ్మమ్మ నిస్సహాయురాలు. నా పెళ్ళిగురించి పదే పదే వాళ్ళకి ఉత్తరాలు రాసి పోరుతుండేది. ప్రయోజనం శూన్యం. అప్పటికే మా అక్కకి ఇద్దరు పిల్లలు. రెండోకాన్పులో అక్క చాలా జబ్బు పడింది. పచ్చకామెర్లు. చనిపోతుందనుకున్నారందరూ. అలాంటప్పుడు పిల్లల్ని చూసుకోవడానికి నేను, అమ్మమ్మ వెళ్ళాల్సొచ్చింది. బావగారు తాసిల్దారుగా పనిచేసేవారు. చాలా మంచివ్యక్తి. నీకు తెలుసు కదా! నువ్వంటే కూడా ప్రాణం ఆయనకి.

'సరే! అక్కని ఎలాగోలా బతికించుకున్నాం. అక్క పిల్లలు నాకు చాలా మాలిమి అయ్యారు. 'పిన్నీ పిన్నీ' అని ప్రాణాలు పెట్టేవారు. అందుకే నాకు నువ్వొక్కడే కొడుకువనిపించవు. ఎప్పుడూ ముగ్గురు పిల్లలనుకుంటాను నేను.

అక్క కోలుకున్నాక నాకు పెళ్ళి సంబంధాలు చూడమని మీ పెదనాన్నని పోరసాగింది. ఆయన కూడా చాలా బాధ్యతగా వెతికి మీ నాన్నని పట్టుకున్నారు. మీ నాన్న సౌమ్యులుగా ఉండటం అందరికీ నచ్చింది.

బావగారి ఖర్చులతోనే నా పెళ్ళి జరిగింది.

అన్నలు వచ్చి హాజరు వేయించుకుని వెళ్ళిపోయారు.

చివరికి నిన్ను కనేటప్పుడు పురిటికి కూడా నన్ను అక్కయ్యే తన ఇంటికి తీసుకెళ్ళింది.

అప్పుడే జరిగింది. మూడోనెలలో నిన్ను తీసుకుని మన ఇంటికి వచ్చాను. నిన్నుచూసి మురిసి పోవాల్సింది పోయి మీ నాన్న ముభావంగా కనిపించారు. నాకేమీ అర్థం కాలేదు. నువ్వెంతో ముద్దుగా అందంగా పుట్టావు. అందరూ నిన్నుచూసి ముద్దు చేసేవారుగానీ, మీనాన్న మాత్రం ఒక్కసారికూడా నిన్నెత్తుకోలేదు. నాకు చాలా బాధ కల్గింది. 'ఆయనకి ఒంట్లో బాగోలేదా' అని మరీ మరీ అడిగాను ఏమీ చెప్పలేదు.

ఒకరోజు రాత్రి ఆయన అసహనంగా వరండాలో కూర్చున్నారు. నీకు పాలుపట్టి పక్కమీద ఆయన లేక పోవటం చూసి హాల్లో కెళ్ళాను.

"ఏవయింది? నిద్ర పట్టలేదా?" అనడిగాను సౌమ్యంగా దగ్గరకెళ్ళి.

కాసేపాయననుండి జవాబు లేదు.

"అవునూ, మీ బావకీ నీకూ ఉన్న సంబంధం ఏమిటీ?" అన్నారు.

ఆ ప్రశ్నకి నేను ఉలికిపడ్డాను.

అర్థమయీ అర్థం కానట్టు ఉందా ప్రశ్న!

తప్పుగా అర్థం చేసుకుని మీ నాన్న సంస్కారాన్ని తక్కువ చేయడానికి మనసొప్పడం లేదు.

"మీరనేది...?" అన్నాను నిర్ఘాంతపోతూ.

"అంటే....సరిగ్గా చెప్పండి" అన్నాను తిరిగి నేనే!

అప్పటికే నా కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

"ఏమో... నాకలా అనిపించింది" అంటూ వెళ్ళి పడుకున్నారు.

నేను విలవిలలాడిపోయాను. అలాగే చాలాసేపు అక్కడే కూర్చుండిపోయాను. కళ్ళు ధారాపాతంగా వర్షిస్తున్నాయి.

ఆ మర్నాడు ఆఫీసుకెళ్ళిపోతూ "వదిలేసేయ్. ఏదో నా మనసుకలా అనిపించింది. అడిగేశాను" అంటూ వెళ్ళిపోయారు మీ నాన్న.

ఆ తర్వాత ఆయన ఆ ప్రస్తావన మళ్ళీ ఎన్నడూ తేలేదుగానీ, ఆయన అడిగినమాట నా జీవిత కాలమూ ముల్లులా గుచ్చుతూనే ఉంది నన్ను.

ఆయన ఇంకేమాటన్నా నేను పట్టించుకునే దాన్ని కాదు. ఒకే చోట అనేక సంవత్సరాలు కలిసున్నప్పుడు మనలో నచ్చని అంశాలు చాలా కనిపించవచ్చు. కానీ ఇది నా శీలానికి సంబంధించింది. ఏ మాటంటే మానసిక బంధం బీటలు వారుతుందో ఆ మాటే అన్నారు మీ నాన్న. వదిలేయడం, విడాకులు.. నాకు చేతకాదు. నిజానికి ఆరోజే నేను మానసికంగా మీ నాన్నతో విడిపోయాను. నిన్నుపెంచి గౌరవస్థానంలో నిలబెట్టడానికి నేను నా ధర్మం నిర్వర్తిస్తూ పోయాను.

ఎవరికి చెప్పినా వారు మీ నాన్నని తక్కువ చేసి చూస్తారని నా మనసులో అలానే దాచుకున్నాను. ఇప్పుడైనా నీకు చెప్పకుండా సమాధి చెయ్యొచ్చు. నువ్వు కూడా మగాడివి. ఏ క్షణమైనా నువ్వుకూడా సుశీలని మీ నాన్నలా మాట్లాడకూడదనే ఉద్దేశంతోనే ఇదంతా చెబుతున్నాను. నువ్వేకాదు ఏ మగాడు కూడా ఎంత కోపమొచ్చినా స్త్రీ శీలాన్ని దెబ్బ తియ్యకూడదు. అవసరార్థమో, గతిలేకో ఆ నింద భరించి కాలం గడిపినా ఆ వ్యక్తి ఇక జీవితంలో ఎన్నడూ ఆమె ప్రేమని పొందలేడు. శీలమ్మీద దెబ్బతీసిన వ్యక్తిని స్త్రీ ఎన్నటికీ క్షమించలేదు. ఈ అనారోగ్యంలో నాకీ విషయం నీకు చెప్పాలనిపించింది. అంతే.

ఇట్లు అమ్మ.

ఆ ఉత్తరం పూర్తి చేసేసరికి ముకుందరావు కళ్ళు అవిరామంగా వర్షించసాగాయి.

'శాంత తనని క్షమించలేదా!' అనుకున్నాడు బాధగా.

***

భోజనాలదగ్గర శ్రీహర్ష తండ్రివైపు దీక్షగా చూశాడు. ముడుచుకుపోయిన అతని మొహంచూసి కొండంత జాలేసింది హర్షకి.

'నాన్నా' అన్నాడు గద్గదంగా.

ముకుందరావు తలెత్తలేదు.

పశ్చాత్తాపభావంతో అతని మనసు కృంగిపోయింది.

"మీ గురించి అమ్మకెంత ఆందోళనో చూశారా! ఎక్కడ తను లేకపోతే మిమ్మల్ని పట్టించుకోమేమో అని... మిమ్మల్ని జాగ్రత్తగా చూసుకోమని ఉత్తరం రాసిపెట్టిమరీ వెళ్ళిపోయింది. అమ్మ ఉన్నన్ని రోజులు నేనంతగా మీతో మాట్లాడి ఎరుగను. ఇప్పుడలా కాదు. మీకిప్పుడు నేను కొడుకునే కాదు. తండ్రిని కూడా. ఏది కావాలన్నా నిర్మొహమాటంగా అడగండి. సుశీలకూడా బయట అమ్మాయి కాదు" అన్నాడు హర్ష.

హర్ష మాటలు విన్నాక మరీ దుఃఖం ముంచుకొచ్చింది ముకుందరావుకి.

అతనా కన్నీటి పొరల్లోంచే సుశీలవైపు కృతజ్ఞతగా చూశాడు.

సుశీల ఆయనకి పెరుగు వడ్డిస్తూ చిన్నగా నవ్వింది.

**సెల్:96189 51250**




**హర్ష నైరాని కిడ్నాప్ చేశాడని కావ్య అనగానే రోహిణి కయ్యిమంది.**

**"సీమ అయిపోయింది. ఇప్పుడు హర్ష మీద పడ్డావా? ఎప్పుడూ ఎవరో ఒకరిమీద ద్వేషం పెట్టుకోవటం అవసరమా?"**

**"లేదు రోహిణీ! ఆధారాలతో సహా కనిపెట్టి చెప్పారు ఆన్‌లైన్ గూఢచారులు. ఆ టైమ్‌లో హర్ష ఆ అపార్ట్‌మెంట్‌లోనే ఉన్నాడట!" చెప్పింది కావ్య. ఏదో పరిశోధించిన ఆనందంలో ఆమె కళ్ళు వెలిగిపోతున్నాయి.**

**"నేను నమ్మను" లేచి వెళ్ళిపోయింది రోహిణి.**

**"నమ్మకపోతే పో!" తిట్టుకుంది కావ్య. ఈ బోండాలకి కూడా తనంటే లోకువైపోతోందీ మధ్య.**

ఇంకెవరితో షేర్ చేసుకోవచ్చో అర్థం కాలేదు కావ్యకి.

రోహిణి, అక్షయ్ ఇద్దరూ తిట్టిపోశారు విషయం చెప్పగానే.

వెళ్ళి సీమ డెస్క్ దగ్గర తచ్చాడింది.

అటూ ఇటూ శబ్దాలు చేస్తూ తిరిగింది.

సీమ క్యూబ్ దగ్గర జనాలు తచ్చాడటం ఆమెకి అలవాటే కావటంతో మొదట పట్టించుకోలేదామె.

కాసేపటికి కావ్యను గమనించింది సీమ.

"వాట్సప్ కావ్యా! ఏమైనా కావాలా?" అడిగింది.

"నీతో ఒక విషయం చెప్పాలి" అంది కావ్య.

"చెప్పు" కుతూహలంగా అంది సీమ.

కావ్య చెప్పింది వినగానే సీమ నవ్వాపుకుంది.

'దిసీజ్ ఫన్' అనుకుంది.

హర్షని ఆట పట్టించొచ్చు.

"నిజమా?" అంది మొహం ఆశ్చర్యంగా పెట్టి.

"అవును. చూశావా? ఎంత మంచివాడిలాగా ఉంటాడో. నేను చెప్పినా అక్షయ్ నమ్మటం లేదు. ఎలాగైనా నైరాని విడిపించాలి" అంది కావ్య.

"అయామ్ విత్ యూ!" చెప్పింది సీమ.

"హమ్మయ్య!" నిట్టూర్చింది కావ్య.

తనమాట కనీసం ఒక్కరన్నా నమ్ముతున్నారు.

సీమ మంచమ్మాయే కానీ మరీ అంత అందంగా పుట్టకుండా ఉండాల్సింది!

"ఇంకెవరికి చెప్పాలి?" ఆలోచించసాగింది.

ఆడవాళ్ళకి ఏదయినా వార్త వినపడగానే కనీసం ఒక పదిమందికి అయినా చెప్పాలనిపిస్తుంది. అలా చెప్పనిదే కడుపునొప్పి తగ్గదు. ఆడవాళ్ళ నోట్లో నువ్వుగింజ నానదనీ, బీబీసీ కంటే వేగంగా వార్తలు విస్తరింపచేస్తారనీ, మగవాళ్ళు ఎన్ని సెటైర్లు వేసినా పట్టించుకోనిది అందుకే. అది తమ బలహీనత అని వాళ్ళకు తెలిసి ఉండటమే.

బ్రహ్మీని మీటింగ్ అని కాన్ఫరెన్స్ రూమ్‌లోకి తీసుకెళ్ళి చెప్పింది కావ్య.

### జరిగిన కథ

*అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోవడంతో, వారి కూతురు నైరాని తన సంరక్షణలోకి తీసుకుంటాడు అక్షయ్. ఒక రోజు నైరా కనిపించకుండా పోతుంది. పోలీస్ ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. పేపర్లలో వచ్చిన వార్తల ఆధారంగా, ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ ఇచ్చిన సమాచారం మేరకు నైరా ఆచూకీ కోసం రకరకాలుగా ప్రయత్నిస్తుంటాడు అక్షయ్. ఆ ప్రయత్నాల్లో భాగంగా ఎంతో మంది చిన్న పిల్లలను కాపాడతాడు. అక్రమంగా అవయవ మార్పిడి వ్యాపారం నిర్వహిస్తున్న ఓ కార్పొరేట్ హాస్పిటల్‌ని మూయించేస్తాడు. నైరా ఆచూకీ కోసం కావ్య ఒక ఆన్‌లైన్ డిటెక్టివ్ ఏజెన్సీని కాంటాక్ట్ చేస్తుంది. ఆన్‌లైన్ డిటెక్టివ్ వద్దనుంచి ఓ ప్రైవేట్ మెసేజ్ వస్తుంది. నైరాని హర్ష కిడ్నాప్ చేసుండొచ్చని చెబుతాడు డిటెక్టివ్. దాంతో కావ్య ఆ విషయం అక్షయ్‌కి చెబుతుంది. కానీ అక్షయ్ ఆమె మాటలు నమ్మడు. దాంతో ఆమె హర్షని ఫాలో చేస్తుంటుంది.*

*ఆ తర్వాత....*

"హమ్మో!" గుండెలు బాదుకున్నాడు బ్రహ్మీ.

తర్వాత మేధావిలా పోజ్ పెట్టాడు.

కాసేపు ఆలోచిస్తున్నట్టుగా రూమ్‌లో అటూ ఇటూ తిరిగాడు.

ఒక నిర్ణయానికి వచ్చినట్లుగా కూర్చున్నాడు.

"అంత తెలివైనవాళ్ళు సాధారణంగా సైకోలే అయి ఉంటారు. చాలా ఇంగ్లీష్ సినిమాల్లో చూశాను" చెప్పాడు.

"మీకు ఇంగ్లీష్ సినిమాల్లో వాళ్ళ భాష అర్థమవుతుందా?" అనుమానంగా అడిగింది కావ్య.

"కింద సబ్ టైటిల్స్ ఉంటాయిగా. అందుకే చూశాను అన్నాను, విన్నాననలేదు" రోషంగా అన్నాడు బ్రహ్మీ.

"విషయం పక్కదారి పట్టేట్లుంది. తను కాస్త తెలివిగా మాట్లాడాలి" అనుకుంది కావ్య.

"ఏం చేద్దాం?" అడిగింది.

"అదే ఆలోచిస్తున్నాను."

కొద్ది క్షణాలు నిశ్శబ్దం.

"అతను ఆఫీస్‌కి రాగానే మనం వాడింటికి వెళ్ళి చెక్ చేసొద్దాం!" చెప్పాడు బ్రహ్మీ. కావ్యకి ఉత్సాహంగా, థ్రిల్లింగ్‌గా ఉంది. నైరాని తను విడిపించి అక్షయ్‌కి అప్పజెప్పబోతోంది.

***

మర్నాడు హర్ష ఆఫీస్ కెఫెటేరియాలో కనిపించాడు.

టీ తాగుతూ న్యూస్‌పేపర్ చదువుతున్నాడు.

"మనకెప్పుడూ పని ఉంటుంది. వీడింత హాయిగా ఉంటాడేమిటి?" ఒకళ్ళనొకళ్ళు ప్రశ్నించుకున్నారు కావ్య, బ్రహ్మీ.

"సైకో... సైకోలు అంతే!" అన్నాడు బ్రహ్మీ.

బ్రహ్మీ కార్‌లో హర్ష అపార్ట్‌మెంట్స్‌కి చేరుకున్నారు ఇద్దరూ గంటలో.

"ఫిఫ్త్‌ఫ్లోర్‌లో ఉంటుందతని ఇల్లు. ఇదివరకెప్పుడో ఒకసారి వచ్చాను" చెప్పాడు బ్రహ్మీ.

పనిమనిషి రావటం లేటైనా, తను ఆఫీస్‌కి వెళ్ళే టైమ్‌కి పని పూర్తికాకపోయినా పక్కింట్లో కీస్ ఇస్తాడట హర్ష. ఇదివరకెప్పుడో తీరిగ్గా కూర్చుని అందరూ గ్రూప్‌గా బాతాఖానీ కొట్టినప్పుడు అతను చెప్పిన విషయం గుర్తుంది వాళ్ళకు.

పక్క అపార్ట్‌మెంట్ తలుపు తట్టింది కావ్య.

తలుపు తీసిందొకావిడ.

తీస్తూనే అరవటం మొదలెట్టింది.

"ఇప్పుడొస్తే నా పని ఎప్పటికి తెమలాలి? గిన్నెలు ఎక్కడివక్కడ ఉన్నాయి. నిన్నటినుంచీ బట్టలు బాల్కనీలో కుప్పలుగా వేసున్నాయి. ఇప్పుడు కుదిరిందా నీకు?"

"బిక్కచచ్చిపోయింది కావ్య. ఎందుకు తనను తిడుతోంది?"

"వెళ్ళు. గబగబా అంట్లు తోమేసి, ఇల్లు క్లీన్ చేసేయి. నేను బయటికి వెళ్ళాలి" లోపలికి దారి తీస్తూ అందామె.

అప్పటికి కానీ అర్థం కాలేదామెకు, తనని పని మనిషి అనుకుంటోందని. అవమానం దిగమింగుకుంది.

ఇబ్బంది పడకూడదని ఇంత అరేంజ్‌మెంట్ చేసి అతని ఫేస్‌బుక్‌లో పోస్ట్ చేశా మెసేజ్. అదేదో తప్పయినట్లు అప్పటినుంచీ నాకు కీస్ ఇవ్వటం మానుకున్నాడు. ఊరెళ్తూ దారిలో నుంచి లాగిన్ అయి మరీ మెసేజ్ పెట్టాను. అసలు నాదే తప్పులే. మంచివాళ్ళకు స్థానం లేదీ ప్రపంచంలో.

మా ఆయన ఎప్పుడూ అంటుంటాడు. ఇంత

"అటుపక్క వాళ్ళ ఫ్లాట్‌లో ఇచ్చాడేమో కనుక్కో!"

భళ్ళున తలుపేసుకుంది.

అటుపక్క అపార్ట్‌మెంట్ వాళ్ళను అడగటానికి వెళ్ళింది కావ్య.

దారిలో బ్రహ్మి నవ్వాపుకోవటం కనబడింది. చూడనట్లే వెళ్ళి బెల్ కొట్టింది.

తలుపు ధబేల్న తెరుచుకుంది.

"బెల్ ఎందుకు కొట్టావ్?" ఆగ్రహంతో ఊగిపోతోందామె.

బెల్ ఉన్నది కొట్టటానికేగా! ఈ అపార్ట్‌మెంట్ కాంప్లెక్స్‌లో వాళ్ళంతా ఎందుకు కోపంగా ఉన్నారు? అయోమయంగా ఉంది కావ్యకు.

బెల్ ఇంకా రకరకాల హిందీ పాటలను అనుకరిస్తూ మోగుతూనే ఉంది.



"మీ ఇంట్లో పనికి రాలేదు. 503 కీస్ ఇస్తారా?" అడిగింది కావ్య.

"503 కీసా? ఆ ఆపార్ట్‌మెంట్‌లో పనికి వచ్చావా? ఆ అబ్బాయి మాకు కీస్ ఇవ్వటం లేదీ మధ్య. ఆ మధ్యొకసారి సడన్‌గా ఊరెళ్ళాల్సి వచ్చింది. ఫ్లోర్లో దాదాపు అందరూ ఊళ్ళకో, ఆఫీసులకో వెళ్ళారు. అదే టైమ్‌లో ఏమి చేయాలో అర్థం కాక కీస్ మా కిటికీలో ఉంచి, కిటికీ తలుపు తీసుంచా. అతను అమాయకురాలివి... ఎలా బతుకుతావు అని" చెప్తూనే ఉందావిడ.

"నేనెప్పుడు అలా అన్నానే?" లోపలినుంచి ఆశ్చర్యంగా వినబడిందొక గొంతు.

మూతి మూడు వంకర్లు తిప్పిందామె.

"ఈయనకి ఎప్పుడు ఎవరి ముందు ఏం మాట్లాడాలో తెలిసి చావదు" పళ్ళు పటపటా కొరికింది.

"సరిగ్గా మంచి ప్రోగ్రామ్ చూస్తున్నప్పుడే రోజూ ఎవరో ఒకళ్ళు బెల్ కొట్టి చస్తారు. ఈ ఫాన్సీ బెల్ కొట్టిన రెండు నిమిషాలకి కానీ మ్యూజిక్ ఆపదు. ప్రోగ్రామ్ మధ్యలో రోజూ డిస్టర్బెన్స్!"

"నువ్వా ప్రోగ్రామ్‌కి బాగా అడిక్ట్ అవుతున్నావు. అక్కడేమీ మిస్సవ్వవులే. ప్రోగ్రామ్‌కి వచ్చిన వాళ్ళందరినీ హోస్ట్, లాయర్, సైకియాట్రిస్ట్ కలిసి తిట్టిపోయటమేగా, రోజూ జరిగేది. సర్లే, నువ్వెళ్ళు. నేను కనుక్కుంటాను" వెనక నుంచి వస్తూ అన్నా

ఒక్కోసారి కొన్ని విషయాలను మనం చూడకుండా ఉండాల్సింది అనిపిస్తుంది. ప్రస్తుతం అక్షయ్ స్థితి అదే. అనుకోకుండా కనబడిన డ్రగ్ డీలర్‌ని అనుసరిస్తున్నాడు. కారులో అతడిపక్క సీట్లో ఓ మూడేళ్ళ పాప. ఓ షాపుముందు ఆగింది కారు. డీలర్ షాపులోపలికి వెళ్ళిన తర్వాత, అక్షయ్ మెల్లగా కారు దగ్గరకు వెళ్ళి పాపను పరిశీలించి చూశాడు. శబ్దం చేశాడు. ఉలుకూపలుకూ లేదు. ఎవరా పాప? అక్షయ్ ఏంచేశాడు?

దొకాయన.

"ఏం కావాలి?" అడిగాడు.

"503 కీస్" రిపీట్ చేసింది కావ్య.

"మాకివ్వడే?" వింతగా చూస్తూ అన్నాడు.

"సరే?"

బ్రహ్మి దగ్గరకు వెళ్ళింది.

ఏంచేయాలో ఆలోచించారు.

హర్ష అపార్ట్‌మెంట్ మాయగట్టినట్లుగా ఉంది. తలుపు తప్ప మరేమీ కారిడార్ వైపుకి లేవు.

"చేసేదేమీ లేదు. ఆలోచించి మళ్ళీ వద్దాము" అన్నాడు బ్రహ్మి.

ఇద్దరూ నడుస్తున్నారు.

"నిన్ను ఆవిడ పనిమనిషి అనుకుం దేమిటి?" సంబరంగా మొదలెట్టాడు బ్రహ్మి.

ఒళ్ళు మండింది కావ్యకు.

రోజూ జుట్టుకి నూనె రాసి, జడ వేసే వాళ్ళమ్మ మీద చచ్చేంత కోపం వచ్చింది.

కార్ ఎక్కుతుండగా పరుగెత్తుకొ చ్చాడు వాచ్‌మన్.

"లోనికి వస్తున్నప్పుడు మీ బాగ్‌లో నుంచి ఫోన్ పడిపోయినట్లుంది" అందిం చాడు. కావ్యను విపరీతంగా బాధించిన విషయం యాభై ఏళ్ళ వాచ్‌మన్ తనని 'ఆంటీ' అని సంబోధిస్తూ కార్ వద్దకు పరుగె త్తుకు రావటం.

బ్రహ్మి గుడ్లలో నీళ్ళు తిరుగుతుండగా నవ్వాపు కోవటానికి నానా అవస్థ పడుతున్నాడు.

మరీ పనిమనిషనుకోవటం, యాభై ఏళ్ళ వాడు తనని ఆంటీ అనటం... ఇక అక్షయ్‌కి ఏం నచ్చుతుంది తను. దిగులుగా అనిపించిందామెకి.

***

కొన్ని సందర్భాల్లో కొన్ని విషయాలను మనం చూసి ఉండకపోవాల్సింది అనిపిస్తుంది. అది ఎంత ముఖ్యమైనదైనా, మన జీవితాన్ని మలుపు తిప్పేదయినా సరే! ప్రస్తుతం అక్షయ్ అటువంటి పరిస్థితిలోనే ఉన్నాడు.

డ్రగ్స్ డీలర్స్‌లో ఒకతను అక్షయ్‌కి ఆ రోజు అనుకోకుండా కనబడ్డాడు. కార్లో అతని పక్కన చిన్నపిల్ల... బహుశా మూడేళ్ళుండవచ్చు. కార్ రోడ్డు పక్కగా ఆపి షాప్‌లోకి వెళ్తున్నాడతను. పిల్లని కార్లోనే ఉంచి లోపలికెళ్ళాడు.

ఇటువంటి దందాలు చేసే వాళ్ళతో పిల్లల్ని ఎవరు పంపిస్తారు?

కార్ దగ్గరగా వెళ్ళి చూశాడు అక్షయ్.

ముందు సీట్‌లో సీట్ బెల్ట్ వేసుకుని కూర్చుందా పాప.

ముందువేపుకే చూస్తోంది.

కొద్దిగా కూడా దృష్టి మరల్చటం లేదు.

కదలిక లేదు మనిషిలో.

నిజంగా మనిషేనా, బొమ్మా? అనుమానం వచ్చిందతనికి.

కార్ విండో మీద వేళ్ళతో తట్టి శబ్దం చేశాడు.

ఏమాత్రం కదలిక లేదు.

ఏదో ఆలోచన తట్టింది అక్షయ్‌కి.

గుండెలు అవిసిపోయినట్లుంది.

తల విదిల్చాడు. లేదు లేదు... అలా అయ్యే అవకాశం లేదు అనుకున్నాడు.

పర్స్‌లో నుంచి చిన్న ఇన్‌స్ట్రుమెంట్ తీశాడు.

ఫ్లీట్ ట్రాకింగ్ జీపీఎస్ స్టిక్కర్ అది.

దానిమీదున్న ఆర్.ఎఫ్. ఐడి కోడ్ ఆధారంగా ఆ వెహికల్ ఎక్కడున్నా ట్రేస్ చేయవచ్చు. వర్షానికీ, వేడికీ పాడవని ఆ స్టిక్కర్‌లో ఉన్న మరొక ఫీచర్ నలభై ఎనిమిది గంటలు దాటగానే దాన్నదే తినేసి నట్టుగా అయిపోతుంది. స్టిక్కర్ కరిగిపోయి నీటి బొట్లుగా మారి ఆవిరవుతుంది.

కార్‌ని ఆనుకున్నట్లుగా నిలబడ్డాడు.

కొద్దిగా కిందకు వాలి మెల్లిగా స్టిక్కర్‌ని కార్ బంపర్‌కి కిందుగా అతికించాడు. తర్వాత గమ్ నోట్లో వేసుకుని అక్కణ్ణుంచీ పక్క వీధి వేపుగా నడవ సాగాడు.

డ్రగ్ డీలర్ వచ్చి కార్ డోర్ ఓపెన్ చేయటం, ఎక్కటం దూరం నుంచి కనబడుతోంది.

ఆ క్షణం నుంచీ తన ఫోన్ ద్వారా ఆ కార్‌ని ట్రాక్ చేయటం మొదలెట్టాడు.

కాకినాడకీ, అక్కడి నుంచీ యానాంకీ చేరు కుందా కార్.

అక్కడొక పూట కదలికలు కనిపించలేదు.

మళ్ళీపొద్దున వెనక్కు రావటం గమనించాడు.

కార్ హైదరాబాద్ పొలిమేరల్లోకి రాగానే బయలుదేరాడు అక్షయ్. కార్‌ని ట్రేస్ చేస్తూనే డ్రయివ్ చేస్తున్నాడతను. ఖైరతాబాద్‌లో ఆగిందా కార్. అప్పటికి అక్షయ్ ఇంకా పంజాగుట్ట దగ్గరు న్నాడు.

సరిగ్గా కార్ ఆపిన వీధి దగ్గర మలుపు తీసు కుంటుండగా మళ్ళీ కదిలిందా కారు.

అప్పుడే ఆర్.ఎఫ్. ఐడీ స్టిక్కర్ కరగటం మొద లెట్టినట్లుంది.

మెలిమెల్లిగా డేటా మాయమవుతోంది స్క్రీన్ మీది నుంచీ.

ఏమి చేయాలో తోచలేదు అక్షయ్‌కి.

తన కార్‌ని వేగంగా పోనిచ్చాడు.

ఇంతలో తను ఫాలో చేస్తున్న కార్ ఆగిపో వటం కనిపించింది.

కార్ స్లో చేసి దాని పక్కగా వెళ్తూ గమనించాడు.

తనకు మొదట కనబడిన డ్రగ్ డీలర్ దిగిపో యినట్లున్నాడు.

అతను బయట నిలబడి, డ్రయివింగ్ సీట్‌లో ఉన్నతనికి కార్ విండోలో నుంచి ఏదో వివరిస్తు న్నాడు.

ఈ ఇల్లు వీళ్ళకి హెడ్‌క్వార్టర్స్ ఏమో!

వీళ్ళు కూడా రోస్టర్ మెయింటెయిన్ చేస్తున్న ట్లున్నారు. ఒకతను డ్యూటీ దిగగానే అక్కణ్ణుంచీ రెండో అతను అందుకుంటాడు ఆ పనిని. నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు అక్షయ్‌కి.

కొంచెం దూరం వెళ్ళి కారు ఆపుకున్నాడు అక్షయ్.

కొద్దిగా చీకటి పడుతుండగా దిగి నడవటం మొదలెట్టాడు.

రాత్రంతా నిద్ర లేదతనికి. కార్‌ని ట్రాక్‌చేసే పని మీదే ఉన్నాడు. నిద్ర లేక ఫోన్, కంప్యూటర్ స్క్రీన్‌లు చూస్తుండటంతో కళ్ళు మండుతున్నాయి.

ఖైరతాబాద్‌లోని చిన్న గల్లీ అది. అక్కడక్కడా వీధి లైట్లు వెలుగుతున్నాయి. రైలు కూత వినపడింది. దగ్గర్లోనే రైలు పట్టాలున్నట్లున్నాయి.

కళ్ళు తిరుగుతున్నట్లుంది అక్షయ్‌కి.

మత్తుగా బలవంతంగా నడుస్తున్నాడు.

డ్రగ్ డీలర్ దిగిన ఇంటికి రెండిళ్ళ అవతల మిర్చి బజ్జీల బండి కనపడుతోంది. బాగా కాగిన నూనెలో బజ్జీలను వేయిస్తున్న శబ్దాలు. పక్కనే టీ మరుగుతోంది.

నైరా తప్పిపోయిన దగ్గర్నుంచీ అక్షయ్‌కి తిండి సహించటం లేదు.

తప్పనిసరైనప్పుడు, తినకపోతే తనామెను వెతక లేనేమో అనిపించినప్పుడు మాత్రమే బలవంతంగా ఏదైనా తింటున్నాడు.

పెద్దగ్లాస్‌లో టీ తీసుకుని బల్లమీద కూర్చు న్నాడు.

అటూఇటూ చూస్తున్నట్లుగా ఉన్నప్పటికీ ఒక కన్ను ఆ ఇంటి మీదే వేసి ఉంచాడు.

చీకటవుతున్నకొద్దీ ఇంట్లో కదలికలు తగ్గి




పోయాయి.

గ్లాస్‌లోని టీనంతా తాగాడు.

ఆఖరి సిప్ చేయబోతూ అందులో చచ్చి పడున్న బొద్దింకను చూశాడు.

అంతే.... భళ్ళున వాంతి అయిపోయింది.

బడ్డీ కొట్టతనికి టీ గురించి గొడవ చేస్తాడని పించి భయం భయంగా చూస్తున్నాడు. ఒక బల్లని బండికి వెనగ్గా జరిపాడు. అక్కడ కాసేపు రెస్ట్ తీసు కోమని బ్రతిమాలాడు.

తలవాల్చి బల్లమీద పడుకున్నాడు అక్షయ్.

కాసేపటికే నిద్ర పట్టేసిందతనికి.

మెలకువొచ్చేసరికి రెండవుతోంది. చిమ్మచీకటి.

కొట్టు కట్టేసి బజ్జీలబండివాడు వెళ్ళిపోయినట్లు న్నాడు.

ఎక్కడినుంచో భరించలేనంత మురుగు వాసన.

దోమలు గుంపులుగా దాడి చేస్తున్నాయి.

లేచి ఆ ఇంటి వేపుగా నడిచాడు.

అదొక పాతకాలపు ఇండిపెండెంట్ హౌస్. పాతకాలంలో మధ్యతరగతి వాళ్ళు కట్టుకున్న ఇల్లులా ఉంది. ఇనపగేట్లు, చుట్టూ నాలుగడుగుల ప్రహరీగోడ, లోపలి వైపు కూరగాయలు, పూల చెట్లు...

శబ్దం కాకుండా గోడ దూకాడు.

లైట్స్ ఆఫ్ అయినట్లున్నా ఏదో వెలుతురు కన బడుతోంది.

బెడ్‌లైట్ ఏమో అనుకున్నాడు.

ఒక్కోరూమ్ కిటికీ సందులో నుంచి చూస్తూ వెళ్తున్నాడు.

రోడ్ వైపుగా ఉన్న గదులన్నీ లైట్లార్పి ఉన్నాయి.

వెనకున్న ఒకే ఒక గదిలో చిన్న లైట్ వెలుగు తోంది.

కిటికీలో నుంచి లోపల జరుగుతున్నది చూసి నిర్ఘాంతపోయాడు అక్షయ్.

కాళ్ళలో శక్తి లేనట్లు కూలబడిపోయాడు.

అతికష్టం మీద కాసేపటికి సర్దుకున్నాడు.

అక్కణ్ణుంచీ కార్ దగ్గరికి ఎలా చేరుకున్నాడో, ఎలా ఇంటివరకూ డ్రయివ్ చేశాడో తెలియనంతటి ఆశ్చర్యం.

ఇంటికి వెళ్ళగానే అతను చేసిన పని శ్రీకాంత్‌కి ఫోన్ చేయటం.

విషయం విని షాక్ తిన్నాడు శ్రీకాంత్.

"ఆర్ యూ ష్యూర్?" అడిగాడు.

"హండ్రెడ్ పర్సెంట్" చెప్పాడు అక్షయ్.

"నువ్వింక కల్పించుకోవద్దు. వాళ్ళెంత కిరాత కులో అర్థం అవుతోంది. నేను చూసుకుంటాను" అన్నాడు శ్రీకాంత్.

మర్నాడు పొద్దున లేచేసరికి అన్ని టీవీ చానల్స్‌లో వస్తున్నదా వార్త.

చిన్నపిల్లల్ని ఎత్తుకొచ్చి చంపి, లోపల అంతా ఖాళీచేసి, డ్రగ్స్‌తో నింపి స్మగ్లింగ్‌కి వాడుతున్నారు. చర్మం పాడవకుండా పైనుంచి సుగంధ లేప నాలను పూస్తున్నారు.

ఒక్కో చిన్న శరీరంలో దాదాపు కోట్ల విలువ చేసే మాదకద్రవ్యాలు నింపవచ్చుట.

చిన్నపిల్లలవి అయితే పోలీసులు సోదా చేయ రనేది డ్రగ్ మాఫియా వాళ్ళ ప్లాన్.

సీపోర్టుల ద్వారా, ఎయిర్‌పోర్టుల నుంచీ ఇలా పిల్లల ద్వారా ఎన్నో కోట్ల మాదకద్రవ్యాలు వేరే దేశాలకు చేరవేశారు అప్పటివరకూ.

సాయంత్రానికి అక్షయ్‌ని కలిశాడు శ్రీకాంత్.

చాలా దిగులుగా ఉన్నాడు అక్షయ్.

తప్పకుండా నైరా చనిపోయి ఉంటుంది ఇలాంటి వాళ్ళెవరి చేతుల్లోనో పడి అనిపిస్తోంది అతనికి.

అప్పుడు చెప్పాడు శ్రీకాంత్.

ఇప్పటివరకూ తొమ్మిది మంది పిల్లలను వాళ్ళు గూడ్స్ స్మగుల్ చేయటానికి వాడారట. అయితే వాళ్ళంతా తమకు ఏదో ఒక రకంగా డబ్బు బాకీ పడ్డ వాళ్ళని తేల్చారట మాఫియా రన్ చేస్తున్న వాళ్ళు.

"డ్రగ్స్ వాడేవాళ్ళు, అమ్మేవాళ్ళని మనం చుల కనగా మాట్లాడుకుంటాము కానీ స్మగ్లింగ్ చేయ టానికి వాళ్ళు కనిపెట్టిన క్రియేటివ్ ఐడియాలు వింటే పిచ్చెక్కి పోతాము" అన్నాడు శ్రీకాంత్.

అక్షయ్ భుజం మీద చేయివేసి ఓదార్పుగా అన్నాడు.

"నువ్వు చాలా డిస్టర్బ్ అయ్యావని అర్థమవు తోంది. మన ఊహకు అందని దారుణాలెన్నో జరుగు తూనే ఉంటాయి. కొన్ని ఇలా అప్పుడప్పుడూ బయట కొస్తాయి. మరికొన్ని ఎప్పటికీ బయటపడవు".

"ఇలాంటి వాటిని చూసి మనం సినికల్‌గా తయారవ్వకూడదు. మన చుట్టూ చెడేకాదు మంచి కూడా ఉంది. దానిని గురించి ఆలోచిస్తూ ముందు కెళ్ళాలి".

"నైరా కూడా ఇటువంటి వాళ్ళ బారిన పడితే అన్న ఆలోచనతో నువ్వు బాధపడుతుండవచ్చు. నా సిక్త్ సెన్స్ ప్రకారం అతి త్వరలో మనకి నైరా ఆచూకీ తెలుస్తుందనిపిస్తోంది".

అక్షయ్ కళ్ళలో ఆశ.

"ట్రస్ట్‌మీ!" అన్నాడు శ్రీకాంత్.

"ఎప్పటికీ నీ పేరు ఈ డ్రగ్ మాఫియా కేస్‌లో బయటికి రానివ్వొద్దు. వాళ్ళు ఎంత క్రూరంగా ప్రవ ర్తించగలరో, పసిపిల్లల మీద వాళ్ళ ప్రతాపం చూసి నప్పుడే అర్థమయ్యిండాలి. నీకూ, నైరాకి కూడా సేఫ్ కాదు."

తలూపాడు అక్షయ్.

****

"చీకటిలో నా వెలుతురు నువ్వు.

వర్షం కురిసి వెలిశాక కనిపించే హరివిల్లువు.

రాత్రి ఆకాశంలో తళుక్కుమనే నక్షత్రానివి.

చందమామలోని ప్రకాశానివి".

"తొలకరి జల్లు పడగానే వచ్చే మట్టివాసన.

సాయంత్రాలు వీచే చల్లటి గాలులు.

అన్నీ నిన్నే గుర్తు చేస్తున్నాయి.

అతనక్కడ, నువ్విక్కడ అంటూ వెక్కిరిస్తున్నాయి".

"ప్రపంచం అంటే బోర్ కొట్టేసినా, నీ ఉనికి ఒక్కటే 'లైఫ్ ఈజ్ బ్యూటీఫుల్' అనిపింపచేస్తుంది".

"ఇంత ప్రేమనీ 'ఐ లవ్ యూ' అని మూడు

ముక్కల్లో ఎలా చెప్పను? నా ప్రేమలోని లోతును, నిజాయితీని, గాఢతను అవి స్పష్టం చేయగలవా?"

"ఇన్నిసార్లు 'ఐ లవ్ యూ' అని చెప్తుంటే నీకు తేలికైపోతానేమో అని భయం వేస్తోంది."

"నా ఆరాధన నీకు అర్థం అవుతోందా?"

"నా ప్రేమను నీకు వ్యక్తపరచటానికి మరేదైనా పదాలు దొరికే వరకూ నువ్వు అడ్జస్ట్ కాక తప్పదు. మళ్ళీ మరొకసారి చెప్తున్నా."

"ఐ లవ్ యూ!"

హర్ష ఫోన్ బీప్ బీప్ అంటూనే ఉంది.

తనకు అత్యంత ప్రియమైన మెసేజ్ టోన్ అది.

నిద్రలో లేచి కూర్చున్నాడు.

ఒక్కో మెసేజ్ వస్తోంది.

ఇంకా ఏదో టైప్ చేస్తోందని ఆకుపచ్చని అక్షరాలు చూపిస్తున్నాయి.

"ఇంత ప్రేమకు తను అర్హుడేనా?" ఒక్క నిమిషం భయం వేసిందతనికి.

"నాలో ఏముందసలు? అందగాడిని కాదు. డబ్బున్నవాడిని కాదు. సమాజంలో పలుకుబడి ఉన్నవాడిని కాదు. చాలా మామూలు మనిషిని" గబగబా మెసేజ్ చేశాడు.

"నా కళ్ళతో చూడు హర్షా! నువ్వెంత అద్భుతమైన వ్యక్తివో నీకే తెలుస్తుంది".

హర్షకి ఏమని సమాధానం ఇవ్వాలో అర్థం కాలేదు. ఏమి మాట్లాడాలో తెలీనప్పుడు, ఇబ్బందిగా ఉన్నప్పుడు అతనికి సాఫ్ట్‌వేర్ ఆర్కిటెక్చర్ డిజైన్ చేయాలని బలంగా అనిపిస్తుంటుంది. అది అతనికి బాగా తెలిసిన సబ్జెక్ట్. అందులో మునిగిపోతే తల్లి ఒడిలో ఉన్నంత ప్రశాంతంగా, అలజడి లేనట్లుగా ఉంటుంది. ల్యాప్‌టాప్ ఓపెన్ చేయబోతుండగా మళ్ళీ మెసేజ్ వచ్చింది.

"నువ్వు పరిచయం కాక ముందు, నువ్వెవరో తెలీనప్పుడు అదోలాంటి అస్థిమితంగా ఉండేది. నువ్వు కనబడిన మరుక్షణం నుంచీ నా ఇల్లు నాకు దొరికినంత ఆనందంగా ఉంది."

"నువ్వు కూడా అందరిలాగే అందం, డబ్బు ఇవే ప్రేమకి కొలమానం అనుకుంటావని అనుకోలేదు" నిష్ఠూరంగా ఉందా మెసేజ్.

"నేనూ యావరేజ్ మనిషినే! ప్రేమించడానికి బాహ్యరూపం, మెటీరియలిస్టిక్ థింగ్స్ అవసరమంటావా?" అంటూ మరో మెసేజ్ పంపిందామె.

"అలా కాదు. ప్రాక్టికల్‌గా ఆలోచిస్తే మెసేజెస్ వరకూ బాగానే ఉంటుంది. కాని నిజ జీవితంలో ఇద్దరమూ ఒకరినొకరు చూసుకున్నాక, మాట్లాడుకున్నాక కూడా ఈ పాషన్ ఇలాగే ఉంటుందంటావా?" అడిగాడు హర్ష.

"నేను అందంగా ఉండననేసరికి బాకవుట్ అవుతున్నావా?" వచ్చింది మెసేజ్.

"లేదు. నువ్వెలా ఉన్నా నాకిష్టమే. ఇప్పుడు నువ్వు చూపించే ప్రేమలో తర్వాత మార్పు వస్తుందేమోనని, వస్తే నేను తట్టుకోలేక పోవచ్చనీ నా భయం" అన్నాడు హర్ష.

అటునుంచీ సమాధానం లేదు.

నిశ్శబ్దాన్ని భరించలేక పోతున్నాడు హర్ష.

"మనిద్దరం యావరేజ్ అయితే మన పిల్లలు మరింత యావరేజ్‌గా ఉంటారేమో?" పంపేశాక నాలుక కరుచుకున్నాడు.

తను అతిచనువు తీసుకున్నాడా?

ఆమెను నవ్వించడానికి, ఆమె పట్ల తన సిన్సియారిటీ తెలియజెప్పటానికి రాశాడు. ఆమె అపార్థం చేసుకోదు కదా!

టెన్షన్‌గా ఉందతనికి.

టైమ్ గడుస్తోంది.

భరించలేని నిశ్శబ్దం.

***

రాత్రి యథాలాపంగా మెయిల్ ఓపెన్‌చేసిన కావ్యకి ఆన్‌లైన్ గూఢచారి నుంచి మెయిల్ కనపడింది.

అందులో వివరాలు చూసి విపరీతమైన షాక్‌కి లోనయిందామె.

**(ఇంకా వుంది)**

## మనమీదేనర్రోయ్!

సరసి








ఏప్రిల్ 19 నుంచి
ఏప్రిల్ 25 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ఆర్థికపరమైన నిర్ణయాలు, చర్చలు, బిల్లుల చెల్లింపులకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో తొందరపాటు తగదు. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 20, 21 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. ఆర్థికంగా ప్రోత్సాహకరం. 22, 23 తేదీల్లో దీర్ఘకాలిక పెట్టుబడులు, ఆర్థికపరమైన చర్చలకు అనుకూలం. ఒక సమాచారం కలవరపెడుతుంది. 24, 25 తేదీల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో తొందరపాటు నిర్ణయాల వల్ల నష్టపోయే అవకాశం ఉంది.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, పెట్టుబడులపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధవారం ఉన్నత విద్యా విషయాల్లో ఆటంకాలు ఎదురవుతాయి. రాజకీయ సినీ రంగాల వారు ఆచితూచి ముందడుగు వేయాలి. 20, 21 తేదీల్లో వృత్తి వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ప్రముఖుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 22, 23 తేదీల్లో యూనియన్ కార్యకలాపాలు, ఆర్థిక సంస్థలతో పనులకు అనుకూలం. సమావేశాల్లో సత్ఫలితాలు సాధిస్తారు. పెట్టుబడుల్లో తొందరపాటు తగదు. 24. 25 తేదీల్లో సినీ, రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహకరం. మనసు ఆశాంతిగా ఉంటుంది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు సంబంధించిన అంశాలు కలవరపెడతాయి.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం పెట్టుబడుల్లో నిదానం అవసరం. అనవసర ఖర్చులు అధికం. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. 20, 21 తేదీల్లో సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. విద్యార్థులు సత్ఫలితాలు సాధిస్తారు. 22, 23 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. ఉన్నతపదవులు, గౌరవ మన్ననలు అందుకుంటారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. 24, 25 తేదీల్లో బృంద కార్యక్రమాలు ఉల్లాసం కలిగిస్తాయి. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులకు ఆటంకాలు ఎదురవుతాయి. పెట్టుబడుల్లో నిదానం అవసరం.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

ప్రముఖులతో సమావేశాలు, పెట్టుబడులు, ఆర్థిక సంస్థలతో లావాదేవీలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం శ్రీవారు, శ్రీమతి విషయాల్లో పెద్దల నుంచి మాటపడాల్సి రావచ్చు. గౌరవ మర్యాదలకు భంగం కలిగే ప్రమాదం ఉంది. 20, 21 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థికంగా ప్రోత్సాహకరం. 22, 23 తేదీల్లో బంధుమిత్రుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆర్థికపరమైన సమావేశాలు, చర్చలకు అనుకూలం. ఖర్చులు అంచనాలు మించుతాయి. 24, 25 తేదీల్లో ఆర్థిక విషయాల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తిపరమైన సమావేశాల్లో జాగ్రత్త అవసరం.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, సమావేశాలు, బృందకార్యక్రమాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. వృత్తి, వ్యాపారాల్లో అంచనాలు ఫలించకపోవచ్చు. 20, 21 తేదీల్లో జనసంబంధాలు విస్తరిస్తాయి. సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. గౌరవ, మన్ననలు అందుకుంటారు. 22, 23 తేదీల్లో ఆర్థిక విషయాల్లో పైఅధికారుల సహకారం లభిస్తుంది. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఆర్థిక విషయాల్లో ఆశించిన సహకారం లభించక నిరుత్సాహపడతారు. 24, 25 తేదీల్లో వృత్తిపరమైన అంచనాలు ఫలించకపోవచ్చు. పెద్దలతో చర్చల్లో నిదానం అవసరం. రాజకీయ, సినీ రంగాల వారు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, వృత్తిపరమైన సమావేశాలు, ప్రయాణాలకు ఈ వారం అనుకూలం. బుధవారం పెట్టుబడుల్లో నిదానం అవసరం. చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. 20, 21 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తిపరమైన సమావేశాలకు అనుకూలం. 22, 23 తేదీల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. సమావేశాల్లో మాటపడాల్సి రావచ్చు. 24, 25 తేదీల్లో గత అనుభవం ఆధారంగా నిర్ణయాలు తీసుకుంటారు. రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో అంచనాలుతప్పే అవకాశం ఉంది. ఖర్చులు అధికం.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

భాగస్వామ్యాలు, స్పెక్యులేషన్లు, క్రయవిక్రయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం కుటుంబసభ్యుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు నిదానం పాటించాలి. 20, 21 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. చిన్నారుల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 22, 23, 25 తేదీల్లో హోటల్, వైద్య రంగాల వారికి అనుకూలం. ఆరోగ్యం మెరుగు పడుతుంది. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా నిరుత్సాహకరం. 24, 25 తేదీల్లో ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

వేడుకలు, భాగస్వామ్యాలు, పెట్టుబడులు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం ఇంటర్వ్యూలలో నిరాశ ఎదురవుతుంది. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 20, 21 తేదీల్లో కుటుంబ సభ్యుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. శుభకార్యాలకు ఏర్పాట్లు చేస్తారు. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం. 22, 23 తేదీల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. ఖర్చులు అధికం. 24, 25 తేదీల్లో విందు వినోదాల్లో పాల్గొంటారు. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. కృషి రంగంలో శ్రమాధిక్యం తప్పకపోవచ్చు.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, వేడుకలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. చిన్నారులు, ప్రియతముల కోసం ఖర్చులు అంచనాలు మించిపోతాయి. 20, 21 తేదీల్లో ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. విందు వినోదాల్లో పాల్గొంటారు. రవాణా రంగంలోని వారికి శుభప్రదం. 22, 23 తేదీల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. కుటుంబ సభ్యుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 24, 25 తేదీల్లో సృజనాత్మకంగా వ్యవహరించి కృషి రంగంలో లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరం కలిగిస్తుంది. విందుల్లో పాల్గొంటారు.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, వివాహాది శుభకార్యాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి తొందరపాటు తగదు. 20, 21 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ఇంటి కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 22, 23 తేదీల్లో ఏజెన్సీ, రవాణా రంగాల వారికి, విద్యార్థులకు శుభప్రదం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. ఒక సమాచారం కలవరపెడుతుంది. 24, 25 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం. కుటుంబ సభ్యుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

స్థలమార్పులు, కుటుంబ వ్యవహారాలు, వృత్తి వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం విద్య, రవాణా రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 20, 21 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభపదం. మార్పుచేర్పుల గురించి ఆలోచిస్తారు. 22, 23 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఖర్చులు అధికం. 24, 25 తేదీల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు అనుకూలం. స్టేషనరీ, ఏజెన్సీ, విద్యారంగాల వారు జాగ్రత్తగా వ్యవహరించాలి.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, విద్య, కుటుంబ వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఖర్చులు అంచనాలు మించిపోతాయి. 20, 21 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు, చర్చలు ఫలిస్తాయి. కీలక సమాచారం అందుకుంటారు. 22, 23 తేదీల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. సోదరీసోదరుల విషయాలు, రాతకోతలు, చర్చలపై దృష్టి పెడతారు. ప్రయాణాల్లో నిదానం అవసరం. 24, 25 తేదీల్లో డిపాజిట్లపై మంచి ప్రతిఫలం అందుకుంటారు. ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. కీలక పత్రాలు సకాలంలో కనిపించక ఇబ్బంది పడతారు.

నవ్య






## బొద్దుగుమ్మకు అచ్చిరాని రాజకీయం!

తమిళతంబీల కోరిక మేరకు భారీగా శరీరాన్ని పెంచి కొన్ని సంవత్సరాల పాటు వారి ఆరాధ్య దేవత అయింది నమిత. ఆ క్రమంలోనే బొద్దుగుమ్మ అనే బిరుదు కూడా సంపాదించుకుంది. కాలం మారింది. మారిన కాలంతో పాటు తంబీల టేస్ట్ మారింది. కొత్త నీరొచ్చి పాతనీటిని కొట్టేసినట్టు కొత్త హీరోయిన్ల రాకతో నమితకు కష్టకాలం వచ్చింది. సినిమాలు తగ్గాయి. దాంతో నమిత కన్ను రాజకీయాల మీదకు మళ్ళింది. జయలలిత బతికున్న సమయంలో అన్నాడిఎంకె తీర్థం పుచ్చుకుంది. ఎన్నికల్లో పోటీ చేయాలని కలలు కూడా కంది. జయలలిత మరణం మిగతా వారి మీద ఎలాంటి ప్రభావం చూపిందో తెలియదు కానీ, నమిత మీద మాత్రం తీవ్ర ప్రభావమే చూపింది. జయ మరణం తరువాత ఆ పార్టీలో నమితను పట్టించుకునేవారే లేకుండాపోయారు. ఆ పార్టీ కాదని వేరే పార్టీలో చేరే అవకాశం కూడా నమితకు లేకుండా పోయిందట! దాంతో సినిమాలు లేక, రాజకీయాలు అచ్చిరాక ఏం చేయాలో తోచని స్థితిలో నమిత ఉందని అంటున్నారు.

## భర్త గురించి సుహాసిని చెప్పింది కరెక్ట్!

'చెలియా' ఆడియో రిలీజ్ ఫంక్షన్లో సుహాసిని తన భర్త మణిరత్నం గురించి ఓ మాట చెప్పింది. అప్పుడు ఆమె మాటలను అందరూ జోక్ తీసుకున్నారు కానీ, చివరకు అదే నిజమైంది అంటున్నారు సినీ విశ్లేషకులు. మణిరత్నంకు దర్శకుడుగా ఎంతో మంచి పేరుంది. ప్రేమకథలు ఆయన తీసినట్టు ఎవరూ తీయలేరన్న పేరూ ఉంది. కానీ ఎప్పుడూ ఒకే పద్ధతిలో తీస్తే బోర్ కొడుతుంది అన్న వాస్తవం మణిరత్నం గుర్తించకపోయినా ఆయన భార్య సుహాసిని త్వరగానే గుర్తించగలిగింది. అందుకే తన భర్త సినిమాలు ఈ మధ్య కాలంలో బోర్ కొడుతున్నాయనీ, మణి తన పద్ధతిని మార్చుకోవాలనీ పబ్లిక్‌గానే సూచించింది. అప్పుడా సూచన ఎవరూ పట్టించుకోలేదు కానీ, 'చెలియా' చూసిన వారికి మాత్రం సుహాసిని మాటలు అక్షర సత్యాలని అనిపిస్తున్నాయట!





## మంచి నటుడే కాదు వక్త కూడా!

నటుడు బెనర్జీ గురించి తలుచుకోగానే ఆయన ఓ మంచి నటుడు అన్న మాట అందరూ అంగీకరిస్తారు. ఎంత మంచి నటుడు అయినా ఆయన చిన్న చిన్న పాత్రలకే పరిమితం కావడంతో సినీ ఫంక్షన్లలో స్టేజి మీద మాట్లాడే అవకాశాలు ఆయనకు గత మూడు దశాబ్దాలుగా పెద్దగా రాలేదు. ఇటీవలే ఓ ఆడియో ఫంక్షన్లో బెనర్జీ స్పీచ్ అందరినీ ఆలోచింపచేసేదిగా సాగింది. అప్పుడే ఆయన ఎంత మంచి వక్తో అందరికీ తెలిసి వచ్చింది. 'మిస్టర్ ప్రీ రిలీజ్ వేడుకల్లో బెనర్జీ మాట్లాడినంత సేపూ అందరూ చెవులప్పగించి చూస్తూ ఉండిపోయారట! ఇంత మంచి వక్తను ఇంత కాలం మిస్ అయ్యామే అని కొందరు బహిరంగంగానే అనుకున్నారట కూడా!



## నిర్మాత అవుతాడట!

ఎన్ని ఫ్లాపులు చవిచూసినా శీను వైట్లకు మంచి దర్శకుడనే ఇమేజ్ ఉంది. ఫ్లాపులు తనలో ఎంతో మార్పును తెచ్చాయి అని చెబుతున్న శీను వైట్ల త్వరలోనే నిర్మాతగా మారబోతున్నట్లు చెబుతున్నాడు. స్వంతంగానా? లేక వేరొకరితో కలిసి సినిమాలు నిర్మించాలా? అన్న విషయంలో ఇంకా కొద్దిగా క్లారిటీ రావలసి ఉందట! ఎలా చేసినా సినిమాలు నిర్మించడం మాత్రం ఖాయం అంటున్నాడు. ఈ నిర్ణయం ఎప్పుడో తీసుకోవలసి ఉందనీ, కాస్త ఆలస్యం అయిందనీ చెప్పుకొచ్చాడు. స్వీయ దర్శకత్వం కన్నా, బయట వారికే ఎక్కువ అవకాశాలు ఇస్తాడట!

## బంగారం పంచబోతున్న హీరో!

ఈ హీరోగారు టాలీవుడ్‌కి చెందిన వాడు కాదు. కోలీవుడ్ హీరో విజయ్‌సేతుపతి. వరుస హిట్లతో మంచి జోష్ మీదున్న ఈ హీరోగారు కోలీవుడ్‌లో త్వరలో జరగబోతున్న ఓ ఫంక్షన్లో సీనియర్ నటీనటులకు వంద కాసుల బంగారు నాణేలు పంచబోతున్నాడట! కళామతల్లి తనకు చాలా ఇచ్చిందనీ, అలా ఇచ్చిన దానిలో కొంత మొత్తాన్ని తోటి వారికి ఇవ్వాలనే ఉద్దేశంతోనే బంగారు నాణేలు ఇవ్వబోతున్నట్లు విజయ్‌సేతుపతి చెబుతున్నాడు. కోలీవుడ్‌లో ఎంతో మంది సీనియర్ హీరోలకు రాని ఐడియా విజయ్‌సేతుపతికి వచ్చినందుకు తమిళ తంబీలు ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నారు.



'మజ్ను' సినిమాతో టాలీవుడ్ ప్రేక్షకులకు దగ్గరయింది సోగకనుల అను ఇమ్మాన్యుయెల్. ఆ సినిమా తరువాత ఇతర భాషలలో బిజీ అయిన అనూ తెలుగులో మలి సినిమా చేయడానికి చాలా కాలమే తీసుకుంది. రెండో సినిమా 'ఆక్సిజన్'లో గోపీచంద్‌తోనూ, మూడో సినిమాలో రాజ్‌తరుణ్ తోనూ జత కట్టింది. ఇప్పటి దాకా చిన్న చిన్న సినిమాలే చేసిన అనూకు ఒక్కసారిగా పవన్ కల్యాణ్, త్రివిక్రమ్ రూపంలో బంపర్ ఆఫర్ తగిలింది. వీరిద్దరి కాంబి నేషన్‌లో వస్తున్న సినిమాలో హీరోయిన్‌గా చేస్తున్న అనూ చెబుతున్న ముచ్చట్లు...



# కచ్చితంగా ప్రేమ పెళ్ళే

## -అను ఇమ్మాన్యుయెల్

**తెలుగులో సినిమాకీ సినిమాకీ చాలా గ్యాప్ తీసుకుంటున్నట్టున్నారు?**

గ్యాప్ అని కాదు కానీ, సినిమాలు ఒప్పుకున్నాక, అవి పూర్తి కావడానికి టైం పడుతోంది. అందుకే చాలా గ్యాప్ వచ్చినట్టు అనిపిస్తోంది.

**మొదటి సారి పెద్ద సినిమాలో చేస్తున్నట్టున్నారు?**

అవును. చాలా యాంగ్జయిటీగా ఉంది.

**అసలు ఈ సినిమాలో అవకాశం ఎలా వచ్చింది?**

'మజ్ను'లో నా నటన త్రివిక్రమ్‌గారికి నచ్చి నన్ను అప్రోచ్ అయ్యారు. పెద్ద బ్యానర్, పెద్ద డైరెక్టర్, పెద్ద హీరో కావడంతో కథ గురించి పట్టించుకోలేదు. అయినా త్రివిక్రమ్‌గారి సినిమాలో కథకి ఎంత ప్రాధాన్యం ఉంటుందో తెలిసిందే కదా! ఆ నమ్మకంతోనే సినిమా చేస్తున్నాను.

**కీర్తి సురేష్‌తో చేయడం ఎలా ఉంది?**

ఇద్దరం మాలీవుడ్ నుంచి ఇక్కడికి వచ్చిన వాళ్ళమే! తనతో నాకు పరిచయముంది. కలిసినప్పుడు బాగా మాట్లాడుకుంటాం. ఈ సినిమాలో ఇంతవరకూ తనతో చేసే కాంబినేషన్ సీన్లు రాలేదు.

**మాలీవుడ్ నుంచి వచ్చిన హీరోయిన్లు తెలుగు బాగా మాట్లాడుతున్నారు కదా? మీకు కూడా బాగా వచ్చేసిందా?**

తెలుగులో నేను చేసిన సినిమాలు తక్కువ కదా! అందుకే అంత బాగా రాలేదు. భాష అర్థమవుతోంది. తిరిగి చెప్పడానికే ఇబ్బంది.

**తెలుగులో మీతో చేసిన హీరోల గురించి...**

'మజ్ను'లో నానిగారితో చేశాను. తను తెర మీద ఎలా కనిపిస్తారో బయట కూడా అలాగే ఉంటారు. బాగా ఎనర్జిటిక్ పర్సన్. ఎప్పుడూ జోక్‌లు వేస్తూ ఉంటారు. ఇక 'ఆక్సిజన్'లో గోపీచంద్‌గారితో చేశాను. కమిట్‌మెంట్ ఉన్న నటుడాయన. సినిమాలో ప్రతి సన్నివేశం బాగా రావాలని కోరుకుంటారు. తన దగ్గర్నుంచి చాలా నేర్చుకున్నాను. 'కిట్టుగాడున్నాడు జాగ్రత్త'లో రాజ్‌తరుణ్‌తో జతకట్టాను. ఈ సినిమా షూటింగ్ ఎప్పటికీ మరిచిపోలేను. ఎందుకంటే ఈ సినిమాలో కనిపించే కుక్కల్లో చాలామటుకు రాజ్‌తరుణ్ పెంపుడుకుక్కలే! వాటితో భలే కాలక్షేపం అయ్యేది. మూగజీవాలంటే రాజ్‌తరుణ్‌కి చాలా ప్రేమ. దాన్ని ప్రత్యక్షంగా చూసే అవకాశం కలిగింది. ఇక పవన్‌కల్యాణ్‌గారితో షూటింగ్ ఇప్పుడే మొదలయింది. ఈ సినిమా ధైర్యంగా ఒప్పుకున్నా గానీ ఎలా చేస్తానో అనే టెన్షన్ ఉండేది. షూటింగ్ ప్రారంభం అయ్యాక ఆ టెన్షన్ తగ్గింది.

**సినిమాల్లోకి రావాలని ముందే అనుకున్నారా?**

ఎప్పుడూ అనుకోలేదు. మా ఫాదర్ మాలీవుడ్‌లో సినీ నిర్మాత అయినా ఎప్పుడూ నటన వైపు దృష్టి సారించలేదు. అనుకోకుండా వచ్చినా, ఇప్పుడు నటనే ప్రాణం అయిపోయింది. కాకపోతే ఇంట్లో ఎప్పుడూ సినిమాల గురించి చర్చలు ఎక్కువగా సాగుతుండేవి. తెర మీద కన్నా వెనుక ఉండాలని అనుకునేదాన్ని. సరదాగా ఓ సారి నా ఫొటోలతో కలిపి ఓ ప్రొఫైల్ వీడియో తయారు చేసుకున్నాను. ఆ వీడియో చూసిన మాలీవుడ్ దర్శకుడు నన్ను 'బిజు'లో ఎంపిక చేశారు. ఆ సినిమా నా జీవితాన్ని మలుపు తిప్పింది. ఆ సినిమాలో నా నటన చూసి 'మజ్ను'లో అవకాశం వచ్చింది.

**నటనలో శిక్షణ తీసుకున్నారా?**

ఎలాంటి శిక్షణా తీసుకోలేదు. సెట్‌లో దర్శకుడు

చెప్పింది చేయడమే తప్ప నటన గురించి పెద్దగా తెలియదు కూడా! ఇక్కడికి వచ్చాక చాలా విషయాలు నేర్చుకున్నాను.

**మాలీవుడ్, కోలీవుడ్, టాలీవుడ్‌లలో చేస్తున్నారు కదా? ఏ భాష సౌకర్యంగా ఉంది?**

మొదటిది తప్ప మిగతా రెండూ నాకు కొత్త భాషలే! టాలీవుడ్‌లో అవకాశం వచ్చినప్పుడు మాలీవుడ్‌లో ఓ సీనియర్ నటి నన్ను తెగ భయపెట్టేశారు. అక్కడ నిలదొక్కుకోలేవు. అనవసరంగా అక్కడ సినిమాలు చేసి టైం వేస్ట్ చేసుకోకు అంటూ చెప్పారు. ఇక్కడి పరిస్థితుల గురించి తెలియకపోయినా, ఒప్పుకున్నాను కనుక ఆ సినిమా మాత్రమే చేద్దామని ఇక్కడకు వచ్చాను. కానీ ఇక్కడకు వచ్చిన తరువాత తెలిసింది ఇక్కడి వాళ్ళు ఎంత మంచి వాళ్ళో అన్న సంగతి! ఆ నటి ఎందుకు అలా చెప్పారో నాకు తెలియదు. కానీ ఇక్కడ నాకు మంచి స్థానమే లభించింది. టాలీవుడ్‌లో సినిమాలు చేస్తుంటే నా మాతృ భాషలో చేస్తున్నట్టే అనిపిస్తోంది.

**సినిమాలు మీలో మార్పు తెచ్చాయి అని గతంలో చెప్పారు కదా? ఎలాంటి మార్పు తెచ్చాయంటారు?**

స్వతహాగా నాకు కొద్దిగా కోపం ఎక్కువ. ఎవరైనా నన్ను విమర్శిస్తూ మాట్లాడితే తట్టుకోలేకపోయేదాన్ని. సినిమాల్లోకి వచ్చిన తరువాత నా కోపం చాలా వరకూ తగ్గింది. ఇప్పుడు ఎవరైనా అలా మాట్లాడితే నాలో తప్పొప్పుల గురించి ఆలోచిస్తూంటాను. వాళ్ళు ఎందుకు అలా మాట్లాడారా? అని నన్ను నేను ఆత్మ పరిశీలన చేసుకుంటూ ఉంటాను. నాకు కోపం ఎక్కువగా ఉన్న సమయంలో తక్కువ మంది స్నేహితులు ఉండేవారు. ఇప్పుడు వారి సంఖ్య రోజురోజుకూ పెరుగుతూ పోతోంది.

**చదువు మధ్యలో ఆపేసినట్టున్నారు?**

నేను సైకాలజీ స్టూడెంట్‌ని. రెండో సంవత్సరం కష్టంగా ఉంటుంది. సినిమాలు చేస్తూ చదవడం కుదరదు. అందుకే తాత్కాలికంగా చదువును పక్కన పెట్టేశాను. తప్పకుండా డిగ్రీ పూర్తి చేస్తాను. నా చదువు ఇక్కడ బాగా ఉపయోగపడింది. వ్యక్తులను అర్థం చేసుకోవడానికి సహాయపడింది.

**మీ బలం, బలహీనత?**

నా కళ్ళే! నావి పెద్ద కళ్ళని అంటూంటారు. మా మదర్ కూడా అదే అంటూంటుంది. నేను ఏదైనా తప్పు చేస్తే వెంటనే నా కనుగుడ్లు ఓ పక్కకి వెళ్ళిపోతాయి. మా మదర్ వెంటనే కనిపెట్టేస్తుంది ఏం తప్పు చేశావంటూ! మా మదర్ మాత్రమే కాదు ఇతరులు కూడా వెంటనే గుర్తు పట్టేస్తారు. అలా నా కళ్ళు నా అందాన్ని పెంచడమే కాదు, నా తప్పుల్ని కూడా పట్టిస్తాయి.

**మీ ఫాదర్ నిర్మాత అన్నారు కదా? సినిమాల ఎంపికలో ఆయన జోక్యం ఉంటుందా?**

జోక్యం అంటే ఉంటుంది కానీ, నిర్ణయం మాత్రం నాకే వదిలేస్తారు. ఇద్దరం కూర్చునే కథ వింటూంటాం. ఒక్కోసారి మా మదర్ కూడా మాతో జాయిన్ అవుతారు. కథ విన్న తరువాత చేయాలా? వద్దా? అన్నది పూర్తిగా నా నిర్ణయమే! తన అభిప్రాయం కూడా చెప్పరు. నేను ఏ డెసిషన్ తీసుకున్నా వాళ్ళు ఓకే అంటారు.

**ప్రేమ, పెళ్ళి గురించి....**

కచ్చితంగా ప్రేమించే పెళ్ళి చేసుకుంటాను. ప్రేమించిన వ్యక్తి గురించి పూర్తి అవగాహనకు వచ్చిన తరువాతే పెళ్ళి చేసుకుంటాను. అలా తెలుసుకోవాలంటే ఎంతో కొంత సమయం కేటాయించాలి. ప్రస్తుతానికి నాకు అంత సమయం లేదు. కనుక ఇప్పుడప్పుడే ప్రేమలో పడే ఛాన్స్ లేదు.

**భవిష్యత్తు ప్లాను గురించి...**

పెద్ద పెద్ద ప్లాన్లు వేసుకుని ఇక్కడికి రాలేదు. కనుక ఆశయాలు, డ్రీమ్ ప్రాజెక్టు లాంటి ఆలోచనలు లేవు. నటిగా నాకు నయనతార అంటే ఇష్టం. ఆమె ఎప్పటికప్పుడు కొత్త కొత్త కథలు ఎంచుకుంటూ సినిమాలు చేస్తున్నారు. కథల ఎంపికలో ఆమె ప్రభావం ఎంతో కొంత నా మీద తప్పక ఉంటుంది. కాకపోతే హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమాలకి ఇంకా చాలా సమయం ఉంది. వాటి జోలికి ఇప్పుడప్పుడే పోను. అలాంటి సినిమాలు చేస్తానో లేదో కూడా చెప్పలేను.

– చిన్ని



# ఇంటర్వ్యూ



# ప్రేక్షకుణ్ణి మాయ చెయ్యాలి మోసం చెయ్యకూడదు

## -వక్కంతం వంశీ

**కథను 'రేసుగుర్రం'లా పరుగెత్తిస్తూ ప్రేక్షకులతో ఔరా అనిపించుకునే సినీ రచయిత వక్కంతం వంశీ. 'కిక్' ఇచ్చే సినిమాలతో టాలీవుడ్ కథా రచనను సరికొత్త పుంతలు తొక్కిస్తున్నారాయన.**

**టీవీ న్యూస్‌రీడర్‌గా కెరీర్ ప్రారంభించి నటుడుగా, బ్లాక్‌బస్టర్ చిత్రాల రచయితగా ఎదిగారు. తాజాగా దర్శకత్వ శాఖలో ప్రవేశించారు.**

**ఆయన 'టెంపర్' చిత్ర కథ హాలీవుడ్ స్థాయి నవలగా అంతర్జాతీయ మార్కెట్‌లోకి ప్రవేశించడానికి రంగం సిద్ధం చేసుకుని, చిత్రపరిశ్రమను సంభ్రమాశ్చర్యాలకు గురిచేస్తోంది. 'ప్రేక్షకుణ్ణి మాయ చేయాలిగానీ, మోసం చెయ్యకూడదు' అంటున్న వక్కంతం వంశీ ఇంటర్వ్యూ మీ కోసం.....**

చిత్తూరు జిల్లా పుంగనూరు సమీపంలోని అరికెల మా సొంత ఊరు. 1975లో నేను అక్కడే జన్మించాను. మా నాన్నగారు వక్కంతం సూర్యనారాయణ రావ్. అమ్మ స్వర్ణకుమారి. మేం ముగ్గురు సంతానం. ఇంట్లో నేను పెద్ద కొడుకుని. పెద్ద తమ్ముడు ప్రభంజన్‌కుమార్ అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీరు. రెండో తమ్ముడు చైతన్య ప్రసాద్ నా దగ్గరే స్క్రిప్ట్ రచయితగా సహాయం అందిస్తున్నాడు. నాన్నగారు ప్రముఖ రచయిత. ఆయన టి.టి.డి.లో అనువాదకుడు కావడంతో నా బాల్యం, చదువు అంతా తిరుపతిలోనే గడిచింది.

### నేనో స్పాయిల్ కిడ్‌ని

బాల్యం నుండీ సినిమాలంటే నాకెంతో మక్కువ. చివరకు అదే నా జీవిత సర్వస్వమైపోయింది. సినిమాపట్ల నాకున్న ప్రేమ నన్నొక స్పాయిల్ కిడ్‌గా మార్చేసింది. వచ్చిన ప్రతీ సినిమా చూసేవాణ్ణి. ఆ ధ్యాసతో స్కూలు ఎగ్గొట్టేవాణ్ణి. అమ్మా నాన్న భయపడి ఎనిమిదో తరగతిలో పాకాల సమీపంలోని రామతీర్థ సేవాశ్రమం స్కూల్లో చేర్పించారు. కానీ ఆశ్రమానికి వెళ్ళకుండా రోజుల తరబడి ఆ డబ్బులతో చూసిన సినిమా మళ్ళీ మళ్ళీ చూస్తూ బంధువుల ఇళ్ళకు తిరుగుతూ ఎప్పటికో స్కూలుకు చేరుకునేవాణ్ణి. దాంతో నాన్న నా తీరు అర్థం చేసుకుని బాగా చదివి, పరీక్షలు బాగా రాస్తే సినిమాలకు పంపిస్తాననేవారు. అలాగే శ్రద్ధగా చదివి నాన్ననడిగి సినిమాలకు వెళ్ళేవాణ్ణి. మా కజిన్స్ అందర్నీ కూర్చోబెట్టి సినిమా కథను ఎంతో అందంగా వర్ణించి చెప్పేవాణ్ణి. కథలు బాగా చెబుతాడని అందరూ మెచ్చుకునేవారు.

చదివి ఏదో సాధించాలనే కోరిక ఉండేదికాదు నాకు. పైగా నాన్న ఎలాంటి ఆంక్షలు విధించేవారు కాదు. 'నీలో ఉండే మెరిట్, టాలెంట్ పెంపొందించుకో' అనేవారు. సినిమా ఇచ్చే హ్యాపీనెస్ మరేదీ ఇచ్చేదికాదు నాకు. ఎలాగో బి.ఏ డిగ్రీ పూర్తిచేశాను. నాటకాల్లో నటించేవాణ్ణి. సినిమాల్లో చేరి నటుడుగా ఎదగాలనే కోరిక నాలో బలపడిపోయింది. అలా ఇంటర్మీడియట్ ఫస్టియర్లో ఉండగానే నాన్న నా అభిరుచిని అర్థం చేసుకున్నారు.

చిన్నప్పటినుంచీ పుస్తకాలు చదివేవాణ్ణి. టెంపో రావు నవలలంటే ఎంతో ఇష్టం. డిటెక్టివ్‌లు, క్రైమ్ స్టోరీలు, వారపత్రికలు, సినిమా పత్రికలు విపరీతంగా చదివేవాణ్ణి. దాంతో నాన్నగారే మంచి పుస్తకాలు సెలెక్ట్‌చేసి చదవమని ఇచ్చేవారు. అలా జేమ్స్‌హేడ్లీ ఛేజ్, షిడ్నీ షెల్డన్ బుక్స్ చదివేవాణ్ణి. కొంచెం పెద్దయ్యాక నాన్నగారి రచనలు చదవడం ప్రారంభించాను. ఆయన డిక్టేట్ చేస్తుంటే రాసేవాణ్ణి. అలా నాకు తెలియకుండానే కథా రచనపై నాలో ఆసక్తి జీర్ణించుకుపోయింది.

### సక్సెస్‌ఫుల్ న్యూస్ రీడర్

నాన్న నా ఆసక్తి గమనించి ప్రముఖ ఛానెల్‌లో ప్రకటన చూసి నాతో దరఖాస్తు చేయించారు. అలా 1995లో మీడియాలో ప్రవేశించాను. పరిచయాలు పెరుగుతాయనీ, సినిమాల్లోకి వెళ్ళిపోవచ్చుననీ గట్టిగా విశ్వసించాను. కానీ నన్ను న్యూస్ రీడర్‌గా అపాయింట్ చేయడంతో డిజప్పాయింటయ్యానుగానీ, నా వాయిస్ బాగుంది, డిక్షన్ బాగుందనేవారు. అలా ఆరునెలల్లోనే తొలితరం

సక్సెస్‌ఫుల్ న్యూస్ రీడర్‌గా ఎదిగి ఎంతో పాపులర్ అయ్యాను.

## దాసరిగారి చిత్రంలో హీరోగా

దాసరి నారాయణరావుగారి 'కల్యాణ ప్రాప్తిరస్తు' చిత్రానికి కొత్త నటులు కావాలనే ప్రకటన నాన్న గారు చూసి నాతో అప్లయ్ చేయించారు. మద్రాసు ఆడిషన్‌లో వందలాదిమందిలోంచి నన్ను హీరోగా, నాతోపాటు యాంకర్ సుమ, కావ్యలను కూడా ఎంపిక చేశారు. ఒకవైపు ఆ షూటింగ్, మరోవైపు న్యూస్ రీడర్‌గా పార్ట్‌టైమ్ చేసేవాణ్ణి. 1996 డిసెంబర్‌లో విడుదలైన 'కల్యాణ ప్రాప్తిరస్తు' ఫ్లాప్ కావడంతో డిజప్పాయింటయ్యాను. సినిమా అవకాశాలకోసం ట్రై చేస్తుంటే, టీవీ సీరియల్స్ అవకాశాలు వచ్చాయి. బాపుగారి 'భాగవతం'లో ఆరేడు సంవత్సరాలు నటించాను. 'వసంతకోకిల', 'కలలతీరం' సీరియల్స్‌లో నటించాను. ఇవన్నీ ఈటీవీ, దూరదర్శన్, జెమినీ టీవీల్లో ప్రసారమయ్యేవి. కానీ సినిమాల్లో చేయలేకపోతున్నాననే అసంతృప్తి వెంటాడేది. ఏం చెయ్యాలో అర్థం కాలేదు. 'నీలో మంచి రచయిత ఉన్నాడు, రచయిత అవుతావు ప్రయత్నించు' అంటూ అప్పటికే నా స్నేహితులు నన్ను ప్రోత్సహించేవారు. నాలో సంఘర్షణ చెలరేగడంతో నటన మానేయాలనే గట్టి నిర్ణయం తీసుకుని మంజులానాయుడు గారి సీరియల్ మధ్యలోనే వదిలేశాను.

## తొలి చిత్రం ప్రేమకోసం

దర్శకుడు వీరశంకర్ నాకు స్నేహితుడు. నీలో ఒక రైటర్ ఉన్నాడు, సినిమా కథ రాయొచ్చుకదా అని ప్రోత్సహించారు. అలా ఆయనకు 'ప్రేమకోసం' చిత్ర మూల కథ చెప్పాను. ఆయనకు ఎంతో నచ్చి డెవలప్ చేసుకున్నారు. దీనికి పోసాని మురళీకృష్ణ డైలాగ్స్ రాశారు. అదే నా మొదటి చిత్రం. ఈ చిత్రంలో వినీత్, వెంకట్, ఆశాషైనీ నటించారు. 2001లో ఈ సినిమా విడుదలైంది. ఆ తర్వాత మళ్ళీ నేను ఖాళీ. రచయితగా అభివృద్ధి చెందటానికి ప్రత్యేకించి నేను ఎలాంటి కృషీ చెయ్యలేదు. నా ఆలోచనల్ని స్నేహితులతో చర్చించేవాణ్ణి. ఈ సినిమా ఇలా కాకుండా అలా తీస్తే బాగుండేదేమో, మరోలా తీస్తే బాగుండేదేమో అని వినూత్నంగా ఆలోచించేవాణ్ణి.



## బ్లాక్ బస్టర్ 'కిక్'

నేను రచించిన పూర్తిస్థాయి సినిమా కథ 'అశోక్'. 2006లో విడుదలైంది.

జూనియర్ ఎన్.టి.ఆర్ చిత్రానికి సురేంద్రరెడ్డి దర్శకుడు. ఆయనతోనే ఎక్కువ సినిమాలు చేశాను. 2011లో జూనియర్ ఎన్.టి.ఆర్ 'ఊసరవెల్లి'తో నాకు చాలా మంచి పేరు వచ్చింది. దీనికిముందు 'కిక్' చిత్రంతో పరిశ్రమ నన్నో మంచి రచయితగా గుర్తించింది. 2009లో విడుదలైన ఈ బ్లాక్ బస్టర్ మూవీ నా ఫస్ట్ కమర్షియల్ హిట్. నా జీవితంలో ఇదే పెద్ద టర్నింగ్ పాయింట్. దీంతో నాకు డిమాండ్ పెరిగి దర్శకులు నా కథలు వినడానికి సిద్ధపడ్డారు.

## రేసుగుర్రం

2014లో నావి రెండు చిత్రాలు విడుదలయ్యాయి. 'ఎవడు?' వంశీ పైడిపల్లి దర్శకుడు. రామ్‌చరణ్, అల్లుఅర్జున్ నటించారు. ఇక 'రేసుగుర్రం' మరో బ్లాక్‌బస్టర్ మూవీ. ఆ ఏడాదిలో ఇలా నేను రెండు హిట్లు చవిచూశాను. అయితే కల్యాణ్‌రామ్ 'కత్తి', కిక్-2 నా కెరీర్‌ను దెబ్బతియ్యకపోయినా ఫెయిల్ కావడం బాధ కలిగించింది. ఉదయ్‌కిరణ్, ప్రత్యూష, గజాల నటించిన 'కలుసుకోవాలని', శివాజి, మీరా జాస్మిన్ నటించిన 'అమ్మాయి బాగుంది' రెండు చిత్రాలకు డైలాగ్స్ రాశాను.

## మంచి గౌరవం తెచ్చిన టెంపర్

జీవితంలో నాకు విజయంతో పాటు చిత్ర పరిశ్రమలో మంచి గౌరవాన్నిచ్చిన సినిమా 'టెంపర్'. జనం దీనిపై చర్చించారు. ఈ చిత్ర దర్శకుడు పూరీ జగన్నాథ్ తనే కథ రాసుకుంటాడు. కానీ బైట కథ తీసుకున్నది మొట్టమొదట నా దగ్గరే. నా క్లోజ్ ఫ్రెండ్ జూనియర్ ఎన్.టి.ఆర్ ఈ స్టోరీ లైన్ పూరీకి చెప్పడంతో నచ్చి తీసుకున్నాడు. నేను ఎంతోబాగా ఎంజాయ్ చేసిన చిత్రం 'టెంపర్'. తమిళ్‌లో విశాల్ హీరోగా, హిందీలో రణవీర్‌సింగ్ హీరోగా రోహిత్‌శెట్టి దర్శకత్వంలో ఈ చిత్రం రీమేక్ కాబోతోంది.

## ఇంగ్లీషు నవలగా 'టెంపర్' చిత్రం

టెంపర్ సినిమా గురించి ప్రత్యేకంగా చెప్పాలి. ఇప్పుడిది ఇంగ్లీషు నవలగా అంతర్జాతీయ బుక్ మార్కెట్‌లోకి త్వరలో విడుదలవుతోంది. సినిమాకుండే లిమిటేషన్స్ వల్ల ఈ చిత్రంలో చెప్పదల్చుకున్న విషయాలు కొన్ని చెప్పలేకపోయాను. ఆ చేర్పులన్నీ ఈ నవలలో కనిపిస్తాయి. జూనియర్ ఎన్టీఆర్ చేసిన దయ పాత్ర నా మనసుకు దగ్గరగా ఉన్న పాత్ర. ఈ కథ యూనివర్సల్ సమస్య. స్త్రీ సమస్య. ఏ ఒక్క దేశానికో, ప్రాంతానికో పరిమితం కాదు. క్లైమాక్స్ సహా కొద్ది మార్పులు చేర్పులతో ఉంటుందీ 'టెంపర్' నవల. ఎనిమిది నెలల కృషితో నవలగా తీర్చిదిద్దాను. హ్యారీపోటర్ వంటి పుస్తకాలు ప్రచురించిన ప్రఖ్యాత అంతర్జాతీయ 'బ్లూమ్స్‌బెర్రీ' ప్రచురణ సంస్థ ఈ నవలను ప్రచురిస్తోంది.

ఎన్నో నవలలు సినిమాలుగా రూపుదిద్దుకున్నాయి. కానీ ఒక తెలుగు సినిమా కథ పుస్తక రూపంలో అందునా ఇంగ్లీష్ నవలగా అంతర్జాతీయంగా విడుదల అవుతూ ఉండటంతో చిత్ర పరిశ్రమలో ఎంతోమంది సంతోషిస్తున్నారు. నన్ను అభినందిస్తున్నారు. ఈ కథలో ఒక సందేశం ఉంది. ఇది కేవలం మాస్ కథ కాదు, ఇది ఒక లోతైన సమస్య.

ప్రతి మనిషిలో మంచీ చెడూ ఉంటాయి. ఈ రెంటిలో మనం ఏది పెంచి పోషిస్తే అదే పెరుగుతుంది. 'టెంపర్' చిత్రంలో దయ పాత్ర అదే. ముఖ్యంగా మానవతా విలువలు, మానవీయ భావోద్వేగాలను చర్చకు పెట్టేందుకు ఈ సినిమా ఎంతో అవకాశం కలిగించింది. హీరో పాత్రలో నెగెటివ్ షేడ్స్ ఉంటాయి. కానీ జూనియర్ ఎన్.టి.ఆర్ ఈపాత్రను కమర్షియల్‌గా హీరో ఇమేజ్‌కి అనుగుణంగా చూడకుండా అంగీకరించి ఎంతో కమిటెడ్‌గా చేశాడు.




కుటుంబ సభ్యులతో...

## దర్శకుడుగా

ప్రస్తుతం 'టచ్ చేసి చూడు' షూటింగ్ జరుగుతోంది. రవితేజ హీరో. ఈ కథ నాదే. కాగా మొదటిసారి దర్శకత్వశాఖలోకి ప్రవేశిస్తున్నాను. రామలక్ష్మీ సినీ క్రియేషన్స్ పతాకంపై నాగేంద్రబాబు సమర్పణలో అల్లు అర్జున్ హీరోగా ఒక చిత్రం నా దర్శకత్వంలో సెట్స్‌కి వెళ్ళబోతోంది. లగడపాటి శ్రీధర్ నిర్మాత.

## సినిమా ఓ అందమైన అబద్ధం!

సరిగ్గా చెప్పాలంటే సినిమా ప్రేక్షకుణ్ణి మాయ చెయ్యాలి తప్ప మోసం చెయ్యకూడదు. అందుకే సినిమా ఓ అందమైన అబద్ధం! అది ఎంతో బాగుం

